

# శ్రీ రుక్మిణీ కళ్యాణం

బమ్మెర పోతనామాత్య ప్రణీతము - వైష్ణవీ వ్యాఖ్యా విలసితము

బమ్మెర పోతనామాత్య ప్రణీతము

శ్రీ

# రుక్మిణీ కల్యాణము

వైష్ణవీ వ్యాఖ్యా విలసితము

వ్యాఖ్యాత

శ్రీ కె.వి. రాఘవాచార్యులు

సంపాదకులు

శ్రీ చల్లా సాంబిరెడ్డి, బి.ఎ., ఎల్ఎల్.బి.




ప్రచురణ

శ్రీపావని సేవాసమితి

ఎస్.ఆర్.టి. 270, సనత్‌నగర్, హైదరాబాద్ - 500018

ఫోన్ : 23702898

శ్రీ పావని సేవా సమితి ప్రచురణ నెం. 12
శ్రీమద్భాగవత సుధాలహరి-2

ప్రథమ ముద్రణము - 2006 అక్టోబర్ ప్రతులు 1000


**SRI RUKMINI KALYANAMU**

| | |
|---|---|
| శ్రీ రుక్మిణీ కల్యాణము | : శ్రీ బమ్మెర పోతనామాత్య ప్రణీతము |
| వ్యాఖ్యాత | : శ్రీ కె. వి. రాఘవాచార్యులు |
| With Commentary named | : వైష్ణవీ వ్యాఖ్యా విలసితము |
| Divine Blessings by | : శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారు |
| Appreciation by | : "మహామహోపాధ్యాయ" శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు |
| Edited by | : Sri **CHALLA SAMBI REDDY**, B.A., LL.B. |


| | |
|---|---|
| Published & Rights reserved by | : **SRI PAVANI SEVA SAMITHI** (Reg) Sri Sai Nilayam - S.R.T. 270 Sanathnagar Hyderabad - 500 018, Ph : 23702898. |
| Price | : **Rs. 100/-** |
| Type setting at | : Fontline Graphics, Baglingampally, Hyderabad - 500 044, Phone. 27660000. |
| Printed at | : Sri Sai Ram Printers, Lakdikapool, Hyderabad - 500 004, Phone. 23232316. |

శ్రీమతే రామానుజాయ నమః




**Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamy**

Jeeyar Educational Trust,
Sitanagaram - 522 501
Guntur District (A.P.)
Ph : (08645) 272929, 272353


Dt : 22.09.2006

ప్రియ శ్రీమాన్! రాఘవాచార్యులు గారూ!
శ్రీమతే నారాయణాయ నమః
అనేక మంగళాశాసనములు

మీరు సుమధుర సంప్రదాయ పరిమళాలనూదుతూ వ్యాఖ్యానించిన శ్రీ రుక్మిణీ కల్యాణ గ్రంథాన్ని చూశాం. "ఎంత మంచివ్యాఖ్య" అనిపించింది. ప్రతి పదార్థ తాత్పర్యాలతోనే ఆగక 'వైష్ణవీ సుధాకలశం' అమృతం పొంగి 'ఏత్తక్కళంగళ్' లాగా పొంగి సంప్రదాయ మధురిమలతో జాలువారింది. చాల ఆనందం కలిగింది.

'శ్రీకంఠచాపఖండన' లోనే మీ వ్యాఖ్యా వైశారద్యం మా హృదయాన్ని ఆకట్టుకుంది. ఈ కందంలోపల ఇంత అందంవుందా! అనిపించింది మాకు. అదికందమా! కవిత కందమా? సంప్రదాయ మాకందమా! అనే శంక కలిగించింది మీ వైష్ణవీ వ్యాఖ్య!

శ్రీ రుక్మిణీ కల్యాణ పద్యాలే హృద్యాలనుకుంటూఉండేవాళ్ళం. ఇవాళ తెలిసింది ఆ పద్యాల్లో అందం. కందంలో వెలుగులేకాదు, వ్యాఖ్య అంతా అలాగే సాగిందని తెలుస్తోంది మీ వ్యాఖ్యా వైభవం వలన.

చిన్ననాటనే అందరిచేత రుక్మిణీ కల్యాణం చదివించేవారు మన పెద్దలు. ఇప్పుడు ఆవిధానం కలవైపోయింది. ఆనాడు బాలబాలికలు రుక్మిణీ కల్యాణం చదివితే - ఈనాడు మీ వ్యాఖ్యానం పెద్దలచేకూడ రుక్మిణీ కల్యాణాన్ని చవించేలా వుంది. అందరిలోను ఆ రుచి పుట్టిస్తోంది.

ఇంత చక్కని వ్యాఖ్య ననుగ్రహించిన మీరు ధన్యులు. చదివినవారు మరింతధన్యులు. అవును. ఇన్నాళ్లకు ఒక మంచి వ్యాఖ్యానాన్ని చవిచూచింది రుక్మిణీ కల్యాణం. మిగిలిన భాగవతమంతా యిలాటి వ్యాఖ్యతో విలసిల్లితే ఎంత బాగుంటుంది? అదేదో చేయి ఆపకుండ మీరే చేయవచ్చును గదా! మీ వ్యాఖ్య మిగిలిన భాగవతాన్ని కూడ వ్యాఖ్యానించి "తామద్యఉజ్జీవయిష్యతి" అన్నట్లు భాగవతంతో పాటు భాగవతోత్తములకు కూడ ఉజ్జీవనం కలిగించగలరని ఆశిస్తూ మీకు అనేక అనేక మంగళా శాసనాలు చేస్తున్నాం.

జై శ్రీమన్నారాయణ

22/9/06

(శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి)



శ్రీః

నాలుగు దశాబ్దాలుగా నాకు అన్ని వేళలా చేదోడు వాదోడుగా ఉంటూ, భగవంతు డనుగ్రహించిన ఈ మానవ జన్మను యథాశక్తి సమాజానికి ఉపకరించడం ద్వారా సార్థకం చేసుకోవాలను తలంపుతో నేను చేపట్టిన కార్యక్రమాలన్నింటినీ త్రికరణశుద్ధిగా ప్రోత్సహిస్తూ, ఆ కార్యక్రమాలవల్ల నాకు కలుగు ఆనందాన్ని ఇనుమడింపచేసి తాను కూడా మాటల కందని ఆ అపూర్వానందంలో పాలు పంచుకొంటూన్న

నా అర్ధాంగి

**చి.ల.సౌ. గాయత్రీదేవికి**

**చల్లా సాంబిరెడ్డి**



# ఆముఖం

ప్రాచీనాంధ్ర మహాకావ్యాలలో శ్రీమదాంధ్ర మహాభాగవతానికున్న లోకప్రియత్వం అసాధారణమైనది. సహజకవీ, అనేక శాస్త్రమర్మజ్ఞుడూ, శివకేశవుల మధ్య భేదం ఎరుగని మహాభక్తుడూ, సరస్వతీ సాక్షాత్కారం పొందిన సారస్వతోపాసకుడూ అయిన బమ్మెర పోతనామాత్యుని ఘంటం నుంచి వెలువడినది మొదలు నేటి వరకు మహాకావ్యసదృశమైన ఈ మహాపురాణం ఎందరో సహృదయులకు లోకోత్తరానందం కలిగిస్తూనే ఉంది. దీనిలోని కొన్ని పద్యాలైనా కంఠస్థం చేయని అక్షరాస్యుడు గాని, నిరక్షరస్యుడైనా, విని ఆనందించని వాడు గాని తెలుగునాట ఉండడంటే అతిశయోక్తి కాదు.

పోతన తన సారస్వత ప్రతిభనంతనీ వినియోగించి, మూలంలో లేని అనేక నూతన భావాలను స్వబుద్ధిచేత కల్పించి, ప్రాచీన సంస్కృతాంధ్ర కావ్యాలలో ఉన్న కొన్ని అందమైన అంశాలను కూడ అక్కడక్కడ పొందుపరచి చేసిన అద్భుతమైన వర్ణనలూ, అప్రయత్నంగా దొరలిన శబ్దాలంకారాలూ, కథాగమనానికి ఏ మాత్రము అడ్డుతగలని అర్థాలంకారాలూ, ప్రసాదగుణభూయిష్ఠమైన సుమధురశైలీ, పాఠకులకూ శ్రోతలకూ కూడ తన్మయత్వాన్ని కలిగించే విధంగా అభివ్యంజితములైన రసభావాదులూ - ఇవన్నీ ఈ మహాకావ్యానికి ఆంధ్ర వాఙ్మయంలో అత్యున్నతమైన స్థానాన్ని సంపాదించిపెట్టాయి. ఈ మహాకవి భాగవతంలో ఉన్న 24 మహావిష్ణ్వవతారాలకీ, భగవద్భక్తులకీ సంబంధించిన వివిధోపాఖ్యానాలను మూలానుసారంగా చెపుతూనే, ఆ ఉపాఖ్యానాలతో రోచకములైన కొన్ని ఘట్టాలు ఏర్పరచి వాటిని అందమైన లఘు కావ్యాలుగా తీర్చిదిద్దాడు. జడభరతోపాఖ్యానం, వామనావతారం, గజేంద్రమోక్షం, ప్రహ్లాదచరిత్ర, రుక్మిణీ  కళ్యాణం మొదలైనవి అలాంటి ఘట్టాలే.

ఈ ఘట్టాలలో పోతన ప్రవేశపెట్టిన కొన్ని నూతన వర్ణనలకు ఒకటి రెండు ఉదాహరణలు: (1) వామనుడు త్రివిక్రముడై భూనభోంతరాళాలను తన శరీరంతో ఆక్రమిస్తున్న సందర్భంలోని నూతన భావాలున్న కొన్ని పద్యాలలో ఈ క్రింది పద్యం ప్రసిద్ధమైనది.

మే. **"రవిబింబంబుపమింపఁ బాత్రమగుఛత్రంబై శిరోరత్నమై**
**శ్రవణాలంకృతమై గళాభరణమై సౌవర్ణకేయూరమై**
**ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్వస్త్రమైనూపుర**
**ప్రవరంబై పదపీఠమై వటుడు దాబ్రహ్మాండమున్ నిండుచోన్"**

అలంకార సర్వస్వానికి వ్యాఖ్యయైన విమర్శినిలో (12వ శతాబ్దం) ఉదాహరించిన ఈ క్రింది శ్లోకంలోని భావాన్ని పోతన గ్రహించి ఉంటాడు. -

**"కిం ఛత్రం కిం ను రత్నం తిలకమథ తథా కుణ్డలం కౌస్తుభో వా**
**చక్రం వా వారిజో వేత్యమరయువతిభిర్యద్బలిద్వేషి దేహే,**
**ఊర్ధ్వం మౌలౌ లలాటే శ్రవసి హృది కరే నాభిదేశే చ దృష్టం**
**పాయాత్తద్వో౽ర్కబిమ్బం స చ దనుజరిపుర్వర్ధమానః క్రమేణ"**

త్రివిక్రముని శరీరం క్రమక్రమంగా పెరుగుతూండగా ఇంకా పైనే ఉన్న సూర్యబింబాన్ని చూచి దేవకాంతలు ఛత్రం అనుకున్నారట. క్రమంగా శిరో-లలాట-శ్రవణ-హృదయ-హస్త-నాభి ప్రదేశాల దగ్గరికి వచ్చేసరికి దానినే వరసగా శిరోరత్నమా, తిలకమా, కుండలమా, కౌస్తుభమణియా, చక్రాయుధమా, పద్మమా అనుకొన్నారట. అలాంటి సూర్యబింబమూ ఆ దనుజరిపువూ కూడ మిమ్ములను రక్షించుగాక అని పై శ్లోకానికి భావం. ఐతే సంస్కృతపద్యంలో సూర్యబింబం త్రివిక్రముని నాభీస్థలం వరకూ వచ్చినట్లు చెప్పి కవి దానిని అంతకు క్రిందికి దింపలేదు. అదే యుక్తం కూడ. "నూపురప్రవరమై పదపీఠమై" అన్నట్లు చివరికి సూర్యబింబం త్రివిక్రముని పాదపీఠం అయింది అని చెపితే త్రివిక్రముడు నేలమీద కాక నేల విడచి సూర్యమండలం మీద నిలబడినట్లు అర్థం వస్తుంది. విశ్వరూపాన్ని వర్ణించేటప్పుడు "నాభిని నభంబును" అని పోతనయే (మూలానుసారంగా) వర్ణించనున్నట్లు నభఃస్థానం నాభియైతే నభోమణి నాభిస్థానంలో ఉండడమే యుక్తం కదా?

నరకాసుర సంహార ఘట్టంలో మూలంలో "సభార్యో గరుడారూఢః ప్రాగ్జ్యోతిషపురం యయౌ" (శ్రీకృష్ణుడు భార్యతో (పేరు చెప్పలేదు) కలిసి ప్రాగ్జ్యోతిషపురానికి వెళ్ళాడు) అని మాత్రమే చెప్పబడింది. శ్రీకృష్ణుడు సత్యభామతో కలిసి యుద్ధానికి వెళ్లినట్లూ, యుద్ధంలో శ్రీకృష్ణునికి విశ్రాన్తి అవసరమైనట్లూ అప్పుడు సత్యభామ శస్త్రధారిణియై నరకాసురునితో యుద్ధం చేసినట్లూ కల్పించి పోతన చాల మనోహరమైన పద్యాలు కొన్ని మనకు బహూకరించాడు. వాటిలోని -

**పరుఁజూచున్ వరుఁజూచు నొంపనలరింపన్ రోషరాగోదయా**
**విరతభ్రూకుటి మందహాసములతో, వీరంబు శృంగారమున్**
**జరగన్, కన్నుల కెంపుసొంపు పరగన్, చండాస్త్రసందోహమున్**
**సరసాలోక సమూహమున్ నెరపుచున్ చంద్రాస్యహేలాగతిన్.** (బ.పో)

అను పద్యం -

**"అరిఁజూచున్ హరిఁజూచు చూచుకములై యందందమందార కే**

**సరమాలామకరంద బిందు సలిలస్యందంబులందంబులై**

**తొరగన్, పయ్యెద కొంగొకింత తొలగన్, తోడ్తో శరాసారమున్**

**దరహాసామృతపూరమున్ కురియుచున్ దన్వంగి హేలారతిన్"**

అను నాచన సోమనాథుని పద్యానికి అనుకరణం. ఈ విధంగా తన వినూత్న కల్పనలతో పాటు ప్రాచీనములైన కొన్ని మనోహర వర్ణనలూ భావాలూ కూడ చేర్చడంలో పోతన ప్రధానోద్దేశ్యం అతి మనోహరమైన కావ్యాన్ని పఠితులకు అందించడమే.

ప్రకృతమైన రుక్మిణీ కల్యాణంలో కూడ పోతన అనేక వినూత్న కల్పనలు చేసి మనకొక చక్కని కావ్యఖండికను (ఖండకావ్యాన్ని) అందించాడు. మూల భాగవతంలోని ఈ ఘట్టంలో మొత్తం 141 శ్లోకాలు ఉన్నాయి. అనువాదంలో 73 పద్యాలు, కొన్ని వచనాలు (గద్యాలు) ఉన్నాయి. పద్యాలు చాలవరకు పెద్ద వృత్తాలలోను, సీసాలలోను ఉన్నాయి. ఒక్కొక్క గద్యం ప్రమాణం కొన్ని వృత్తాల ప్రమాణంలో ఉంటుంది. ఈ విధంగా చూస్తే అనువాదం ప్రమాణం మూలం ప్రమాణం కంటె ఇంచుమించు రెట్టింపు ఉంటుంది. ఇదొక మధురమైన లఘుకావ్యము.

ఈ లఘుకావ్యంలో పోతన చేసిన ప్రధానమైన మార్పులు చేర్పులు ఏడెనిమిది స్థలాలలో ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించిన శ్రీ మహాభాగవతం పీఠికలో తత్సంపాదకులు వీటిని చూపి ఉన్నారు.

కావ్య ప్రారంభ భాగంలోని "బావేందు లేఖఁ దోచిన" (6) "వేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు" (7) "దేవకీ సుతుకోర్కి తీగల వీడంగ" (8) అను రుక్మిణి బాల్య-యౌవ్వన దశలను వర్ణించు మూడు పద్యాలు మూలంలో లేనివి, పోతన కల్పించినవి.

రుక్మిణి బ్రాహ్మణుని ద్వారా కృష్ణునికి పంపిన సందేశము మూలములో ఉన్నదానికంటె కొంచెం దీర్ఘంగా ఉంది. బ్రాహ్మణుడు కృష్ణునకు సందేశం తెలిపిన తరవాత చేసిన రుక్మిణీ సౌందర్య వర్ణనాదులు పోతన కల్పించినవే. బ్రాహ్మణుడు తిరిగి వచ్చుటలో ఆలస్యం జరిగినందుకు రుక్మిణి అధికముగా విచారగ్రస్తురాలై ఉండడం, ఆమె విరహ బాధ- ఈ వర్ణనలు కూడ పోతన కల్పించినవి. పార్వతిని ఆరాధించి రుక్మిణి బైటకు వచ్చు సందర్భంలో (గద్యంలో) చేసిన రుక్మిణీ వర్ణనము, జరాసంధాది పరాజయ వర్ణనము - ఇవన్నీ అమూలకములే. రుక్మి శ్రీకృష్ణుని అడ్డగించి ఆతన్ని నిందించు సందర్భంలో పోతన వ్రాసిన రెండర్థాలు గల పద్యం అమూలం; ఆతని పాండిత్యప్రకర్షను సూచిస్తూన్నది.

ఈ రుక్మిణీ కల్యాణ కావ్యానికి ఎంత సహృదయాహ్లాదకత్వం ఉన్నదో అంత పవిత్రత్వం కూడ ఉన్నది. దీనిని శ్రద్ధాభక్తులతో చదివిన అవివాహితులకు తప్పక వివాహం జరుగుతుందని ఆంధ్రుల విశ్వాసం. కాళిదాసు రచించిన కుమారసంభవంలోని పార్వతీతపోవర్ణనం చేసిన పంచమసర్గకు ఇలాంటి వైశిష్ట్యం ఉన్నదని ఉత్తర దేశీయుల నమ్మకం. కవి తపఃశక్తి కలుస్తే కథలో ఉన్న పవిత్రత్వం ద్విగుణీకృతం అవుతుంది.

ఈ రుక్మిణీ కల్యాణ కావ్యాన్ని శ్రీ పావని సేవా సమితి స్థాపకులు, సంచాలకులు అయిన శ్రీ చల్లా సాంబిరెడ్డిగారు, వారికి కార్యనిర్వహణ సహకారులుగా ఉన్న శ్రీ జి.సి.హెచ్. రామారావుగారు, ఈ సమితి ద్వారా విద్వద్వరేణ్యులు, విస్తృత ప్రామాణిక వ్యాఖ్యా నిర్మాణచణులూ అయిన శ్రీ కే.వి. రాఘవాచార్యులుగారు రచించిన వ్యాఖ్యానముతో అలంకరించి ప్రచురించడం పాఠకలోకానికి ఎంతో ముదావహంగా ఉంది. అందుకు కారణం - ఈ వ్యాఖ్య, అర్థతాత్పర్యాలు మాత్రమే తెలుసుకొని సంతృప్తిపడేవారికే కాక, ఏతత్కావ్యసంబద్ధాలైన అనేక విషయాలను తెలుసుకొనడంలో ఆసక్తి గల నూతన విషయ జిజ్ఞాసువులకు కూడ ఎంతో ఆనందజనకంగా ఉండడం.

వ్యాఖ్యాత, శ్రీరాఘవాచార్యులుగారు తమ విస్తృత వ్యాఖ్యానంలో అనేక శ్రుతి-స్మృతి-పురాణాదుల నుండి, ఇతర ప్రాచీన కావ్యాలనుండీ ఎన్నో విషయాలు సందర్భానుసారంగా గ్రహించి ఉదాహరించారు. మూల భాగవతానికి ఎన్నో ఇతర వ్యాఖ్యానాలతో పాటు, అద్వైత-విశిష్టాద్వైత - ద్వైత సంప్రదాయపరంగా వ్రాసిన వ్యాఖ్యానాలున్నాయి. ఇది వల్లభ సంప్రదాయం వారికి, చైతన్య సంప్రదాయం వారికి, ఆధునిక కాలానికి చెందిన హరేరామ హరేకృష్ణ (ఇస్కాన్) సంప్రదాయం వారికీ, పరమ పవిత్రగ్రంథం . వ్యాఖ్యాత కొన్ని ప్రదేశాలలో విశిష్టాద్వైత సంప్రదాయానికి సంబంధించిన అంశాలు కూడ వివరించారు. ఈ విధంగా 'వైష్ణవీ' అను ఈ వ్యాఖ్య పేరు అన్వర్థకం. ఆచార్యుని సాహాయ్యం లేనిదే భక్తులు భగవదనుగ్రహపాత్రులు కాజాలరని విశిష్టాద్వైత సంప్రదాయం. సందేశహరుడైన బ్రాహ్మణుడు రుక్మిణిని భగవత్సంనిధికి చేర్చిన ఆచార్యుడుగా ఉపకరించాడు అని వ్యాఖ్యాత వివరించారు (పేజి.35)

దశమ స్కంధ ప్రారంభంలో ఉన్న 'శ్రీకంఠచాపఖండన' అను పద్యాన్ని వ్యాఖ్యా ప్రారంభంలో వివరిస్తూ దీనికి శ్రీరామపరంగా ప్రసిద్ధమైన అర్థంతోపాటు శ్రీకృష్ణపరంగా కూడ వీరు చెప్పిన అర్థం పాండితీ పూర్ణంగా ఉంది. శ్రీకంఠ శబ్దానికి నీలకంఠశోభితుడైన శివుడు అను అర్థం ప్రసిద్ధమైనది. శివుని నీలకంఠత్వానికి కారణం చెపుతూ అనేక పురాణాలలో ఉన్న హాలాహల

విష కంఠనిరోధన కథ ప్రసిద్ధమైనది. ఇది పరమేశ్వరుని మహామహిమత్వాన్ని చాటే కథ. ఈ కథ నీలకంఠత్వాన్ని సమర్ధిస్తుంది కాని శివుడు శ్రీకంఠుడెందుకయ్యాడో తెలియదు. 'శ్రీ' శబ్దానికి 'నల్లనికాంతి' ఇత్యాది లాక్షణికార్థాలు చెప్పుకొని సరిపెట్టుకొంటున్నాం. అందుచేతనే ఈ కథతో పాటు శ్రీ ఆచార్యులు గారు శివ విష్ణుమాహాత్మ్యాన్ని సమంగా సూచించే మరొక కథ కూడ వ్రాశారు. మహాభారతంలో ఉన్న ఈ కథ ప్రకారం శివుడు దక్షాధ్వర ధ్వంసం చేస్తూన్నప్పుడు పొరబాటున ఆతని శూలం నారాయణునికి తగలడంతో కోపించిన నారాయణుడు శివుని కంఠం గట్టిగా పట్టుకొనగా ఆతని కంఠం కమిలి నీలవర్ణమైనది. అది వారిద్దరి మధ్యా భయంకర యుద్ధానికి దారితీసింది. బ్రహ్మదేవుడు వచ్చి శివుని శాంతింపచేసి, నారాయణుని గొప్పతనాన్ని శివునకు తెలిపి, ఆతనిని క్షమింపచేసికొనవలసినదిగా ఉపదేశించాడు. శివుడు ఆ విధంగా చేయగా నారాయణుడు కూడ శాంతించి శివునితో ఇలా అన్నాడు -

**యస్త్వాం వేత్తి స మాం వేత్తి యస్త్వామను స మామను,**
**నావయోరన్తరం కించిత్ మా తే భూద్బుద్ధిరన్యథా.**

**అద్య ప్రభృతి శ్రీవత్సః శూలాంకో మే భవత్వయమ్,**
**మమ పాణ్యంకితశ్చాపి శ్రీకంఠస్త్వం భవిష్యసి.**

*(శాంతిపర్వ, 342 అధ్యా. 133, 134 శ్లో)*

"నీ తత్త్వం తెలిసినవాడు నా తత్త్వం కూడ తెలిసినవాడే అవుతాడు. నిన్ను సేవించేవాడు నన్ను సేవిస్తున్నట్లే. మన ఇద్దరి మధ్యా ఏ మాత్రము భేదం లేదు. నువ్వు మనస్సులో మరేమీ అనుకొనవద్దు".

"నా వక్షఃస్థలం మీద పడిన నీ శూలం గుర్తు ఈనాడు మొదలు నాకు 'శ్రీవత్సం' అను (పుట్టు)మచ్చగా ఉంటుంది. నా చేతి గుర్తు పడడంచేత నువ్వు ఇటుపైన 'శ్రీకంఠుడవు" అవుతావు"

ఇదీ శివుని శ్రీకంఠత్వానికి అసలు కారణం. అంతగా ప్రసిద్ధం కాని ఈ కథను కూడ ఇక్కడ ఉదాహరించడం చాల ఉచితంగా ఉంది.

ఈ విధంగా శివుని పారమ్యాన్నీ, విష్ణుపారమ్యాన్నీ, దేవీపారమ్యాన్నీ, ఇతర దేవతల పారమ్యాన్నీ వర్ణించే కథలు పురాణాలలో కోకొల్లలు. వీటినన్నింటినీ సమన్వయించుకోవాలంటే, "సత్పదార్థం" (పరతత్త్వం) ఒక్కటే; దానికి పండితులు అనేకమైన నామధేయాలు పెట్టి

వర్ణిస్తూంటారు" అని చెప్పే "ఇన్ద్రం మిత్రం వరుణమగ్ని మహోరథో దివ్యః సుపర్ణోగరుత్మాన్, ఏకం సద్విప్రా బహుధా వదన్తి, అగ్నిం యమం మాతరిశ్వానమహుః" (ఋగ్వేదం. 1.10.164) ("ఒకే సత్పదార్థాన్ని పండితులు ఇంద్రుడనీ, మిత్రుడనీ, వరుణుడనీ, అగ్ని అనీ, ద్యులోకంలో సంచరించే సుపర్ణుడైన గరుత్మంతుడనీ, యముడనీ, వాయువనీ వర్ణిస్తున్నారు" అని దీని అర్థం) ఋగ్వేదంలోని ప్రసిద్ధమైన ఋక్కు సర్వదా దృష్టిలో ఉంచుకోవాలి. శివుడు విష్ణురూపుడు; విష్ణువు శివరూపుడు; శివుని హృదయం విష్ణువు; విష్ణుని హృదయం శివుడు; వారిద్దరికీ నమస్కారం. విష్ణువు శివమయుడు; శివుడు విష్ణుమయుడు; వీరిద్దరిలో భేదబుద్ధి లేనంతవరకు నాకు స్వస్తీ, దీర్ఘాయుర్దాయమూ లభిస్తాయి" అని మనం నిత్యం పఠించే శ్లోకాలు గుర్తుకు వస్తాయి.

**"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే,**
**శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః,**
**యథా శివమయో విష్ణురేవం విష్ణుమయః శివః,**
**యథాన్తరం న పశ్యామి తథా మే స్వస్తిరాయుషీ"**

లక్ష్మి - సరస్వతీ - పార్వత్యాది దేవీ మూర్తుల విషయంలో కూడ ఇదే భావన. అందుచేతనే లక్ష్మియైన రుక్మిణి భవానిని ఆరాధించడం, ఆమె అనుగ్రహంకోరడం ఇత్యాది విషయాలు కుదురుతాయి. ఈ విషయాలన్నీ కొన్ని చోట్ల స్పష్టంగాను, కొన్ని చోట్ల సూచనప్రాయంగాను శ్రీమద్భాగవతంలో అడుగడుగునా మనకు కనబడతాయి.

"ఉమామహేశ్వర ధ్యానంబు సేయుచు కించిదున్మీలితలోచనుండు" అయిన పోతనకు శ్రీ మహావిష్ణువు (శ్రీరాముడు) ప్రత్యక్షం అవడం ద్వారా ఆతడు ధ్యానిస్తూన్న శివుని తనకూ భేదం లేదని ఆ పోతనకీ, తద్ద్వారా భగవద్భక్తులకూ సూచించాడు (ఆం.మ.భా.ప్ర.స్కం. 13-15).

భీష్మకుని ఐదుగురు కుమారులు, రుక్మిణీ వీరు వరుసగా ఆవిద్యా - అస్మితా - రాగ - ద్వేష - అభినివేశ - సాత్త్వికబుద్ధులకు ప్రతీకలనీ, భీష్మకుడు బ్రహ్మవిద్వరిష్ఠుడనీ వీరు చేసిన ప్రతిపాదన శాస్త్రసంమతమైనది. ఇవి సాధారణంగా ఇలాంటి కథలలో పండితులు చేప్పే, సాధకుల మనస్సులకు బాగా హత్తుకొని వారి సాధనకు ఉపయోగించే, యోగశాస్త్రాదు సాహాయ్యంతో జాగర్తగా అర్థంచేసికొనవలసిన సాంప్రదాయిక విషయాలు (పేజి. 25).

ఒక ఘట్టంలో ధర్మశాస్త్ర ప్రతిపాదితాలైన అష్టవిధవివాహాల స్వరూపం వివరించి రుక్మిణీ శ్రీకృష్ణుల వివాహంలో రాక్షసవివాహ - స్వయంవరవివాహాల సంమిశ్రణం ఉన్నదని

చమత్కారంగా ప్రతిపాదించారు. దాదాపు అన్ని పద్యాలలోనూ ఉన్న అలంకారాలూ, రసభావాది విశేషాలు, కల్పనాచాతుర్యమూ మొదలైన అంశాలను ఏ ఒక్కటీ విడవకుండా వ్యాఖ్యాత చక్కగా వివరించారు.

ఈ లఘుకావ్యంలో పోతన మూలంలోని లేని మనోహరములైన వర్ణనలతో చక్కని పద్యాలు ఎన్నో రచించి ఉన్నాడని వెనుక చూచి ఉన్నాం. పోతన కల్పించిన అలాంటి పద్యాలలో మకుటాయమైనది రుక్మి శ్రీకృష్ణుని ఎదిరిస్తూ పలికిన ఈ క్రింది పద్యం. ఇది పోతన పాండిత్యానికీ, కవిగా ఆతని ప్రతిభకూ, ఆతనికున్న వేదాంత శాస్త్రవైదుష్యానికీ ఒక విశిష్టమైన ఉదాహరణం :

సీ. **మా సరివాడవా మా పాపగొనిపోవ**
**నేపాటి గలవాడ వేది వంశ**
**మెందు జన్మించితి వెక్కడ బెరిగితి**
**వెయ్యది నడవడి యెవ్వఁడెరుగు**
**మానహీనుడవీవు మర్యాదలెరుగవు**
**మాయగైకొని గాని మలయరావు**
**నిజరూపమున శత్రునివహంబుపై బోవు**
**వసుధేశుడవు గావు వావి లేదు**
**కొమ్మనిమ్ము నీవు గుణరహితుండవు**
**విడవు విడువవేని విలయకాల**
**శిఖిశిఖాసమాన శితశిలీముఖముల**
**గర్వమెల్లఁగొందు గలహమందు.**

ఇది స్తుతిగర్భమైన నిందా వాక్యము. రుక్మి దుర్బుద్ధితో భగవంతుణ్ణి నిందిద్దామనుకొన్నా కూడ భగవత్సన్నిధి మాహాత్మ్యం చేత ఆతని నోటినుండి స్తోత్రరూప వాక్యాలే అప్రయత్నంగా వెలువడ్డాయి. ఈ పద్యంలోని రెండు అర్థాలూ కూడ శ్రీరాఘవాచార్యులు అతి విస్తృతంగా, ప్రమాణ ప్రదర్శనపూర్వకంగా కవితో ఉన్న కవితా-పాండితీ శక్తులను తాముకూడ పుణికిపుచ్చుకొని చక్కగా వివరించారు. ఈ విషయాలన్నీ సహృదయులు స్వయంగా చదివి ఆనందించవలసినవే.

శ్రీ పావని సేవా సమితి స్థాపకులైన శ్రీ చల్లా సాంబిరెడ్డిగారు సమాజంలో రోజు రోజుకు దిగజారిపోతూన్న నైతిక ప్రవృత్తిని కొంతవరకైన పునరుద్ధరించడానికి ఉపాయంగా ప్రధానమైన

కొన్ని శతకాలకు విపుల వ్యాఖ్యా-ఉపోద్ఘాతాదులు పండిత ప్రకాండుల చేత వ్రాయించి వాటి ప్రచారానికై అనేక రీతులలో నిరంతరమూ ప్రయత్నం చేస్తున్నారు. శ్రీ జి.సి.హెచ్. రామారావుగారు ఈ సమితికి కార్యదర్శిగా, శ్రీ కనుమూరి పెద్దిరాజుగారు ఉపాధ్యక్షులుగా ఉండి ఈ సమితి ద్వారా సమాజానికి మహోపకారం చేస్తున్నారు. శతకాలతో పాటు చిన్నవారికీ, భారతీయ సత్సంప్రదాయాలకు దూరం అవుతూన్న కొందరు పెద్దవారికీ కూడ భారతీయ సంస్కృతిలోని వైశిష్ట్యాన్ని తెలపడంకోసం ఆంధ్ర భాగవతంనుండి కొన్ని ఘట్టాలను, ఇంకా మరి కొన్ని నీతి శ్లోకాదులను ప్రకాశించడానికి వీరు పూనుకొన్నారు. లోకోపకారబుద్ధితో తలబెట్టిన ఈ కార్యక్రమానికి తప్పక పరమేశ్వరానుగ్రహం లభించగలదని నా విశ్వాసం.

ఉత్తమ పండితులు, సద్గ్రంథ నిర్మాణదక్షులూ, శ్రీమన్నారాయణ కృపాపాత్రులూ అయిన శ్రీ రాఘవాచార్యులుగారు రచించిన విస్తృతమైన ఈ వ్యాఖ్యానం, వీరే నిర్మించి శ్రీ పావని సేవా సమితి ద్వారా ప్రచురింపజేసిన నారాయణ శతకం వలె ఆంధ్ర పాఠకుల మన్ననలు పొందగలదని విశ్వసిస్తున్నాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు**

హైదరాబాదు
12.8.2006

# మా మాట

శ్రీమద్భాగవతం వేదసారం. అది పరమహంస సంహిత. అదొక ముక్తిశాస్త్రం. భక్తి శాస్త్రం. బ్రహ్మసూత్రాలకు అది భాష్యం. భగవద్గీతకు తాత్పర్యం. సకలపురాణాలలో శిరోమణి శ్రీమద్భాగవతం. అందలి ప్రతిఘట్టము పుణ్యప్రదమైనదే. మహామాన్య మాళవీయ అన్నట్టు అదొక ఆశీర్వాదాత్మకమైన పవిత్ర గ్రంథం. పోతనగారు భాగవతాన్ని తెనిగించి అజరామరమైన కీర్తిని ఆర్జించారు. తెలుగుభాషకు మాధుర్యాన్ని ప్రసాదించారు.

సకల సంప్రదాయాల వారికి ఇష్టమైన "ఎవ్వనిచే జనించు జగము" అనే ప్రార్థనా పద్యం చదవని, వినని తెలుగు వాడుండడు. ఆ పద్యం పోతనగారి భాగవతంలోని గజేంద్రమోక్షంలోనిది. అత్యంత గోపనీయమూ, రహస్యాత్మకమూ అయినదే కాకుండా భగవత్స్వరూపాన్ని అనుభవింపజేసే సమస్త వేదాంత సారమూ, ఆధ్యాత్మిక దీపమూ అయిన శ్రీమద్భాగవతం పట్ల ఎనలేని మక్కువ గల వారు శ్రీ కె.వి. రాఘవాచార్యులు వారు. వారి శ్రీరుక్మిణీ కల్యాణ ఘట్టానికి రచించిన ఈ సవిస్తరమైన "వైష్ణవీ వ్యాఖ్య" సర్వజనామోదం పొందగలదని మా విశ్వాసం.

శ్రీమద్భాగవత సుధాలహరి పరంపరలో గతంలో మేము మహాకవి శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యవారి "గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్యా విలసితము" వ్యాఖ్యగా "గజేంద్రమోక్షము" ఘట్టము ముద్రించినాము. ఇది ద్వితీయ ముద్రణ జరిగినది.

ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య వారి వ్యాఖ్యతో "భక్త ప్రహ్లాద" ఘట్టమును మీకు అందించాలనే మా ఆకాంక్ష త్వరలో నెరవేర గలదని ఆశిస్తున్నాము.

శ్రీపావని సేవా సమితి సవ్యాఖ్యాన శతక సాహిత్య ప్రచురణ చేపట్టి ఇప్పటికి పది శతకాలను పాఠకులకు అందించినది. అవి.

1. 'మహాకవి' శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య వారి గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్యతో శ్రీకృష్ణ శతకము. ఇది పరివర్ధిత శ్రీకృష్ణశతకంగా ద్వితీయ ముద్రణ పొందింది.
2. ఆచార్య యం. కులశేఖరరావు గారి మానసోల్లాస వ్యాఖ్యతో భక్తరామదాసు ప్రణీతము దాశరథి శతకము. ఇది ద్వితీయ ముద్రణ జరిగినది.
3. డా॥ ముదిగొండ వీరభద్రయ్య గారి వ్యాఖ్యతో యధావాక్కుల అన్నమయ్య ప్రణీతము సర్వేశ్వర శతకం. ఇది ద్వితీయ ముద్రణ జరిగినది.

4. "ఆంధ్రవ్యాస" బ్రహ్మశ్రీ ఏలూరిపాటి అనంత రామయ్య గారి వివేకానందిని వ్యాఖ్యతో శ్రీ బద్దెన కవి ప్రణీతము సుమతి శతకము. ఇది ద్వితీయ ముద్రణ జరిగినది.

5. విద్వాన్ డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డిగారి జనప్రియ వ్యాఖ్యతో శ్రీ శేషప్ప కవి ప్రణీతము శ్రీనరసింహ శతకము.

6. పరమ వైష్ణవాచార్యులు శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులు గారి రాఘవీయ వ్యాఖ్యతో శ్రీ బమ్మెర పోతనామాత్య ప్రణీతము శ్రీ నారాయణ శతకము.

7. విద్వాన్ డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి గారి జాగృతి వ్యాఖ్యతో వేమన శతకము.

8. డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు వారి సుదర్శన వ్యాఖ్యతో శ్రీ సూరనకవి ప్రణీతము భాస్కర శతకము.

9. ఆచార్య రవ్వా శ్రీహరి గారి దీపికా వ్యాఖ్యతో శ్రీ ఏనుగు లక్ష్మణకవి ఆంధ్రానువాదం, భర్తృహరి నీతి శతకము.

10. ఆచార్య వల్లపురెడ్డి బుచ్చారెడ్డి గారి దేశికామోద వ్యాఖ్యా విభూషితముతో ధూర్జటి కవి ప్రణీతము శ్రీకాళహస్తీశ్వర శతకము.

ఈ శ్రీరుక్మిణీ కల్యాణము గ్రంధానికి శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జియర్ స్వామి వారి మంగళాశాసనములను అనుగ్రహించమని వినయపూర్వకముగా కోరినాము. అత్యంత ఆదరముతో శ్రీవారు అనుగ్రహించినారు. వారికి మా వినయపూర్వక సాష్టాంగ నమస్కారములు సమర్పించుకొనుచున్నాము.

"మహామహోపాధ్యాయ" ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు గారు అత్యంత దయతో ఈ గ్రంథానికి వారి అమూల్య అభినందన సమీక్ష అందజేసినారు. వారి సహాయ, సలహాలు మాకు లభించటము మా అదృష్టంగా భావిస్తున్నాము. వారికి మా కృతజ్ఞతలను తెలుపుకొంటున్నాము.

ముచ్చటగా టైప్ చేసిన ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్ అధినేత్రి శ్రీమతి నిర్మలగారికి, సుందరముగ ముద్రించిన శ్రీ సాయిరాం ప్రింటర్స్ అధినేత శ్రీ నాగేశ్వరరావుగారికి, మిత్రులకు, శ్రేయోభిలాషులకు మా కృతజ్ఞతలు

**జి. సిహెచ్. రామారావు**

కార్యదర్శి

శ్రీ పావని సేవాసమితి
శ్రీ సాయినిలయము, ఎస్.ఆర్.టి. 270,
సనత్‌నగర్, హైదరాబాద్ 500018
ఫోన్ : 23702898

శ్రీశ్శ్రీశ్వాత్

# మున్నుడి

అపార సంసార సముద్ర సేతుం భజామహే భాగవతస్వరూపమ్

సంసార సముద్రాన్ని దాటించడానికి సేతువుగా, ఉపాయంగా శ్రీమద్భాగవత స్వరూపుడైన పరమాత్మకు నమస్కారం.

ఇలాగా భాగవతాన్ని చదివే ముందు గానీ, వినే ముందుగానీ స్మరించాలి. కృష్ణా! నీవు అవతారం చాలిస్తే మాగతి ఏమిటి? అంటూ ఉద్ధవుడు దుఃఖించాడు. "నేను భాగవత కోశంలోనికి అను ప్రవేశం చేసి ఉంటా"నన్నాడు భగవానుడు. కాబట్టి శ్రీభాగవతం భగవంతుని దివ్య స్వరూపమే. "పాదౌయదీయౌ ప్రథమ ద్వితీయౌ".

మొదటి రెండు స్కంధాలు - భగవత్పాదపద్మాలు

3, 4 స్కంధాలు - తొడలు, 5 వ స్కంధం - నాభి

6వ స్కంధం - వక్షః స్థలం, 7, 8 స్కంధాలు - బాహువులు

9వ స్కంధం - కంఠం, 10 వ స్కంధం - ముఖారవిందం

11వ స్కంధం - లలాటం, 12వ స్కంధం - శిరస్సు.

"కృష్ణస్య వాఙ్మయీ మూర్తిః" వాఙ్మయరూపంగా వెలసియున్న పరమాత్మ - అని భాగవతానికి పేరు. భగవంతుని స్వరూపరూపగుణ విభూతులను అద్భుతంగా ప్రదర్శించే శ్రీమద్భాగవతం ఒక మహాపురాణం. భాగవతంలో 18000 పద్దెనిమిది వేల శ్లోకాలున్నాయి.

"అష్టాదశ సహస్రైశ్చద్వాదశస్కంధనిర్మితమ్". ఈ నిగమ కల్ప తరువునందు 12 స్కంధాలున్నాయి. చిలుక కొట్టిన పండులో రసఘనమైన పది (10) విషయాలు నిరూపించబడి ఉన్నాయి.

**దశ లక్షణాలు :**

"అత్ర సర్గో విసర్గశ్చస్థానం పోషణమూతయః।
మన్వంత రేశానుకథా నిరోధోముక్తి రాశ్రయః॥"

1. సర్గం : సకల భూత సృష్టి యొక్క వివరణం.
2. విసర్గం : చతుర్ముఖ బ్రహ్మవల్ల గుణత్రయ వైషమ్యం చేత ఏర్పడే వ్యష్టిసృష్టి
3. స్థానం : శ్రీమన్నారాయణుని విజయస్థితి.

4. పోషణం : భగవానుడు అనుగ్రహించడం.
5. ఊతులు : కర్మవాసనలు
6. మన్వంతర కథ : మన్వంతరాలలో ధర్మ ప్రవర్తన వివరణం.
7. ఈశానుకథ : భగవంతుని అవతారాలు, భక్తుల చరిత్ర
8. నిరోధం : ప్రళయంలో విశ్వం సూక్ష్మరూపంతో పరమాత్మలో చేరడం.
9. ముక్తి : జీవాత్మ, ప్రకృతి సంబంధంచే కలిగిన రూపం విడిపోయిన తర్వాత స్వస్వరూపాన్ని పొంది ఉండడం.
10. ఆశ్రయం : కారణ తత్త్వమైన శ్రీకృష్ణభగవానుణ్ని మనస్సులో స్థిరంగా నిల్పుకోవడం.

"సహోవాచ వ్యాసః పారాశర్యః" - శ్రీపరాశరమహర్షి పుత్రుడైన వ్యాసభగవానుడు వేద ప్రామాణికుడు, ప్రసిద్ధుడు - ఆయన వేదాలను విభజించాడు. మహాభారతాన్నీ, పద్దెనిమిది (18) పురాణాలనూ రచించాడు. అయినా వ్యాసుని మనస్సు విచార గ్రస్తమయింది. నారద మహర్షి వచ్చి ఆయనను పరామర్శించాడు. "విధి నిషేధాత్మకమైన ధర్మాలనెన్నో వర్ణించావు. అలాగా, భగవంతుని గుణగణాలను వర్ణించనందువల్ల నీకు మనఃశాంతి లేదు."

"యథాధర్మాదయశ్చార్థా మునివర్యానువర్ణితాః।
నతథా వాసుదేవస్య మహిమాహ్యానువర్ణితః॥" అన్నాడు.

గురుబోధ లేని విద్య ప్రకాశించదుకదా! లోకాచార్యుడైన నారద మహర్షి ప్రేరణచేత శ్రీవ్యాసభగవానుడు శ్రీమద్భాగవత ప్రబంధాన్ని రచించాడు.

శ్రీపరాశరమహర్షి పురాణరత్నమనే శ్రీవిష్ణు పురాణంలో శ్రీకృష్ణభగవానుని చరిత్రను రచించాడు. అంత కంటె అధికంగా, భాగవతంలోని శ్రీకృష్ణ చరిత్ర తత్త్వభరితమై రమణీయంగా ఉన్నది. "వందే శుకతాతం తపోనిధిం" - 'శ్రీశుకయోగితండ్రికి నమస్కార' మని లోకం కీర్తిస్తే వ్యాసుడానంద పడేవాడు. అముక (పలానా) వ్యక్తి యొక్క తండ్రి గారంటే, ఏ తండ్రి మనస్సైనా పొంగిపోతుంది కదా!

శ్రీశుకబ్రహ్మ తండ్రినిమించిన తనయుడుగా కీర్తింపబడినవాడు. "సర్వ భూత హృదయం మునిమానతోఽస్మి" (హృత్ అయతే వేత్తి ఇతి = హృదయః) - సర్వభూతాల అభిప్రాయాలు తెలిసిన వాడేకాక, అందరి మనస్సులనూ నియంత్రించే సామర్థ్యం కలవాడు శ్రీశుకుడు.

'కః శ్రీః శ్రియః'? (యామునాచార్య సూక్తి) లక్ష్మీదేవికి మంగళకరుడెవడు? అంటే 'శ్రియః కః శ్రీః'- 'పరమాత్మ' అని అదే మాట సమాధానం. శ్రయతే ఇతి శ్రీః - అని; 'శ్రీయతే ఇతి శ్రీః' అని వ్యుత్పత్త్యర్థం. 'గుణతో హి మంగళత్వం' కాబట్టి 'సమస్త గుణైరుపాశ్రితః' - సమస్త గుణాలచే ఆశ్రయింపబడిన పరమాత్మ అని శ్రీశబ్దానికి అర్థం. 'శుక గతౌ' అనే ధాత్వర్థం చేత, పరమాత్మయందు సంచరించే (మనస్సుకల) వాడు కాబట్టి 'శ్రీశుకు'డని పేరు. 'వివిక్త దృష్టిః' - (భాగవతం) పదార్థాలను పైపైన చూడక వాటిలోపల ఉన్న పరమాత్మను చూచేవాడు శ్రీశుకమహర్షి. బ్రహ్మ విద్వరిష్ఠుడు. గోవు నుంచి పాలు పితుకునంత సమయం కంటె ఎక్కువ కాలం ఒక్క చోట నిలువలేని మహానుభావుడు శ్రీశుకుడు.

శ్రీమద్భాగవతాన్ని రచించిన వాడు వ్యాసుడే అయినా, దాన్ని ప్రవచించినవాడు శ్రీశుకుడు. మునిశాపగ్రస్తుడైన పరీక్షిన్మహారాజుకు మోక్షదాయకమైన భాగవతాన్ని ఏడు అహోరాత్రాలు ఎడతెరపిలేకుండా వినిపించిన విజ్ఞాన ఖని శ్రీశుకముని.

పరీక్షిన్మహారాజు వేటాడుతున్న మృగం కనబడనందువల్ల ఆశ్రమంలో సమాధిస్థుడైన శమీకమునిని 'మృగ మెటుపోయింది' అని అడిగాడు. సమాధానమీయని ముని గళంలో ప్రాణంలేని పామును చుట్టివేసి పోయాడు. తర్వాత 'శృంగి' అనే మునిబాలుడు వచ్చి తన తండ్రి మెడలో 'పామును వేసిన వ్యక్తి ఒక్కవారంలో తక్షక సర్పదష్టుడై చచ్చుగాక' యని శపించాడు. సమాధియోగం నుంచి లేచిన శమీకముని పుత్రుణ్ని మందలించి, ప్రజారంజకుడైన ప్రభువుకు ఆశాపవార్తను ఒక శిష్యుని ద్వారా తెలియజేశాడు.

"మునిశాపంచేత మృత్యువాత బడుతా"నని పరీక్షిత్తుభయపడలేదు. తల్లి (ఉత్తర) గర్భంలో తాను అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం చేత కాల్చబడినప్పుడు తనను రక్షించిన శ్రీకృష్ణభగవానుణ్ని గర్భంలోనే దర్శించాడు.

"గర్భదృష్ట మభిధ్యాయన్ పరీక్షేత నరేష్విహ" (1 స్క. 12-30) పుట్టిన వెంటనే ఏడ్వకుండా, గర్భంలో ఉన్నప్పుడు కనబడిన వాడేనా ఇతడని, అందరినీ పరీక్షిస్తున్న శిశువును జూచి, ఋషులు 'పరీక్షిత్తు' అని నామకరణం చేశారు. విష్ణుమూర్తి ఉత్తరాగర్భంలో పరిభ్రమించి, కాపాడి తీసుకవచ్చినందువల్ల పరీక్షిత్తుకు 'విష్ణురాతు' డని కూడా నామాంతరముంది. కాబట్టి, విష్ణురాతుడు మృత్యువుకు భయపడక,

భాగవత శ్రవణంచేత పునర్జన్మ కలుగదని జాగ్రతపడి, శ్రీశుకమహర్షిని ప్రార్థించాడు. గురుశిష్యులు ఇద్దరు ఒకే దృష్టి కలవారు.

ఆశ్రితుని నైర్మల్యాన్ని గుర్తించి శ్రీశుక యోగి ప్రవచనం చేస్తుంటే, పరీక్షిన్మహారాజు సప్తాహం ఆహారపానీయాలపైన మతిలేకుండా, భాగవత పురాణాన్ని శ్రద్ధాళువై విన్నాడు. "దశమస్య విశుద్ధ్యర్థం నవానా మిహలక్షణమ్" (భాగ.2-10-2) నవలక్షణాలకు ఆధారమైన పరమాత్మను మనస్సులో స్థిరంగా నిల్పుకోవడానికి యోగ్యతను కలిగించే గ్రంథం ఆనవమంభాగవతం. దశమ లక్షణమైన ఆశ్రయమే భాగవత ప్రయోజనం. కాబట్టి, దశమస్కంధం సారభూతమైనది.

"క ఉత్తమ శ్లోక గుణానువాదాత్ పుమాన్
విరజ్యేత వినాపశుఘ్నాత్" (భాగ. 10 స్కం. 1అ)

భగవానుని దివ్యగుణానువాద రూపమైన ప్రబంధం భాగవతం. 'భగవతే ఇదం భాగవతం'. భగవంతుని కోసం మనం సేవ చేసే రీతిగా మనకు భక్తిని కలిగించేది భాగవతం. ఇట్టి భాగవతాన్ని పశుఘ్నుడు (పశువత్ హంతి గచ్ఛతీతి) అంటే, పశువులాగా చరించేవాడు తప్ప ఎవడు ప్రేమించడు? లేదా, పశువును చంపే కసాయివాడు తప్ప భగవత్కథలను వినజాలని మానవుడుంటాడా? ఇంతకన్న 'అపశుఘ్నుడు' అంటే బాగుంటుంది.

శోకం లేనిది కాబట్టి 'ఆత్మ'ను 'అపశుక్' అంటారు. జ్ఞాన హీనుడై ఆత్మను శోకం కలదిగా భావించి ఆత్మహత్య చేసుకొనే వ్యక్తి 'అపశుఘ్నుడు'. కాబట్టి, ఆత్మఘాతకుడు కాక భగవద్గాథలను రక్తితో విననొల్లని వెర్రి వెంగళాయ ఉండడు; అని పలికి, అతిమానుష చేష్టితాలు కలిగియున్న శ్రీకృష్ణచరిత్రను చెప్పుమని విష్ణురాతుడు వేడుకొన్నాడు.

తొమ్మిది స్కంధాలను విన్నందువల్ల పరిణతిచెందిన పరీక్షిత్తు మనస్సుకు శ్రీకృష్ణపర(మాత్మ)తత్త్వం అర్థమవుతుందని శ్రీశుక మహర్షి దశమస్కంధంలో శ్రీకృష్ణుని అవతారలీలలను అపూర్వ ఫణితిలో చెప్పాడు.

పరతత్త్వం సగుణం, సాకారమని కొందరు, మరికొందరు నిర్గుణం, నిరాకారమని నిర్వచిస్తారు. ఉపాసనలలో భేదం కానవచ్చినా ఉపాస్యమైన పరబ్రహ్మమొక్కటే కదా!

దశమస్కంధంలో తొంబై అధ్యాయాలున్నాయి. అందు 'రుక్మిణీ కల్యాణం' యాభై రెండ (52)వ అధ్యాయం నుంచి యాబై నాల్గ (54)వ అధ్యాయం వరకు చెప్పబడింది.

ఆంధ్రజనుల సుకృత పరిపాక గరిమవల్ల సంస్కృత భాగవతాన్ని పదిహేన (15)వ శతాబ్దిలో తెలుగు భాషలోకి అనువదించిన, సహజ పాండిత్యం గల మహానుభావుడు బమ్మెర పోతనామాత్యుడు.

"పలికెడిది భాగవతమట
పలికించెడి వాడు రామభద్రుండట నే
బలికిన భవహరమగునట
పలికెద, వేఱొండుగాథ బలుకగనేలా?

అన్న పద్యం పోతన మనః పరిణతిని ప్రస్ఫుటీకరిస్తుంది.

'సత్యం పరంధీమహి' అని గాయత్రీమంత్రార్థ ప్రతిపాదకమైన భాగవత ప్రబంధాన్ని తాను ప్రరోచకమైన ఒక శిల్పవిద్యగా అనువదించడానికి శ్రీరామభద్రుడే ప్రచోదకుడని పీఠికలో తెలిపాడు. భక్తి రస ప్రవాహానికేతమెత్తిన తెలుగుబిడ్డడు, దొడ్డకవి బమ్మెరపోతరాజు.

'రుక్మిణీ కల్యాణం'లో 'దేవకీసుతు కోర్కితీగెలు వీడంగ' అనే శీర్షపద్యంలో ఎత్తుగీతి వ్రాయడానికి తోచనందువల్ల పోతన తన పొలానికి పోయి నాగలితో దుక్కి దున్నుతున్నాడట. అప్పుడే స్ఫురించిన భావాన్ని వెంటనే "హరికి బ్రేమ బంధ మధికంబుగా గేశ

బంధ మధికమగుచు బాల కమరె!" అని పాదబద్ధం చేశాడు. అంతలోనే తన యింటిలో ఒక చంటిపిల్ల కుంపటి లోబడి ఒడలు కొంతభాగం కమరిందట. ఆ వార్తను పోతనకు తెల్పడానికి ఒకడువచ్చేసరికి "పద్మనయనువలన బ్రమదంబు నిండార

నెలత యౌవనంబు నిండి యుండె!" అని పద్యాన్ని పూర్తి చేశాడట.

మరొకడు పరుగు పరుగున వచ్చి 'ప్రమాదం తప్పింది, చెప్పకు' మనగానే మొదట వచ్చిన వాడు తెరచిన నోరు మూయక ఆశ్చర్యపోయాడట. ఈ జన శ్రుతివల్ల పోతన కవి వృత్తిచే 'హాలికు' డని, ప్రవృత్తిచే 'మహాభక్తు'డని విశదమవుతున్నది.

'బాల చరితం, ప్రౌఢ చరితం' అని రెండు భాగాలుగల శ్రీకృష్ణ చరితమనే మణిహార మందు పోతన 'రుక్మిణీ కల్యాణాన్ని మధ్య నాయక మణిగా కూర్చాడు. సంస్కృత భాగవతం దశమస్కంధంలో ఉత్తరార్థమందున్న రుక్మిణీ కల్యాణకథను పోతన తన

గ్రంథంలో పూర్వార్థమందు చేర్చాడు. బాలచరిత్ర సర్వజనీనమైనది. దీనికున్న జనరంజకత ప్రౌఢ చరిత్రకంత లేదు. కాబట్టి, దేవకీ వసుదేవుల వివాహ వృత్తాంతంతో ఆరంభమైన దశమ స్కంధంలో రుక్మిణీ కల్యాణంతో పూర్వభాగం పూర్తి చేశాడు. ప్రద్యుమ్నోపాఖ్యానంతో ఉత్తరభాగం (55వ అధ్యాయం) ఆరంభించాడు.

ఆంధ్ర మహాభాగవతంలో రుక్మిణీ కల్యాణకథా పద్యరచనా శిల్పవైఖరి అనల్పం. పోతన స్వతంత్రభావన మధురాతిమధురం. భాగవతం చదివినా, విన్నా భుక్తి, ముక్తి దాయకం. అందులో రమణీయమైన రుక్మిణీకల్యాణ కథా కావ్యాన్ని తన్మయులై పఠించే అవివాహితులైన యువతీ యువకులు అచిరకాలంలో, అనురూప్యమైన దాంపత్య సిద్ధిని పొంది, ఆనందంగా జీవిస్తారు.

వీరరాఘవీయ వ్యాఖ్యానమున్న 'రుక్మిణీకల్యాణము'ను (జిరాక్స్‌కాపీ) పంపి నన్ను కృతార్థుణ్ణి చేసిన శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఎన్.వి.ఎల్.ఎన్. రామానుజాచార్య స్వామి (పెంటపాడు) వారి సన్నిధిలో హార్దాంజలిని ఘటిస్తున్నాను.

నారాయణ శతకానికి రాఘవీయ వ్యాఖ్యను వ్రాసిన తర్వాత, రుక్మిణీ కల్యాణానికి ఈ 'వైష్ణవీ' వ్యాఖ్యను రచించడానికి అవకాశం కల్పించిన 'శ్రీపావనిసేవాసమితి' సభ్యులకు, ప్రత్యేకంగా సదాశయులైన శ్రీమాన్ చల్లా సాంబిరెడ్డి మహోదయులకు హార్దిక ధన్యవాదాలు.

వైష్ణవీ నామ వ్యాఖ్యేయం రాఘవాచార్య కల్పితా।
రుక్మిణీ కృష్ణతోషాయ మోదాయచ సతాంసదా॥

సుధీజన విధేయుడు,

**కె.వి. రాఘవాచార్యులు**

పార్థివ మహాశివరాత్రి
2006

శ్రీ లక్ష్మీ హయవదన పరబ్రహ్మణే నమః
శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః
శ్రీరుక్మిణీ సత్యభామాసమేత శ్రీగోపాలకృష్ణ
పరబ్రహ్మణేనమః

# శ్రీ
# రుక్మిణీ కల్యాణము

**కం. శ్రీకంఠచాపఖండన**
**పాకారి ప్రముఖ వినుత భండన, విలసత్**
**కాకుత్స్థ వంశమండన**
**రాకేందు యశోవిశాల, రామనృపాలా॥**

అర్థం : శ్రీకంఠచాపఖండన! శ్రీకంఠ = పరమశివుని యొక్క; చాప = విల్లును; ఖండన = విరిచి ముక్కలు చేసినవాడా! పాకారిప్రముఖ వినుత భండన! పాకారి, ప్రముఖ = ఇంద్రుడుమొదలైన దేవతలచేత; వినుత = కొనియాడబడిన; భండన = యుద్ధం కలవాడా! విలసత్- మండన! విలసత్ = ప్రకాశించే; కాకుత్స్థ వంశ = కకుత్స్థుడనే రాజు యొక్క వంశానికి; మండన = అలంకారమైనవాడా! రాకేందు- విశాల! రాకా + ఇందు = పున్నమ చంద్రుని వంటి స్వచ్ఛమైన; యశః = కీర్తి చేత; విశాల = విస్తరించిన వాడా! రామ నృపాలా = రాముడనే పేరుగల ఓ రాజా!

తా : ఓ రామరాజా! నీవు శివుని ధనుస్సును రెండు ముక్కలుగా విరిచిన వాడవు. ఇంద్రాదిదేవతలచేత ప్రశంసించబడిన యుద్ధం కలవాడవు. కాకుత్స్థ వంశ భూషణుడవు. పున్నమ చంద్రుని వలె తెల్లని కీర్తిని విశాలంగా పొందిన వాడవు.

వ్యాఖ్య : శ్రీమద్భాగవతంలోని దశమస్కంధమందు మొదట పోతన తన ఉపాస్యదైవమైన శ్రీరామచంద్రమూర్తిని స్తుతించిన కంద పద్యమిది.

'ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశో వ్వా_పితన్ముఖమ్' అన్నట్లు, గ్రంథాదిపద్యం ఆశీస్సు, నమస్క్రియ, వస్తు నిర్దేశాలతో ఉండాలనే లక్షణానుసారంగా శ్రీరామస్తుతి పరమైనదీ పద్యం.

'రుక్మిణీ కల్యాణం' దశమస్కంధంలో ప్రత్యేకంగా (కథా) కావ్య రూపమై వెలసినందువల్ల, ఆ స్కంధాది పద్యం ఈ కల్యాణ కావ్యంలోనూ తొలుత అనుసంధేయంగా ఉండడం శిష్టాచారమైనది.

శ్రీకంఠ చాపఖండనుడు శ్రీరాముడు :

1. శ్రీకంఠుడంటే నీలవర్ణ శోభకంఠమందుకలిగి యున్న పరమేశ్వరుడు - శివుడు. "శ్రీకంఠః శితి కంఠః కపాలభృత్" (అమరకోశం)

"అథ రుద్ర ముపాదత్తా వృషీ తపసాన్వితా।
తత ఏనం సముద్భూతం కంఠే జగ్రాహపాణినా।
నారాయణః సవిశ్వాత్మాతేనా స్యశితికంఠతా॥"

(భారతం. శాంతిపర్వం. 342 అ. 114 1/2)

దక్ష ప్రజాపతి యజ్ఞాన్ని ధ్వంసం చేసిన తర్వాత రుద్రుని శూలం తపస్సు చేస్తున్న నరనారాయణులను తాకింది. శూలతేజస్సు చేత నారాయణుని కేశాలు ముంజవర్ణమయ్యాయి. ముంజకేశుడు హుంకరిస్తే ఆ శూలం తిరిగి పోయి రుద్రుని చేతిలో పడింది. వెంటనే రుద్రుడు నరనారాయణులమీద విరుచుక పడ్డాడు. నారాయణుడు తన చేతితో రుద్రుని కంఠాన్ని గట్టిగా పట్టాడు. రుద్రుని కంఠం నీలవర్ణంగా కమలిపోయింది. కాబట్టి శివునికి శ్రీకంఠుడనే అన్వర్థనామ మేర్పడింది.

"శ్రీ ర్వేషరచనా శోభా సంపత్సరళశాఖిషు।
వాణీలక్ష్మీ లవంగేషు విషే బిల్వే_ పృథత్రిషు" (నిఘంటు)

శ్రీశబ్దానికి ఉన్న నానార్థాలలో 'శోభ, విషం' అనే అర్థాలూ ఉన్నాయి కదా!

2. శ్రీకంఠుడంటే విషకంఠుడు, గరళ కంఠుడని అర్థం.

"దేవతానాంభయం దృష్ట్వా శ్రుత్వావాక్యంతు శార్ జ్ఞిణః హాలాహలవిషం ఘోరం సజగ్రాహామృతోపమమ్॥" (శ్రీమద్రామాయణం - 45 స. 25)

దేవతలు, పూర్వదేవతలు కలిసి అమృతోత్పత్తి కోసం వాసుకి అనే సర్పరాజును త్రాడుగా చుట్టిన మందర పర్వతంతో సముద్రాన్ని మథించినప్పుడు వాసుకి రాపిడిని సహింపలేక విషాన్ని క్రక్కాడు. 'హాలాహల' మనే ప్రసిద్ధమైన విషం సముద్రమంతా వ్యాపించి సురాసురులను భస్మంచేయసాగింది "దేవతలలో పెద్దవైన నిన్ను ముందుగా గౌరవించాలి. కడలిని చిల్కగా మొదట పుట్టిన ద్రవ్యాన్ని నీవు మొదట తీసుకొ" మ్మని విష్ణుమూర్తి పరమ శివునితో చెప్పాడు.

దేవతల భయాన్ని చూచి, విష్ణువు చెప్పిన మాటను విని, జగద్రక్షణార్థమై ఆ కాలకూట విషాన్ని శివుడు మ్రింగి, తన కంఠమందు నిల్పాడు. శివుని కంఠం నల్లని రంగుగా మారి, శోభించినందువల్ల ఆయన "శ్రీకంఠుడు, కంఠేకాలుడు" అని ప్రసిద్ధిని పొందాడు.

శ్రీకంఠచాపం - శివుని ధనుస్సు - జనక వంశంలో పూజాగృహమందు ఉండింది.

"దక్షయాగమందు మీరు మీ భాగాలను పంచుకొని, నాకు హవిర్భాగం లేకుండా చేశారెందుకు? ఈ ధనుస్సుతో మీ తలలను నేలకు బలిపెడుతా"నని రుద్రుడు దేవతలను కోపించాడు. దేవతలు భయపడి రుద్రుణ్ని "త్రాహి, త్రాహి" యని ప్రార్థించారు. రుద్రుడు దేవతలను క్షమించి, తన విల్లును వారికి ఇచ్చి వెళ్ళి పోయాడు.

దేవతలు ఆ శివచాపాన్ని 'నిమి' అనే జనకవంశరాజుకు ఆరవవాడైన, దివ్య మహిమగల దేవరాతుడనే రాజు వద్ద (న్యాసభూతం తదాన్యస్తం) ఇల్లడగా ఉంచి పోయారు. అప్పటినుంచి జనక మహారాజులు ఆ వింటిని క్రమంగా పూజిస్తూ గౌరవించారు.

జనక చక్రవర్తి యజ్ఞం చేయడంకోసం భూమిని దున్ను తున్నప్పుడు నాగటి చాలులో దొరికిన శిశువుకు 'సీత' యని పేరు పెట్టి, తన బిడ్డగా సాకినాడు. పెండ్లియీడు వచ్చిన సీతను 'అయోనిజ, వీర్యశుల్క' అని శ్రీకంఠచాపాన్ని ఎక్కు పెట్టిన వీరునికే జనక చక్రవర్తి కన్యాదానం చేయదలచాడు. ఎవ్వరూ ఆ వింటిని ఎత్తజాలలేదు.

రామలక్ష్మణులను వెంట బెట్టుకొని వచ్చిన విశ్వామిత్ర మహర్షికి జనక చక్రవర్తి ఆ ధనూరత్నాన్ని చూపించాడు.

"వత్స రామ! ధనుఃపశ్య" - 'రామచంద్రా! ఆవింటిని చూడు' మని విశ్వామిత్రుడు ఆజ్ఞాపించాడు. భావనా సిద్ధమైన మనుష్యత్వమందు స్వాభావికమైన పరత్వాన్ని అభిమానించిన, మర్యాదా పురుషోత్తముడైన శ్రీరాముడు ఆచార్యాజ్ఞను శిరసావహించి, శివధనుస్సును చూచి, మో పెట్టినంతలో అది ఫెళ ఫెళార్భటులతో విరిగి రెండు ముక్కలయింది.

ఈ ప్రక్రియ సీతా కల్యాణ సందర్భాన జరిగింది.

"రాఘవత్వే భవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని" (విష్ణుపురాణం) లక్ష్మీదేవియే రామావతారంలో సీతాదేవిగానూ, కృష్ణావతారంలో రుక్మిణీ దేవిగానూ ఉద్భవించింది. కాబట్టి "శ్రీకంఠచాప ఖండన" అనే పద్య పాదం 'రుక్మిణీ కల్యాణ' కావ్యార్థాన్ని సూచిస్తున్నది.

పాకారి ప్రముఖ వినుత భండనుడు రామనృపాలుడు :

1. "పాకో జరసి నిష్ఠాయాం అర్భకే పచకే్లాపిచ" (నిఘంటు) 'పాక' శబ్దానికి అర్భకుడు - శిశువు - అనే అర్థమూ ఉంది. (పాక+అరి) అర్భకునికి శత్రువు దేవరాజు.

పూర్వం దేవేంద్రుడు సూక్ష్మరూపంతో 'దితి' కడుపులోకి దూరి ఆమె గర్భపిండాన్ని వజ్రాయుధంతో ఏడు ముక్కలుగా నరికాడు.

అవి "గగనం, స్పర్శనం, వాయువు, అనిలం, ప్రాణం, ప్రాణేశ్వరం, జీవం" అనే సప్తవాయువులయ్యాయి. ఆవహుడు, ప్రవహుడు, సంవహుడు, ఉద్వహుడు, వివహుడు, పరివహుడు, పరావహుడు అని కూడా సప్త మరుత్తుల పేర్లు.

2. వృత్రాసురుని సోదరుడైన 'పాకు' డనే రాక్షసుణ్ని సంహరించిన దేవేంద్రునికి 'పాకారి, పాక శాసనుడు' అనే పేరు వచ్చింది.

"రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ" రామరావణులయుద్ధం రామరావణులకే సాటియైనది. 'గగనానికి గగనమే సాటి, సాగరానికి సాగరమేసాటి అన్నట్లు అనన్వాలంకారంగా శోభించింది.

"వీరో ధనుషా యుధిశాత్రవాన్" - ధనుస్సు చేత యుద్ధంలో పగతురనందరినీ పగుల జీల్చిన పరాక్రమవంతుడని వాల్మీకి భగవానుడు శ్రీరాముని అభిరామ గుణాలను ప్రస్తుతించాడు.

"రాఘవస్తవసంయుక్తా గగనేచవిశుశ్రువే
"సాధుసాధ్వితివాగగ్ర్యాదేవతానాం మహాత్మనామ్॥"

(యుద్ధకాం. 108స. 29)

విజేతయైన శ్రీరామభద్రుణ్ని ఇంద్రాదిదేవతలు స్తుతిస్తూ, సాధువాక్యాలను - భళా అనే మాటలను పల్కగా, ఆ శబ్దం ఆకాశమందంతట వ్యాపించింది.

విలసత్ కాకుత్థ్సవంశమండనుడు శ్రీరామభద్రుడు : కకుత్స్థుడు సూర్యవంశపు రాజు. వికుక్షికి కుమారుడు. దానవులు దండెత్తినప్పుడు దేవతలు బ్రహ్మను ముందిడుకొని విష్ణుమూర్తిని ప్రార్థించారు. "కకుత్స్థునియందు నేను ప్రవేశిస్తాను. ఆయనను వేడుకొనండి" అని విష్ణువు చెప్పాడు. (విశ్వామిత్రుని వెంట మిథిలకు వెళ్ళుతున్న రామలక్ష్మణులకు ఆతిథ్యమిచ్చిన, విశాలదేశపురాజైన 'సుమతి'కి తండ్రియైన కాకుత్స్థుడు వేరే. ఇతడతడుకాడు).

శశాదుడనే మారు పేరు కలిగిన వికుక్షియొక్క పుత్రుని వ్యవహారనామం పురంజయుడు. దేవతలు ప్రార్థించగా, పురంజయుడు దేవేంద్రుణ్ని ఎద్దుగా మారుమన్నాడు. కకుత్ స్థలం - ఎద్దుమూపురం-పైన కూర్చుండి దానవులతో యుద్ధం చేసి వారిని ఓడించి తరిమి వేశాడు. కాబట్టి, పురంజయునికి 'ఇంద్రవాహనుడు, కాకుత్స్థుడు' అని పేరు ప్రఖ్యాతమయింది. శ్రీరాముడు కాకుత్స్థవంశాన్ని తన దివ్య జన్మ, కర్మలచేత ప్రకాశింపజేశాడు.

రాకేందుయశోవిశాలుడు రామరాజు : - 'రాకేందు' అంటే పూర్ణచంద్రుడు - "అమృత, మానద, పూష, తుష్టి, పుష్టి, రతి, ధృతి, శశిని, చంద్రిక, కాంతి, జ్యోత్స్న, శ్రీ, ప్రీతి, అంగద, పూర్ణ, పూర్ణామృత" - అనే 16 కళలతో కూడిన వాడు.

అమృత పూర్ణకళలతో ప్రకాశిస్తూ ఓషధీశుడైన చంద్రుడు నగర నగనదీనద సముద్రయుక్తమైన జగత్తును ఆహ్లాదపరుస్తాడు. అలాగే, రమ్యగుణ సాంద్రుడైన రామచంద్రుడు అయోధ్యాధిపతియైనా, అరణ్యావాసియైనా, తన సత్యధర్మ పరాక్రమాలతో చరాచర ప్రపంచానికి ప్రహ్లాదాన్ని కలిగించినందువల్ల, స్వచ్ఛమైన, సర్వవ్యాపకమైన కీర్తిని కలవాడు.

"తస్య నామ మహద్యశః" అన్నది వేదవాణి.

2. శ్రీకృష్ణ పరమైన అర్థం :

శ్రీకంఠ చాప ఖండన!

శ్రీ = విషాన్ని; కంఠ = తలను; చాప = ధనుస్సును; ఖండన = విరిచినవాడా! పాకారి ప్రముఖ వినుత! పాకారి = ఇంద్రునిచేతనూ; ప్రముఖ = చతుర్ముఖునిచేతనూ; వినుత = స్తుతింపబడినవాడా! వినుత = స్తుతింపబడిన; భండన = పోరు కలవాడా!

విలసత్ కాకుత్స్థ వంశమండన! విలసత్ = విలసించే; కాకుత్ = ప్రధానవస్తువై; స్థ = ఉన్న; వంశ = పిల్లనగ్రోవి (వేణువు); మండన = అలంకారంగా కలవాడా! రాకేందు యశోవిశాల! రాకేందు = నిండుపున్నమ చంద్రుని వలె తెల్లని; యశోవిశాల = కీర్తిచే వ్యాపకుడైన వాడా! రామ = యోగేశ్వరా! నృపాలా = జనరంజకుడవైన శ్రీకృష్ణా!

తాత్పర్యం : దశమస్కంధంలో వర్ణింపబడిన శ్రీకృష్ణ లీలలను సూచిస్తూ, వస్తువును నిర్దేశించే పద్యమిది.

శ్రీకంఠ చాపఖండనుడు శ్రీకృష్ణ భగవానుడు -

1) శ్రీఖండనుడు - కాళీయ ఫణాగ్రమందు నర్తించి, ఆ సర్పవిషాన్ని కక్కించాడు.

2) కంఠ ఖండనుడు - శిశుపాలదంతవక్త్రుల తలలను ఖండించిన వాడు.

3) చాప ఖండనుడు - ధనుర్యాగస్థలానికి చేరిన శ్రీకృష్ణుడు

"కరేణవామేన సలీలముద్ధృతం
సజ్జంచకృత్వా నిమిషేణ పశ్యతామ్।
నృణాం వికృష్య ప్రబభంజ మధ్యతో
యథేక్షుదండం మదకర్యుపక్రమః॥ (భాగ. 10స్కం. 42 అ. 17)

లీలగా ఎడమచేత ధనుస్సునెత్తి, అల్లెత్రాటిని బిగించి, క్షణంలో అందరు చూస్తుండగా లాగి, మదపుటేనుగు చెరకు గడను వలె నడిమికి విరిచి రెండుముక్కలు చేశాడు.

**పాకారి ప్రముఖ వినుతుడు :**

1) పాకారి వినుతుడు - ఇంద్రయాగాన్ని కృష్ణుడు మాన్పించాడు. ఆగ్రహించిన దేవరాజు వారం రోజులు మంటికి మింటికేకధారగా శిలావర్షాన్ని కురిపించాడు. కృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని గొడుగుగా ఎత్తి, దాని క్రింద గోగోపసంఘాన్ని కాపాడి, ఇంద్రుని దర్పాన్ని అణచివేశాడు.

"ఈశ్వరం గురు మాత్మానం త్వామహంశరణం గతః" అంటూ, ఇంద్రుడు కృష్ణభగవానుణ్ణి స్తుతించడమే కాక, గోవింద నామంతో అభిషేకించాడు.

2) ప్రముఖ వినుతుడు - చతురాననుడు ఒక సంవత్సరకాలం గోవులను, గోపాలకులను దాచిపెట్టాడు. శ్రీకృష్ణుడు ఆ రెండు - పశు, మనుష్య - రూపాలను దాల్చి బ్రహ్మదేవుని మోహాన్ని నశింపజేశాడు. చకితుడైన చతుర్వదనుడు కృష్ణుణ్ణి ప్రార్థించాడు.

"శ్రేయః సృతింభక్తి ముదస్యతే విభో
క్లిశ్యంతి యే కేవల బోధలబ్ధయే।
తేషామసౌక్లేశల ఏవశిష్యతే
నాన్యద్యథా స్థూలతుషావఘాతినామ్" (భాగ.10.14 అ.4)

భక్తి సకల శ్రేయస్సుకు ఉద్గమస్థానం. భక్తిలేకుండా జ్ఞాన ప్రాప్తికోసం పాటుపడితే, ఉనుకనుదంచిన వారికి శ్రమయే మిగిలినట్లవుతుంది.

"అతః క్షమస్వాచ్యుత!.... ఏషో ను కంప్యోమయినాథవానితి॥" (10-14-10) కాబట్టి, జగత్కర్తను నేనే అని మోహాంధకారాన గ్రుడ్డివాడనైన నీసేవకుణ్ని క్షమించి, కటాక్షించుమని ప్రార్థితుడు శ్రీకృష్ణభగవానుడు. 'పాకారిప్రముఖవినుత భండనుడు' - అని కూడా ఇది సమస్త పదమవుతుంది.

'నేదుర్దుందుభయో వ్యోమ్ని బ్రహ్మేశాద్యావిభూతయః।
పుష్పైః కిరంతస్తం ప్రీతాః శశంసుర్ననృతుః స్త్రియః॥"

శ్రీకృష్ణుడు కువలయాపీడాన్ని చంపిన తర్వాత కంసుణ్ని, అతని తమ్ములైన కంకన్యగ్రోధకాదులనే ఎనమండుగురితో పోరాడి వారిని చంపినప్పుడు, చతుర్ముఖ పంచముఖాది దేవతలచే స్తుతింపబడినాడు.

అద్భుతంగా పోరాడిన కృష్ణ భగవానునిపైన పుష్పవృష్టి కురిసింది. ఆకాశంలో దుందుభులు మ్రోగాయి. అప్సరసలు నాట్యమూ చేశారు.

విలసత్ కాకుత్స్థ వంశ మండనుడు వేణుగోపాలుడు :

శోభించే ప్రధాన వస్తువుగా ఉన్నది వేణువు.

కకుత్ (కకుద) శబ్దం ప్రాధాన్యమైనదాన్ని తెల్పుతుంది.

"ప్రాధాన్యేరాజలింగేచ వృషాంగే కకుదో స్త్రియామ్" (అమరం)

స్త్రీ కకుత్, కకుదో స్త్రీ రాట్చిహ్నె

ప్రష్ఠ వృషాంగయోః" (రుద్రనిఘంటువు)

లేదా - 'కాకుద' శబ్దం 'దౌడ'ను తెల్పుతుంది. "తాలు తుకాకుదమ్" (అమరం) కాబట్టి, దౌడ ప్రాంతమందున్న పిల్లనగ్రోవి భూషణంగా కలవాడు మురళీ కృష్ణుడు.

"ద్వౌవంశౌ కుల మస్కరౌ" (అమరం) 'వంశ' శబ్దానికి కులమనీ, వెదురు అనీ అర్థాలున్నాయి. "జగౌకలం వామదృశాంమనోహరమ్" (భాగ. 29అ.3శ్లో) శ్రీకృష్ణుడు తన వేణువుతో వ్రజసుందరీమణుల అంతరంగాన్ని రస తరంగితం చేసే 'క్లీం' అనే కామబీజాన్ని మధురంగా గానం చేశాడు.

రాకేందు యశోవిశాలుడు నందనందనుడు :

రాకేందు వంటే శరత్కాల పూర్ణిమరాత్రి చంద్రమండలం. అది 'రమాననాభం' గా, అంటే - లక్ష్మీదేవి యొక్క ముఖమండలంతో సమానంగా భాసిస్తుంది. కృష్ణ భగవానుడు గోపాంగనలతో రాసక్రీడ సలిపి, శరచ్చంద్ర చంద్రికలాగా దిగంతాలకు వ్యాపించే ధవళమైన యశస్సు కలవాడు. "అశ్నుతేదిశః ఇతి యశః" అని వ్యుత్పత్త్యర్థం.

'రామ' శబ్దం పరబ్రహ్మవాచకం.

'రా' అంటే రాక్షసులకు, 'మ' అంటే మరణహేతువైన శ్రీకృష్ణ భగవానుడా! అని అర్థం. లేదా

"రమంతే యోగినో్ఽనంతే సత్యానందచిదాత్మని।
ఇతిరామ పదేనా సౌ పరబ్రహ్మాభిధీయతే॥"

యోగులు కృష్ణుని యందు రమిస్తారు కాబట్టి కృష్ణుడు 'రామ' శబ్దవాచ్యుడు.

నృపాలుడు వసుదేవనందనుడు :-

'నృ' శబ్దం జీవవర్గాన్ని బోధిస్తుంది. సకల జీవులను రక్షించే వాడు శ్రీకృష్ణ భగవానుడు.

3. భాగవతం తత్త్వార్థాన్ని ప్రకాశింపజేస్తుంది.

శ్రీకంఠచాప ఖండనుడు దివ్యజ్ఞానం కలవాడు - 'శ్రీ' శబ్దం విషార్థకం. 'కంఠ' శబ్దం ధ్వన్యర్థకం. కంఠో వాచక శబ్దేస్యాత్ సన్నిధానే గళేధ్వనౌ" - (నా.ర.మాల). 'చాప' శబ్దం వృక్ష సంబంధమైన వృద్ధిని బోధిస్తుంది. 'చాప' శబ్దానికి "చపస్య వేణోః వృక్ష విశేషస్య వా వికారః చాపః" అని వ్యుత్పత్త్యర్థం. 'ఖండన' మంటే నరికి వేయడం.

వేదాంత శాస్త్రం చేత విషంతో సమానమైనదని ఉద్ఘోషింపబడే అజ్ఞాన మనే వృక్షాన్ని పెరుగ నీయక నరికే వాడు. సాధనాంతర నిరపేక్షమై, స్వయం ప్రకాశమైన దివ్య జ్ఞాన స్వరూపుడని అర్థం.

పాకారి ప్రముఖ వినుత భండనుడు సుగుణుడు : - 'పాకారి ప్రముఖులు' అంటే (జ్ఞానేంద్రియాలు (5), కర్మేంద్రియాలు (5), మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం (4) అనే అంతరింద్రియాలు). చతుర్దశ (14) ఇంద్రియాలకు అధిదేవతలైన దేవేంద్రాదులు. వీరు పొగడే విధంగా అసుర సంపదయైన రాగ, ద్వేష, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర, దంభ, దర్పాది దుర్గుణాల రూపుమాపే (సంఘర్షణ) పోరు కలవాడు. దైవీ సంపదయైన శమ, దమ, దయా, అహింసా, సత్య, సదాచారాది సద్గుణ గరిష్ఠుడన్న మాట.

విలసత్ కాకుత్స్థ వంశమండనుడు జ్ఞాన ప్రకాశకుడు : కకుత్ శబ్దానికి వృషాంగమని అర్థం. "వృషోహిధర్మః" వృషభ మంటే తపస్సు, పారిశుద్ధ్యం, దయ, సత్యం అనే నాలుగు పాదాలు గల ధర్మం. దాని అంగమంటే ధర్మం వల్ల కలిగిన జ్ఞానం. ఆ జ్ఞానం కలవారి వంశమంటే బ్రహ్మవిదుల పరంపర అని అర్థం.

బ్రహ్మవిదులకు, బ్రహ్మవిద్వరులకు, బ్రహ్మ విద్వరీయులకు, బ్రహ్మ విద్వరిష్ఠులకు అలంకారమైన వాడు. "తస్యధీరాఃపరిజానం తియోనిమ్" బ్రహ్మవిదాదుల జ్ఞానాన్ని,

తరిగిపోకుండా, ప్రకాశింపజేసే వాడు. "మోక్షేధీర్ జ్ఞానం" మోక్షమందలి బుద్ధియే జ్ఞానం. కాబట్టి అట్టి ధీరులే - జ్ఞానులే జగత్కారణుడైన పరబ్రహ్మ స్వరూప స్వభావాలను తెలుసుకొనే సమర్థులు. "ధీరాకులవతీ కన్యాకాలే పతింవృణీత" అన్నట్లు భగవంతుని యందే స్థిరంగా రమించే బుద్ధి గలది (ధీర) యైన రుక్మిణిచే వరింపబడినవాడు శ్రీకృష్ణపరబ్రహ్మ - అని ధ్వన్యర్థం.

**రాకేందు యశోవిశాలుడు పరబ్రహ్మ :**

రా = స్వర్ణం. "రాస్త్రియాంహేమ్నిశాలాయా మాశంసాయాంగతావపి" (ని.) క = బ్రహ్మ. "మారుతే వేధసి బ్రధ్నే పుంసికః, కంశిరోఽంబునోః"(ని.) ఇందు = చంద్రుడు. "ఇందుః కుముద బాంధవః" (ని) య = వాయువు. "యస్త్యాగేనిలయే వాయౌయమే దాతరి యాతరి" (ని) శ = శివుడు, "శో వల్మీకే శివే కూర్మే భూపే శిష్యే తనూకృతౌ". (ని) వి = ఆకాశం. "విశ్చక్షుషి వ్యోమ్ని వాతే పరమాత్మని పక్షిణి"(ని) 'శాలా' శబ్దం స్థానవాచకం. బ్రహ్మాదులకు, పంచభూతాలకు నిలయుడు. "యతో వాఇమాని భూతాని జాయంతే, యేన జాతానిజీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి". (ఉపనిషద్వాణి). బంగారం మొదలైన జడవస్తువులను, స్థావరవస్తువులను, జంగమ వస్తువులను సృజింప, రక్షింప, లయింపజేయడానికి ఆకరమైనవాడు పరబ్రహ్మ. "తేనేదం పూర్ణం పురుషేణ సర్వం" విశ్వమంతా నిండియున్నవాడు పరబ్రహ్మ.

ఇంత చిన్న కందపద్యంలో ఎన్నో విశేషార్థాలను అందంగా చిందించిన భక్తి రూపమైన శేముషిగల పోతనామాత్యుడు ఎంత ధన్యాత్ముడో కదా!

**వ : శ్రీశుకమహర్షి పరీక్షిన్మహారాజునకు భాగవతమును వినిపించుచు బలరామకృష్ణుల దిగ్విజయాది కథలను జెప్పి పిమ్మట రుక్మిణీ కల్యాణ కథను జెప్పనారంభించి, వెనుకటిగాథ నీ వెఱింగి యున్నావు కదా యనెను.**

తా : శ్రీ వేదవ్యాసమహర్షి పుత్రుడు శ్రీశుకమహర్షి. ఈయన పుట్టుకతోనే మహాజ్ఞానవంతుడు. ఆవుపాలను పిండినంత సేపైనా ఒక్క చోట నిలిచి యుండేవాడు కాడు శ్రీశుకబ్రహ్మ.

సుభద్ర, అర్జునుల పౌత్రుడు; ఉత్తర, అభిమన్యుల పుత్రుడు పరీక్షిత్తు. బాహ్యాభ్యంతరాలనూ పరిశీలించే మహారాజాయన. ఒకనాడు అడవిలో వేటాడుతూ "నేను తరుము తున్న మృగం ఎటు పోయింది" అని పరీక్షిన్మహారాజు శమీక మునిని

అడిగాడు. సమాధి యోగనిష్ఠుడైనందువల్ల మాటాడక మౌనంగా ఉన్న శమీకుని మెడలో ఆ రాజుకోపంతో ఒక చచ్చిన పామును వేసి పోయాడు. కాసేపటికి శృంగి అనే ముని వచ్చి చూచి "నా తండ్రి కంఠాన పామును వేసిన దుష్టుడు ఏడు దినాలలో తక్షకుడనే సర్పంచేత దష్టుడై మరణించుగాక! అని శపించాడు. శమీకముని ఆ శాపవృత్తాంతాన్ని పరీక్షిత్తుకు తన శిష్యుణ్ని పంపి తెలియజేశాడు. ఏడు రోజుల్లో చావు తప్పదని రాజు ముక్తిని ప్రసాదించే పుణ్యకథలను వినదలచాడు.

"వక్తా శ్రోతాచ దుర్లభః" - వినదలచే వ్యక్తికి చెప్పేవాడుగానీ, చెప్పదలచేవానికి వినేవాడు గానీ సామాన్యంగా దొరకడు. పరీక్షిత్తుకు సత్సంకల్ప భాగ్యంవల్ల శ్రీశుకమహర్షి, ఏడు రేయింబవళ్ళుభాగవతం వినిపించాడు. తక్షక దష్టుడైన పరీక్షిత్తు శ్రీశుక సూక్తి సుధను ఆస్వాదించినందువల్ల మోక్షం పొందాడు.

ద్వాదశస్కంధాలలో భగవత్స్వరూపాన్ని ప్రకాశింపజేసే భాగవతంలోని దశమ స్కంధమందు, రామకృష్ణుల లీలలను చెప్పి, రుక్మిణీకల్యాణ కథను వినిపించబోతున్నాడు శ్రీశుకుడు. వెనుకటిగాథ అంటే బలరామునికి రేవతితో వివాహమైన కథ ఇంతకు ముందే పరీక్షిత్తుకు వినిపించబడినదని భావం.

**ఆవనజగర్భు పంపున**
**రైవతుడను రాజుదెచ్చి రామునకిచ్చెన్**
**రేవతి యని యెడు కన్యను**
**భూవర! మును వింటికాదె, బుద్ధిన్ దెలియన్॥** 1

అర్థం : భూవర = ఓ పరీక్షిన్మహారాజా! ఆ వనజ గర్భు పంపునన్ = కమల గర్భుడైన ఆ బ్రహ్మయొక్క ఆజ్ఞచేత; రైవతుడు అనేరాజు; రేవతి అనే కన్యను; తెచ్చి; రామునకు = బలరామునికి; ఇచ్చెన్ = వివాహం చేసెను; మును = పూర్వమే; బుద్ధిన్ = మనస్సునందు; తెలియన్ = తెలియబడునట్లు; వింటి, కాదె = వింటివి కదా!

తా : ఓ పరీక్షిన్మహారాజా! కమలోద్భవుడైన ఆ బ్రహ్మదేవుడు చెప్పిన రీతిగా, రైవతుడ నే పేరు గలరాజు తన పుత్రికయైన రేవతి అనే కన్యను తీసుకొని వచ్చి బలరాముని కిచ్చి పెండ్లి చేశాడు. ఈ ఉదంతాన్ని నీవు ముందే విన్నావు కదా!

వ్యాఖ్య : రేవతీ పరిణయాన్ని స్మరింపజేసే కందపద్యం.

సూర్యవంశపురాజైన ఆనర్తుని కుమారుడు రైవతుడు. ఈయన కుమార్తె రేవతి. రైవతుడు తనకుమార్తెకు తగిన మగడెవ్వడో చెప్పుమని చతుర్ముఖ బ్రహ్మను అడిగాడు.

"భూభారాన్ని మాన్పడానికి అవతరించిన బలరామునికి నీ పుత్రికనిచ్చి పెండ్లి చేయు"మని నలువ రైవతునికి చెప్పాడు. ఒకప్పుడు రైవతుడు సముద్రంలో కుశస్థలి నగరాన్ని నిర్మించాడు. ఇప్పుడు ఆ నగరంలో ఉన్న బలరామునికి, రైవతుడు తన వెంట తీసుకొని వచ్చిన రేవతిని ఇచ్చి, వైభవంగా పెండ్లి చేశాడు.

ఈ గాథను, శ్రీశుకుడు పరీక్షిత్తుకు ఇదువరకే (9 స్కం. 3అ) వినిపించినందువల్ల, జ్ఞాపకం చేశాడు.

తదనంతరంబ - (ఇది వచనం). తత్ = ఆ వివాహం; అనంతరంబే = తర్వాతనే. బలదేవునికి రేవతితో వివాహం జరిగిన తర్వాత.

**ఖగనాథుండమరేంద్రుగెల్చి సుధ మున్**
**గైకొన్న చందంబునన్**
**జగతీనాథుల జైద్యపక్షచరులన్**
**సాళ్వాదులన్ గెల్చి, భ**
**ద్రగుడై చక్రి వరించె భీష్మకసుతన్**
**రాజీవగంధిన్, రమా**
**భగవత్యంశ భవన్ మహాగుణమణిన్**
**బాలామణిన్ రుక్మిణిన్॥** 2

అర్థం : మున్ = వెనుకట; ఖగనాథుండు = పక్షులకు రాజైన గరుత్మంతుడు; అమర+ఇంద్రున్ = దేవతలకు ప్రభువైన ఇంద్రుణ్ని; గెల్చి = జయించి; సుధ = అమృతభాండం; కైకొన్న చందంబునన్ = చేకొన్న విధంగా; చక్రి = సుదర్శనం అనే చక్రం ఆయుధంగా గల శ్రీకృష్ణుడు; చైద్య పక్ష చరులన్ = చేది దేశపు రాజపుత్రుడైన శిశుపాలుని పక్షమందు వర్తించునట్టి; సాళ్వ+ఆదులన్ = సాళ్వుడు మొదలైన; జగతీనాథులన్ = భూపతులను; గెల్చి = ఓడించి; భద్రగుడై = శుభావహుడై; భీష్మక సుతన్ = భీష్మకుని పుత్రికయైన; రాజీవగంధిన్ = కమలాలవాసన వంటి శరీర పరిమళం కలిగినట్టి; రమా భగవతీ+అంశ, భవన్ = లక్ష్మీదేవి యొక్క అంశచేత జన్మించినట్టి; మహాగుణమణిన్ = మణులవంటి గొప్పగుణాలు కలిగియున్నట్టి; బాలామణిన్ = కన్యకలలో రత్నం వంటిదైన; రుక్మిణిన్ = రుక్మిణీ దేవిని; వరించెన్ = కోరి పెండ్లాడెను.

తా : (ఓ పరీక్షిన్మహారాజా!) పూర్వకాలాన పక్షీంద్రుడైన గరుత్మంతుడు దేవేంద్రుణ్ని జయించి అమృతకలశాన్ని చేకొన్నట్లు, శ్రీకృష్ణుడు శిశుపాలుణ్ని, అతని పక్షాన ఉండిపోరాడిన సాళ్వుడు మొదలైన రాజులను ఓడించి గుణవతి,

రూపవతియైన, లక్ష్మీదేవ్యంశచేత జన్మించిన, భీష్మక రాజపుత్రికయైన రుక్మిణి అనే కన్యకామణిని వివాహమాడెను.

వ్యాఖ్య : శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవిని పెండ్లాడెను అని శ్రీశుకమహర్షి పరీక్షిత్తుకు తెల్పాడు.

ఖగనాథుడు అంటే ఆకాశాన చరించే పక్షులకు రాజైన గరుత్మంతుడు. అతడు బలద్వేషిదర్పజ్వలత్ వాలఖిల్య ప్రతిజ్ఞావతీర్ణుడు. బొటన వ్రేలంత చిన్న ఆకారంగల వాలఖిల్య మహర్షులను జూచి హేళన జేసిన వాడు దేవేంద్రుడు. అతని అఖర్వగర్వానికి మండిపడిన మహర్షులు ఇంద్రునికి ప్రతిభటంగా మరొక ఇంద్రుణ్ని ఉద్భవింపజేయడానికి ప్రతిజ్ఞ చేసి యజ్ఞాన్ని ఆరంభించారు. పదవిపోతుందని భయపడిన దేవరాజు కశ్యప ప్రజాపతిని ప్రార్థించాడు. కశ్యపుడు వాలఖిల్యులను సందర్శించాడు.

"మీరు మహాతపోధనులు. మీ సంకల్పం వ్యర్థంకాదు. విధాతవిధానానికి విరుద్ధంగా ప్రయత్నించరాదని మీకూ తెలుసును కదా! కాబట్టి, దేవేంద్రునికి మారుగా పక్షీంద్రుని జననం కోసం మీసంకల్పాన్ని సాగించండి" అని విన్నవించాడు. వాలఖిల్యులు కశ్యపుని మాటను గౌరవించారు.

కశ్యప ప్రజాపతికి 'కద్రువ, వినత' భార్యలు. కద్రువకు సర్పసంతతి కలిగింది. వినత తొందరపడి తన గ్రుడ్డును చిట్లించినందువల్ల అనూరుడు (తొడలు లేనివాడు) జన్మించాడు. అనూరుడు తల్లిని 'నీ సవతికి దాసివవుతావు' అని శపించాడు. కొన్నాళ్ళకు వాలఖిల్యుల ప్రతిజ్ఞాపటిమవల్ల వినతకు సుపర్ణుడు జన్మించాడు. తనతల్లి దాస్యాన్ని తొలగించడానికి పక్షీంద్రుడు దేవేంద్రునితో పోరాడి అమృత కలశాన్ని తెచ్చాడు. అలాగే చక్రాయుధుడైన శ్రీకృష్ణుడు శిశుపాలుణ్ని, అతనికి సహాయులైన సాళ్వాది రాజులను గెల్చి రుక్మిణిని తెచ్చుకొన్నాడు. (తార్క్ష్యపుత్రః సుధా మివ - అని మూలం)

ఇది పూర్ణోపమాలంకారం.

ఖగనాథుడు ఉపమానం. చక్రి ఉపమేయం. సుధాశబ్దం ఉపమానం. రుక్మిణీదేవి ఉపమేయం. చందంబునన్ - ఉపమావాచకం.

ప్రతిభటులను గెల్చి కైకొనడం. సాధారణ ధర్మప్రక్రియ.

రుక్మిణి భీష్మకుని పుత్రిక. అందమైన ఆకారమూ, పొగడ తగిన గుణాలూ కలిగియున్న కన్యకలలో శ్రేష్ఠురాలు.

"రాఘవ త్వే భవత్సీతా, రుక్మిణీకృష్ణజన్మని" (వి.పు) లక్ష్మీదేవి రామావతారంలో 'సీత' గానూ, కృష్ణావతారంలో 'రుక్మిణి'గానూ అవతరించింది. రుక్మిణీ కృష్ణులది నిత్యయోగం. రమాభగవత్యంశ భూతయైన రుక్మిణిని చక్రి వివాహమయ్యెనని శ్రీశుకమహర్షి పరీక్షిన్మహారాజుకు సంగ్రహంగా చెప్పి, రుక్మిణీ కల్యాణకథను విస్తరంగా వినే కోరికను కలిగించాడు. మత్తేభవృత్త పద్యమిది.

వ : **అనిన రాజిట్లనియె. మున్ను రాక్షస వివాహంబున స్వయంవరమునకు వచ్చిన హరి రుక్మిణింగొని పోయెనని పలికితివి. కృష్ణుండొక్కరుండెవ్విధంబున సాళ్వాదులంజయించి తన పురంబునకు జనియె? అదియునుంగాక.**

అర్థం : అనినన్ = శుకమహర్షిచెప్పగా; రాజు = పరీక్షిత్తు; ఇట్లు అనియె; మున్ను = పూర్వం; స్వయంవరంబునకు వచ్చిన హరి = కన్య తనంతతాను వరుణ్ని కోరుకొనే వివాహానికి వచ్చినట్టి కృష్ణుడు; రాక్షసవివాహంబునన్ = కన్యకను ఎత్తుకొని పోయి పెండ్లాడే పద్ధతి చేత; రుక్మిణిన్ = వైదర్భిని, కొనిపోయెను, అని, పలికితివి = చెప్పితివి.

కృష్ణుండు, ఒక్కరుండు = ఒక్కడే; ఏ విధంబునన్ = ఏ రీతిగా; సాళ్వ+ఆదులన్ = సాళ్వుడు మొదలైన వారిని; జయించి = గెల్చి; తనపురంబునకున్ = తన పట్టణానికి; చనియెన్ = పోయెను? అదియునుగాక = వినే వేడుకలో మరొక విషయమూ ఉంది.

వ్యాఖ్య : "ఓ మహాత్మా! మునుపు కన్యకచే వరింపబడడానికి వచ్చిన కృష్ణుడు రాక్షస వివాహ పద్ధతిగా రుక్మిణిని తీసుకొని పోయాడన్నావుకదా!" అని పల్కిన పరీక్షిత్తుకు ~~ఈ~~కల్యాణకథను సాంతం వినాలనే ఔత్సుక్యం కలిగింది. వివాహ విధానాలు ఎనిమిది రకాలుగా ఉన్నాయి.

1. బ్రాహ్మం : ఉత్తమ వంశంలోపుట్టి గుణవంతుడైన విద్వాంసునికి సమానవర్ణమందు పుట్టి సర్వాభరణాలంకృతయైన కన్యను ప్రీతి పూర్వకంగా దానం చేసే వివాహపద్ధతి.
2. దైవం : యజ్ఞారంభమందు ఋత్విజుని పూజించి, సర్వభూషణభూతయైన కన్య నిచ్చి యథావిధి పెండ్లి చేసే పద్ధతి.
3. ఆర్షం : ధర్మార్థం వరునివల్ల గోమిథునాన్ని తీసుకొని యథాశాస్త్రంగా కన్యనిచ్చి చేసే ఉద్వాహం.

4. ప్రాజాపత్యం : మీరిద్దరు ధర్మమాచరించాలని నియమించి, వరుని పూజించి కన్యనిచ్చి చేసేవివాహం.
5. రాక్షసం : వరుడు కన్యాపక్షం వారిని కలత పరచి బలాత్కారంగా కన్యను తెచ్చి చేసుకొనే పెండ్లి.
6. ఆసురం : వరుడు ధనమిచ్చి కన్యను చేపట్టడం.
7. గాంధర్వం : వధూవరులు ఒకరినొకరు ప్రేమించి ఇతరులకు తెలియకుండా చేసుకొనే పాణిగ్రహణం.
8. పైశాచం : నిద్రలో గానీ, మత్తులోగానీ ఉండి, శీల రక్షణ చేసుకొనే శక్తి లేని కన్యను రహస్యంగా తెచ్చుకొని పెండ్లాడే పద్ధతి.

'క్షాత్రం' అనే పద్ధతి కూడా ఒకటి ఉంది. కన్యావరులకు గల అన్యోన్యానురాగం తెలిసి, తల్లిదండ్రులు సమ్మతించి చేసే వివాహం. అష్టవిధ వివాహాలలో ఏదో ఒక పద్ధతిగా జరిగినట్లు లేదు రుక్మిణీ కల్యాణం.

రాచకన్నియల వివాహం స్వయంవరంగానో, రాక్షసంగానో జరుగుతుంది. 'స్వయంవరం' అంటే కన్య చేత వరింపబడడం.

"రాక్షసో యుద్ధహరణాత్" అన్నట్లు వధూబంధుజనులతో పోరాడి కన్యను హరించడం 'రాక్షసం'. స్వయంవరం, రాక్షసం పరస్పర విరుద్ధం కదా! 'రుక్మిణీ కల్యాణం' లో స్వయం వర లక్షణం మీద రాక్షసం ఆధారపడింది. ఈ రెండింటి ప్రసక్తి వల్ల ఈ కథను వినాలనే ఉత్కంఠ ఉబుకుతుంది. కాబట్టి, ఆనర్తక దేశాలను దాటి, విదర్భ దేశమందున్న కుండిన నగరాన జరిగే స్వయంవరానికి వచ్చిన కృష్ణుడొక్కడే రాజులనందరిని జయించి రుక్మిణిని ఏ విధంగా తన ద్వారకానగరానికి తీసుకొని పోయాడో వివరించుమన్నాడు పరీక్షిత్తు.

ఈ కథను వినాలనే ఆసక్తి జనించడానికి మరొక విశేషముంది.

**కల్యాణాత్మకమైన విష్ణు కథలాకర్ణించుచున్ ముక్త వై**
**కల్యుండెవ్వడు తృప్తుడౌ నది వినంగా గ్రొత్తలౌ చుండు సా**
**కల్యం బేర్పడ భూసురోత్తమ! యెఱుంగం బల్కవే రుక్మిణీ**
**కల్యాణంబు వినంగ నాకు మదిలో గౌతూహలంబయ్యెడిన్ ॥** 3

అర్థం : భూసురోత్తమ = ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా! కల్యాణ+ఆత్మకము+ఐన = మంగళకరమైన; విష్ణుకథలు = విష్ణుమూర్తి చరిత్రలను; ఆకర్ణించుచున్ = వినుచు; ముక్త వైకల్యుండు =

విడువబడిన వికలత్వం కలవాడు; ఎవ్వడు; తృప్తుడు+ఔన్ = తృప్తిని పొందిన వాడవుతాడు? (కాడని అర్థం); అది = ఆ కథ; వినంగాన్ = వినగా వినగా; క్రొత్తలు+ఔచు+ఉండున్ = క్రొత్త క్రొత్తగా అగుచుండును; సాకల్యంబు = సకలత్వం - మొదటి నుంచి కడదాకా; ఏర్పడన్ = తెలియునట్లు; రుక్మిణీ కల్యాణంబు = రుక్మిణీ పరిణయ కథను; ఎఱుంగన్ పల్కవే = స్పష్టంగా తెలియజెప్పవయ్యా! నాకు; వినంగన్ = వినడానికి; మదిలోన్ = మనస్సునందు; కౌతూహలంబు= మిక్కిలి వేడుక; అయ్యెడిన్ = అగుచున్నది - కలుగుచున్నది.

తా : ఓ బ్రాహ్మణోత్తమా! శుక మహర్షీ! శుభకరమైన విష్ణుమూర్తి కథలను వింటూ వైకల్యం తొలగిన ఏ వ్యక్తియైనా తృప్తి పడడు. ఆ కథలను వింటున్నవానికి అవి కొత్తగా అనిపిస్తూ ఉంటాయి. కాబట్టి, రుక్మిణీ కల్యాణ కథను సంపూర్ణంగా విశదపరచవయ్యా! ఆ కథను వినడానికి నా మనస్సులో ఆసక్తి జనిస్తున్నది.

వ్యాఖ్య : విష్ణుమూర్తి కథలు నిత్యనూతనంగా ఉంటాయి.

విష్ణుమూర్తి కథలు కల్యాణాత్మకాలు.

"కల్యాణం మంగలం శుభమ్" (అమరం) మంగళకరమైనవని అర్థం. ఆ కథలను వింటుండగానే సాంసారికమైన మనస్తాపం, క్షోభ తొలగిపోతుంది. ముక్తిని పొందగోరే వ్యక్తి 'విన్నది చాలు'ననలేడు. "జన్మకర్మచ మే దివ్యం" (భ.గీత) భగవానుని అవతారాలు, లీలలు పరమానందకరమైనవి. ఉత్సాహంతో కోరి తెలుసుకొన్న వ్యక్తి భగవత్సాన్నిధ్యాన్ని - ముక్తిని పొందుతాడని గీతాచార్య సూక్తి. సర్వవ్యాపకుడైన విష్ణు మూర్తి కథలు ఎన్నిసార్లు విన్నా, ఎప్పటికప్పుడు కొత్తగా వింటున్నట్లే గోచరిస్తాయి.

రుక్మిణీ కల్యాణకథ జీవకల్యాణకథ. అది పరమాత్మకూ, జీవాత్మకూ ఉన్న పతిపత్నీ సంబంధాన్ని విశదపరుస్తుంది. కాబట్టి, ఆ కథను వినే కుతూహలమున్న నాకు పూర్తిగా బోధించుమన్నాడు పరీక్షిన్మహారాజు. హేత్వలంకారం. శార్దూల విక్రీడితవృత్తం.

**భూషణములు సెవులకు, బుధ**
**తోషణములనేక జన్మ దురితౌఘవిని**
**శ్శోషణములు, మంగళతర**
**ఘోషణములు, గరుడగమను గుణభాషణముల్.** 4

అర్థం : గరుడగమను గుణభాషణముల్ = గరుడ పక్షి పైన (అధిరోహించి) సంచరించే శ్రీకృష్ణభగవానుని గుణాలను తెలిపే మాటలు; చెవులకు, భూషణములు = ఆభరణాలు; బుధ తోషణములు = పండితులను సంతోషపరచేవి, అనేకములు! అనేక జన్మ =పెక్కు పుట్టుకల

వలన కలిగిన; దురిత+ఓఘ = పాపరాశిని; వి, నిః, శోషణములు = విశేషంగా ఎండగట్టేవి; మంగళతర ఘోషణములు = మిక్కిలి శుభకరమైన ఉచ్చారణ ధ్వనులు కలవి.

తా : విష్ణు భగవానుడు గరుడ గమనుడు. ఆయన కల్యాణ గుణాలను తెలిపే మాటలు వీనులకు విందులు. విద్వద్వరులకు వినోదకరమైనవి. నానాజన్మలయందు చేసిన పాపాలను పటాపంచలు చేసేవి. ఉచ్చరించినప్పుడు మంగళ ధ్వనులు కలవి.

వ్యాఖ్య : గరుడ గమనగుణ భాషణలు మంగళతరమైనవి. వేదాత్ముడైన గరుడుని మీద ఎక్కి తిరిగే విష్ణుమూర్తి వేద వేద్యుడు. "వేదైశ్చసర్వైర హమేవ వేద్యో వేదాంతకృత్ వేదవిదేవ చాహమ్" (భ.గీ.) అనంత వేదాలచే తెలియదగినవాడను, వేదాంత నిర్మాతను, వేద విదుడనైన పరబ్రహ్మను నేనే అని తన స్వరూప స్వభావాలను స్పష్టంగా లోకానికి తెల్పినవాడు శ్రీకృష్ణభగవానుడు. ప్రత్యక్ష, అనుమానాది ప్రమాణాలచేకాక, శబ్ద ప్రమాణం చేతనే తెలుసుకోదగిన వాడు పరమాత్ముడని అర్థం.

వేద ప్రతిపాద్యుడైన గరుడ వాహనుని కల్యాణ గుణాలను ప్రకటించే సూక్తులు శ్రవణ సుభగమైనవి. శబ్దాన్ని గ్రహించే సాధనం శ్రవణేంద్రియం. కన్నులకు రెప్పలున్నట్లు చెవులకు మూతలు లేవు కదా!

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనమ్।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్॥

అనే తొమ్మిది విధాలుగా ఉన్న భక్తిలో శ్రవణానికే - వినే భక్తికే ప్రాథమ్యం కదా! భౌతిక ద్రవ్యాలను చూచేది కన్ను. అయితే కేవలం శబ్దమయమైన జ్ఞాన ద్రవ్యాన్ని పొందేది శ్రోత్రమే. కాబట్టి, "శ్రోత్రం దైవం, శ్రోత్రేణ హితచ్ఛృణోతి" అన్నది ఉపనిషద్వాణి. భగవద్గుణ భాషణం కర్ణ భూషణమేకదా!

బుధతోషణములు : జ్ఞానులకు మోద, ప్రమోద, ఆనందావహాలు.

భగవద్గాథలు శ్రుతిసుఖావహాలేకాదు, పరిణత బుద్ధులకు, చెప్పేవక్తలకూ, వినే శ్రోతలకూ అంతరంగాన్ని అమృతమయంచేసి, బాహిరంగా అంగాలయందు పులకలను అంకురింప జేసే ఆనందాన్ని కలిగిస్తాయి. అంతేకాదు;

అనేక జన్మలలో చేసిన పాపసముదాయాన్ని పంచబంగాళం చేసి, భగవదనుగ్రహం అనే పుణ్య గంధాన్ని పులుముతాయి. మంగళతర ఘోషణములు : "మంగళానాంచ మంగళమ్" అని విష్ణుమూర్తిని కీర్తిస్తారు విజ్ఞులు. మాట పెదవిదాటితే పుడమి దాటుతుంది కదా! పవిత్ర వాక్కులను పలికిన వెంటనే అవి పలుదెసల మంజుల ధ్వనితో భూనభోంతరాళాన్ని మంగళమయం చేస్తాయి.

రుక్మిణీ కల్యాణకథను సమగ్రంగా చెప్పుమని పరీక్షిత్తు ప్రార్థించిన (3వ) పద్యంతో సమన్వయించే పద్యమిది. అయినా, ప్రత్యేకంగా ఉదాహరింపదగినదై, ఉల్లేఖాలంకారమూ, చతస్ప్రాసమూ కల్గిన అందమైన కందపద్యం.

**వ : అని రాజడిగిన శుకుండిట్లనియె.**

**వినుము విదర్భ దేశమున వీరుడు కుండినభర్త భీష్మకుం**
**డనునొకదొడ్డ రాజుగలడాతనికేవురుపుత్రులగ్రజుం**
**డనఘుడు రుక్మినాబరగు నందరకుంగడగొట్టు చెల్లెలై**
**మనుజవరేణ్యా! పుట్టెనొక మానిని రుక్మిణి నా బ్రసిద్ధయై. 5**

అర్థం : (ఓ) మనుజవరేణ్యా = ఓ నరేంద్రా! వినుము. విదర్భదేశమునన్ = విదర్భ అనే దేశమందు; వీరుడు = పరాక్రమవంతుడైన; కుండినభర్త = కుండిన నగరాధి పతియైన; భీష్మకుండు అనున్ ఒక దొడ్డరాజు = భీష్మకుడనబడే ఒక మహారాజు; కలడు. ఆతనికి; ఏవురు = ఐదుగురు; పుత్రులు = కుమారులు; అగ్రజుండు = (వారిలో) మొదట పుట్టినవాడు - పెద్దవాడు; అనఘుడు = పాపాలు లేనివాడు; రుక్మినాన్ = రుక్మి అనే పేరుతో; పరగున్ = ప్రసిద్ధుడు; అందరకున్ = ఆ రాజపుత్రులందరికిని; కడగొట్టు చెల్లెలు +ఐ = చివరిది చెల్లెలై; రుక్మిణి నాన్ = రుక్మిణి అనే పేరుతో; ప్రసిద్ధయై = ప్రసిద్ధురాలై; ఒక మానిని = ఒక ఆడబిడ్డ; పుట్టెను.

తా : ఓ పరీక్షిన్మహారాజా! వినుము. కుండిన నగరాన్ని రాజధానిగా చేసుకొని విదర్భ దేశాన్ని పాలించే బలవంతుడైన రాజు భీష్మకుడు. ఆయనకు ఐదుగురు పుత్రులు. వారిలో పెద్దవాడు రుక్మి అనే మహాపుణ్యాత్ముడు. ఐదుగురు కుమారుల తర్వాత ఒక ఆడబిడ్డ పుట్టింది. ఆమె రుక్మిణి అనే పేరుతో ప్రసిద్ధురాలు.

వ్యాఖ్య : శ్రీశుక మహర్షి రుక్మిణీ కల్యాణ కథా కథనం ఆరంభించాడు.

భీష్మకుడు ప్రాకృత ప్రతిబంధకాలను భీష్మించే -నిగ్రహించే బలవంతుడైన రాజు. ఆయన దొడ్డ రాజు, అంటే బ్రహ్మవిద్వరిష్ఠుడు. ఆ రాజుకు అవిద్య, అస్మిత, రాగం, ద్వేషం, అభినివేశం (క్లేశ పంచకం) వంటి ఐదుగురు పుత్రులు జన్మించారు. వారిలో రుక్మి పెద్దవాడు. రుక్మ శబ్దానికి బంగారమని అర్థం. బంగారం లోభాన్ని కలిగిస్తుంది.

'అవిద్య' బ్రహ్మ విషయిక జ్ఞానాన్ని కలుగనీయదు. తానే స్వతంత్రుడని భావించే స్వార్థ ప్రవృత్తిని కలిగించి సతమతం చేస్తుంది. రుక్మికి అనఘుడు అనే విశేషణ పదం 'ప్రాస'గా ప్రయోగింపబడింది. ఇక్కడ 'అనఘుడు' అంటే (అఘం - పాపం) పుణ్యాత్ముడని వ్యతిరేకార్థం. పాపాత్ముడని నిందార్థకమే.

చివరకు భగవద్విషయం మీద బుద్ధి జనిస్తుంది. కాబట్టి, ఐదుగురు పుత్రుల తర్వాత కడగొట్టున పుట్టిన మానిని 'రుక్మిణి' సత్త్వబుద్ధివంటిది. స్వభావోక్త్యలంకారం. చంపక మాలా వృత్తం.

**బాలేందురేఖ దోచిన**
**లాలితయగు నపరదిక్కు లాగున, ధరణీ**
**పాలుని గేహము మెఱసెను**
**బాలిక జన్మించి యెదుగ భాసురమగుచున్. 6**

అర్థం : బాలిక = ఆడశిశువు (రుక్మిణి); జన్మించి = పుట్టి; ఎదుగ = పెరుగుతుండగా; ధరణీపాలుని = భూపాలుడైన భీష్మకుని యొక్క; గేహము = ఇల్లు; బాల+ఇందు రేఖ = సన్నని చంద్రరేఖ; తోచినన్ = ఉదయించగా; లాలిత+అగున్ = మనోజ్ఞమగునట్టి; అపరదిక్కు లాగునన్ = పడమటి దిక్కు వలె; భాసురము+అగుచున్ = కాంతికలదవుతూ; మెఱసెన్ = ప్రకాశించెను.

తా : శుక్లపక్ష విదియనాడు చంద్రరేఖ సన్నగా పుట్టి నానాట పెరుగుతున్నప్పుడు ప్రకాశించే పడమర దిక్కు లాగా, రుక్మిణి జన్మించి దినదినం పెద్ద దగుతున్నప్పుడు భీష్మకుని గృహంతేజోవంతమై ప్రకాశించింది.

వ్యాఖ్య : బాలిక పుట్టి పెరుగుతుంటే రాజభవనం కాంతిమంతమై కళకళలాడింది.

చీకటి రాత్రి గల అమావాస్య తిథి గడచిన తర్వాత శుక్ల పక్షం మొదలవుతుంది. శుక్లపక్షంలో రెండవ దినమైన విదియ తిథినాటి సాయంకాలాన ఆకాశంలో పడమర దిక్కున చంద్రకళ సన్నని రేఖగా కనబడుతుంది. ఆ చంద్రరేఖ ప్రతిరాత్రి పెరుగుతున్న కొలది పశ్చిమదిశ చాలా ప్రకాశిస్తుంది.

ఆ విధంగా, బాలకులు పుట్టిన పిమ్మట బాలిక 'రుక్మిణి' పుట్టి, ప్రతిదినం పెరుగుతుంటే భీష్మక భూపాలుని యిల్లు కాంతిమంతమై తళతళ మెఱసింది. ఉపమాలంకారంతో చమకించినదీ కందపద్యం.

**వ : మఱియు దినదిన ప్రవర్ధమానయై.**

అర్థం : రుక్మిణి ఇంక నానాట వృద్ధిని పొందుతూ -

**పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు**
**నబలలతోడ వియ్యంబులందు**
**గుజ్జన గూళుల గొమరొప్ప వండించి**
**చెలులకు బెట్టించు జెలువు మెఱయ**

**రమణీయ మందిరా రామదేశంబుల**
**బువ్వు దీగెల కును బ్రోది సేయు**
**సదమల మణిమయ సౌధభాగంబుల**
**లీలతో భర్మడోలికల నూగు**
**బాలికల తోడ జెలరేగిబంతులాడు**
**శారికాకీర పంక్తికి జదువు జెప్పు**
**బర్హి సంఘములకు మురిపములు గఱపు**
**మద మరాళంబులకు జూపు మందగతులు.** 7

అర్థం : పేరు+పేరన్ = పేరుపేరున; బొమ్మల పెండ్లిండ్లు; చేయుచున్ = చేస్తూ; అబలలతోడ = తన తోడి బాలికలతో; వియ్యంబులు+ అందున్ = సంబంధాలను పొందును; గుజ్జెనగూళుల = చిన్నపాత్రలలో వంటకాలను; కొమరు+ఒప్పన్ = అందంగా; వండించి; చెలువు = అందం; మెఱయన్ = చిందగా; చెలులకు = స్నేహితురాండ్రకు; పెట్టించున్. రమణీయ - బులన్। రమణీయ = అందమైన; మందిర = భవనాల ప్రక్కల ఉన్న; ఆరామ దేశంబులన్ = సింగారపుతోటలందు; పువ్వు తీగెలకును = పూల తీగెల మొక్కలకు; ప్రోది + చేయు = పాదులు తీసి, నీరుపోసి కాపాడును; సదమల-బుల। సత్ + అమల = మిక్కిలి స్వచ్ఛమైన; మణిమయ = రత్నాలచే నిండిన; సౌధభాగంబులన్ = మేడలలోని విశాలస్థలాలయందు; లీలతో = విలాసంగా; భర్మడోలికలన్ = బంగారపు టూయెలలో; ఊగున్. బాలికల తోడ = తన ఈడుకన్యకలతో; చెలరేగి = విజృంభించి; బంతులు+ ఆడున్ = చెండ్లాడును. శారికా, కీర, పంక్తికిన్ = గోరువంకల, చిలుకల సమూహానికి; చదువున్+ చెప్పున్ = మాటలను నేర్పును. బర్హి సంఘములకున్ = నెమళ్ళ గుంపులకు; మురిపములు = నాట్యవర్తనలను; కఱపు = నేర్పును. మదమరాళంబులకున్ = మదించిన హంసలకు; మందగతులు = మెల్లని నడకలను; చూపు = శిక్షణగా కనబరచును.

తా : రుక్మిణి తనతోడి బాలికలను సమకూర్చుకొంటుంది. బొమ్మలకు వేర్వేరు పేర్లను పెట్టి వరుసలు కల్పిస్తుంది. బొమ్మలకు పెండ్లిండ్లు చేస్తుంది. తోటి వారితో వియ్యమందుతుంది. బొమ్మలాటకోసం వంటకాలను చిన్న గురిగెలలో వండించి చెలులకు ఇంపుగా పంచి పెట్టిస్తుంది. సుందర మందిరాలను ఆనుకొని ఉన్న ఉద్యాన వనాలలో విహరిస్తుంది. పూల తీగెలకు నీరుపోసి, ఉపఘ్నాలను - ఆశ్రయాలను ఏర్పరచి వాటిని కాపాడుతుంది. మణులచే నిర్మింపబడిన మేడలలోపల బంగారపు టూయెలలో హేలగా ఊగుతుంటుంది. తన నెచ్చెలులతో కూడి చెంగలించి

చెండ్లాడుతుంది. గోరువంకలకూ, చిలుకల పంక్తికి మాటలను నేర్పుతుంది. మయూరాలకు నాటగతులనూ, మదమరాళాలకు ఒయ్యారపు నడకలనూ, తాను నడచి చూపిస్తూ శిక్షణనిస్తుంది.

వ్యాఖ్య : రుక్మిణీదేవి బాల్య క్రీడలను వర్ణించే సీసపద్యమిది. రాచకన్నియల బాల్యమెంత ఉల్లాసంగా ఉంటుందో, కవి పోతన తన కవితలో స్వభావోక్తిచే రమణీయంగా చిత్రించాడు.

**దేవకీ సుతుకోర్కి తీగెలు వీడంగ**
**వెలదికి మైదీగె వీడదొడగె**
**గమలనాభుని చిత్తకమలంబు వికసింప**
**గాంతినింతికి ముఖకమలమొప్పె**
**మధువిరోధికి లోన మదనాగ్ని పొడసూప**
**బొలతికి జనుదోయి పొడవు సూపె**
**చక్రికి ధైర్యంబు సన్నమైడయ్యంగ**
**జలజాక్షి మధ్యంబు సన్నమయ్యె.**
**హరికి బ్రేమబంధ మధికంబుగా గేశ**
**బంధ మధిక మగుచు బాలకమరె**
**బద్మ నాభువలన బ్రమదంబు నిండార**
**నెలత యౌవనంబు నిండియుండె.** 8

అర్థం : దేవకీసుతు కోర్కితీగెలు = దేవకీ దేవికి పుత్రుడైన శ్రీకృష్ణుని కోరికలు అనే సన్నని కొనలు; వీడంగ = పెరుగసాగగా; వెలదికి = స్త్రీ (రుక్మిణి)కి; మైదీగె = తీగెవంటి శరీరం; వీడన్‌తొడగెన్ = ఎదుగసాగింది. కమలనాభుని చిత్తకమలంబు = తామర పూవు బొడ్డునందు గల కృష్ణుని యొక్క మనస్సు అనే పద్మం; వికసింపన్ = విరియగా; ఇంతికిన్ = రుక్మిణికి; ముఖకమలము = కమలం వంటి ముఖం; కాంతిన్ = కాంతితో; ఒప్పెన్ = ప్రకాశించెను; మధువిరోధికి = మధువు అనే అసురునికి శత్రువైన కృష్ణునికి; లోనన్ = ఎదలో; మదన+అగ్ని = కామానలం; పొడసూపన్ = రగులగా; పొలతికిన్ = ఇంతికి (రుక్మిణికి); చనుదోయి = స్తనద్వయం; పొడవు+చూపెన్ = ఉబికెను; శౌరికిన్ = హరికి; ధైర్యంబు = తాలిమి; సన్నమై = తక్కువై; డయ్యంగన్ = దగ్గరికి రాగా; జలజ+అక్షి, మధ్యంబు = కమలాల లాంటి కన్నులు గల రుక్మిణి యొక్క నడుము; సన్నము+అయ్యెన్ = సన్నగిల్లింది; హరికి = కృష్ణునికి; ప్రేమబంధము = వలపు ముడి; అధికంబుగాన్ = బిగియగా; బాలకు = రుక్మిణికి; కేశ బంధము

= సిగముడి -కొప్పు; అధికము+అగుచు, అమరెన్ = ఎక్కువగా శోభించెను; పద్మనయను వలనన్ = తామరస నేత్రుడైన కృష్ణుని వైపు; ప్రమదంబు = సంతోషం; నిండు+ఆరన్ = పూర్ణంకాగా; నెలత యౌవనంబు = (రుక్మిణి) స్త్రీయొక్క వయస్సు; నిండి+ఉండె = నిండుగా ఆవహించింది.

తా : శ్రీకృష్ణునికి రతి విషయమైన కోరికలు వృద్ధి చెందగా, రుక్మిణికి దేహం వృద్ధిని పొందింది. కృష్ణుని మనః పద్మం వికసించడంతోనే, రుక్మిణి ముఖ కమలంకాంతిచే అలరారింది.

కృష్ణునికి మదన తాపం కలుగుతుంటే, రుక్మిణికి చనుగవ కనుగవకానింది. కృష్ణునికి ధైర్యం తగ్గినకొద్ది, రుక్మిణికి నడుము సన్నగిల్లింది. అటు కృష్ణునికి ప్రేమ దృఢ పడింది, ఇటు రుక్మిణికి సిగముడి పెద్దదయింది. ఆయనకు పూర్ణ సంతోషం కలిగినప్పుడే, ఈమెకు నిండు జవ్వనం నెలకొన్నది.

వ్యాఖ్య : రుక్మిణికి యౌవన ప్రాదుర్భావం వర్ణితం. ఈ కావ్యశిల్పం కవి ప్రతిభావిలసితం. ఆలోచనామృతం, ఆపాతమధురమే కాక ఇది శృంగార రసోద్దీపకమైనది. దేవకీసుతునికి పర్యాయంగా 'కమలనాభుడు, మధువిరోధి, చక్రి' ఇత్యాది పదాల ప్రయోగం గమనీయం. 'రుక్మిణి' పేరు వాచ్యం కాలేదు. రుక్మిణీ కృష్ణుల లక్షణాలు సమానంగా బోధింపబడినాయి. శ్రీకృష్ణుని యందు మనో లక్షణం, రుక్మిణియందు శరీర లక్షణం వర్ణింపబడింది. ఈ పరస్పర సాదృశ్యనిబంధనం సమాలంకారలక్షణం.

సాంఖ్యశాస్త్ర రీతిగా, ప్రకృతి పురుష సంబంధాన్ని భావించడమూ ఉంది. కృష్ణునికి కోరిక కల్గడం హేతువు - కారణం; Cause. రుక్మిణికి దేహమెదుగడం కార్యం - ఫలం : Effect. పురుషునికి భోక్తృత్వం, స్త్రీకి భోగ్యత్వం వారి శరీర నిర్మాణంతోనే సహజమయింది. ఇది హేత్వలంకార లక్షణం.

తీగెలు సాగడం, పూలు పూయడం, వెంటనే మదనతాపం కలిగి ధైర్యం తగ్గడం, ప్రేమహెచ్చడం, రతి పరిపుష్టమవడం ఒక భావక్రమ వికాసం. తత్ఫలితంగా, దేహమందు యౌవనం క్రమంగా వికసించడం రస వ్యంజకం.

కమల నాభుని వంటి శబ్దాల ప్రయోగం వల్ల శ్రీకృష్ణుడు సామాన్య పురుషుడు కాడనీ, సాక్షాత్తుగా శ్రీవిష్ణుమూర్తి అవతారమనీ, భగవత్పరత్వాన్ని స్పష్టంగా విశదీకరించడమూ ఉంది.

"మయ్యా_ధ్యక్షేణ ప్రకృతిః సూయతే, సచరాచరం" (భ.గీత) సర్వేశ్వరుని సంకల్పం పవిత్రమూ, సత్యమూ అయింది. "సత్యకామః, సత్య సంకల్పః" అనే కల్యాణగుణాలు కలవాడు శ్రీమన్నారాయణుడని ఉపనిషత్‌బోధ.

"ప్రకృతిం వికృతిం విద్యాం" అనీ, "త్వయైత ద్విష్ణునాచాంబ జగద్వ్యాప్తం చరాచరమ్" అనీ విష్ణుపురాణ వాక్యాలు కర్ణరసాయనాలు.

ఈ పద్యమందు ప్రకృతి స్వరూపిణియైన లక్ష్మీదేవియే రుక్మిణి అనీ, సర్వేశ్వరుని సంకల్పం చేతనే ప్రకృతి చరాచర ప్రపంచంగా పరిణమించిందనే వేదాంత శాస్త్రార్థం కూడా అనురణిస్తున్నది.

ఆట వెలదితో కూడిన ఈ సీసపద్యంలో, కృష్ణునికి కోర్కితీగ, చిత్త కమల మిత్యాది పదాలు రూపక సమాసంగానూ, రుక్మిణికి మైదీగ, ముఖకమలం మొదలైన పదాలు ఉపమానోత్తర పదకర్మధారయ సమాసంగానూ సంఘటితమవడంవల్ల శబ్ద, భావ, రచనా సౌందర్యాల త్రిపుటి అభివ్యక్తమవుతున్నది.

కవి ఇలాగా, కథారంభంలోనే పరస్పర సాదృశ్యభావాన్ని ప్రరోచకంగా ప్రకటించడమే కాక, కథలోపల కూడా ఈ భావాన్ని క్రమంగా వ్యాపింప జేయడం శిల్పరామణీయకం.

**వ : ఇట్లు రుక్మి, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మనేత్రులను నేవురకుం జెలియలైన రుక్మిణీదేవి తన యెల ప్రాయంబునన్.**

అర్థం : ఎల ప్రాయంబునన్ = లేత యౌవనమందు. (తాత్పర్యం స్పష్టమేకదా!)

వ్యాఖ్య : భీష్మకుని అయిదుగురు పుత్రుల పేర్లు ప్రకటితాలు.

"రుక్మ్యగ్రజో రుక్మరథో రుక్మబాహురనంతరః।
రుక్మకేశో రుక్మమాలీ రుక్మిణ్యేషాం స్వసాసతీ॥"

అగ్రజుడు రుక్మి. తర్వాత రుక్మరథుడు, రుక్మబాహుడు, రుక్మకేశుడు, రుక్మమాలి. వీరికి చెల్లెలుగా ఉన్నది రుక్మిణి అని శ్రీవ్యాసభాగవతం పేర్కొన్నది. ఐదవవాని పేరు 'రుక్మమాలి' అని ఉండగా ఈ ఆంధ్ర భాగవతంలో 'రుక్మ నేత్రుడు'గా 'మారి' పోవడం గమనార్హం.

**తన తండ్రి గేహమునకుం**
**జనుదెంచుచున్న యతిథి జనులవలన గృ**
**ష్ణుని రూపబలగుణాదులు**
**విని కృష్ణుడు తనకు దగిన విభుడని తలచెన్.** 9

అర్థం : తన తండ్రి గేహమునకున్ = తన తండ్రియింటికి; చనుదెంచుచున్+ఉన్న = వస్తున్నట్టి; అతిథిజనుల వలన = అతిథులైన వ్యక్తులవల్ల; కృష్ణుని రూపబలగుణ+ఆదులు = కృష్ణుని చక్కని ఆకృతి, సామర్థ్యం, మంచి గుణాలు మొదలైన వాటిని; విని; కృష్ణుడు, తనకు, తగిన; విభుడు = పెనిమిటి; అని, తలచెన్ = నిశ్చయించుకొనెను.

తా : రుక్మిణి తన తండ్రి యింటికి వస్తుండే అతిథి జనులవల్ల కృష్ణుని స్వరూప స్వభావాదులను విన్నది. తనకు తగిన భర్త కృష్ణుడే అని మనస్సులో నిశ్చయించుకొన్నది.

**ఆ లలన రూపుబుద్ధియు**
**శీలము లక్షణము గుణము జింతించి తగన్**
**బాలా రత్నము దనకి**
**ల్లాలుగ జేకొందుననుచు హరియుందలచెన్. 10**

అర్థం : ఆ లలనరూపు = ఆ రుక్మిణి యొక్క చక్కదనం; బుద్ధియు = ప్రజ్ఞకూడ; శీలము = మంచి నడవడి; గుణమున్ = స్వభావాన్ని; తగన్ = తగినట్లు = సముచితంగా; చింతించి = ఆలోచించి; హరియున్ = శ్రీకృష్ణుడుకూడా; బాలారత్నమున్ = శ్రేష్ఠురాలైన కన్యకను; తనకు; ఇల్లాలుగన్ = భార్యగా; చేకొందును+అనుచు = పరిగ్రహిస్తాను అంటూ; తలచెన్ = నిర్ణయించుకొనెను.

తా : ఆ రుక్మిణీ దేవి సౌందర్యాన్ని, బుద్ధిని, సద్వర్తనను, సాముద్రిక శాస్త్రోక్తమైన స్త్రీ అవయవ లక్షణాలను, సహనం, కారుణ్యాది సద్గుణాలను విచారించి, శ్రీకృష్ణుడు రుక్మిణిని తన ధర్మపత్నిగా చేపట్టెదనని తన హృదయంలో నిర్ణయించుకొన్నాడు.

వ్యాఖ్య : అందమైన ఈ రెండుకందపద్యాలు రుక్మిణీ కృష్ణుల రూపసౌందర్యాన్నీ, భావబలాన్నీ వ్యక్తం చేస్తున్నాయి. అతిథులంటే అమావాస్యాది తిథి విశేషం లేకుండా, ఇంటి కెన్నడైనా వచ్చే వైదేశికులు. సజ్జనులకు ఉత్తమ జీవుల లక్షణాలను ప్రశంసించడం పరిపాటి. భీష్మక మహారాజు యొక్క ఇంటికి వచ్చిపోయే అతిథి, జనులు శ్రీకృష్ణుని అందచందాలను, అఘటిత ఘటనా సామర్థ్యాన్ని, కల్యాణగుణాలను, భోగ్యభోగోపకరణాది సంపత్తును కీర్తించారు. రుక్మిణి శ్రీకృష్ణుణ్ణి ప్రత్యక్షంగా చూడలేదు. అతిథులు వర్ణింపగా విన్న కృష్ణుని రూపగుణాదులను మనస్సులో పదే, పదే భావించింది. భావనాబలంవల్ల శ్రీకృష్ణుని రూపం దర్శన సమానాకారంగా సాక్షాత్కరించింది. కంటితో చూచినట్లే స్ఫురించింది. ప్రణయం అంకురించింది. శ్రీకృష్ణుడే తనకు తగిన మగడని ఎదలో ఎన్నుకొన్నది.

"తం మేనే సదృశం పతిమ్" అని వ్యాసుని సూక్తి. "కృష్ణుడు తనకు దగిన విభుడని తలచెన్" అని పోతన మాట. రుక్మిణీదేవి దేహం భగవత్సంకల్పంవల్లనే ఎదిగింది. "యమేవైష వృణుతే తేన లభ్యః" అనేది ఉపనిషద్వాక్యం. ఏ జీవునియందు పరమాత్మయొక్క అనుగ్రహం కలుగుతుందో, ఆ జీవాత్మ చేతనే పరమాత్మ పొందదగిన వాడని అర్థం.

'దేవకీ సుతుకోర్కి' అనే పద్యంలో శృంగార రసానికి విభావసామగ్రిని ప్రతిపాదించిన పోతన, ఈ కందపద్యంలో, శ్రోత్రియులవల్ల కృష్ణభగవానుని రూపగుణ, విభూతులను వినగానే సత్త్వగుణ పూర్ణయైన రుక్మిణీ దేవికి ఆయనను పొందాలనే ప్రేమ అంకురించిందని కథను కథనం చేశాడు.

అలాగే శ్రీకృష్ణుడు రుక్మిణి యొక్క లావణ్య శీలాదులు తనకు అనురూపమైనవే అనుకొన్నాడు. 'తగినభర్త' యని మాత్రమే రుక్మిణి తలచింది. కాని శ్రీకృష్ణుడు రుక్మిణిని తనకిల్లాలుగ జేకొందును (చేకొందును = పాణిగ్రహణం - పెండ్లి చేసుకొంటాను) అని నిశ్చయించుకొన్నాడు.

"కృష్ణః స్వసదృశీంభార్యాంసముద్వోఢుం మనో దధే" - (సం.భాగ.) తనకు అనురూప, తనచే భరింపదగినది. ('సం+ఉత్+వహ' ధాతువుకు తుమున్నంత ప్రత్యయమున్న పదం - సముద్వోఢుం) కాబట్టి, శ్రీకృష్ణుడు రుక్మిణిని చక్కగా ఎత్తుకొనిపోయి వివాహం చేసుకోవడానికి నిశ్చయించుకొన్నాడు. తాననుకొన్న పనిని నిర్వహించే వాడు శ్రీకృష్ణుడని విశదమవుతున్నది.

ఇక్కడ నాయికా నాయకులు ఆలంబనంగా రతిభావం ఉద్బుద్ధమయింది. సాదృశ్యాన్ని గ్రహించడానికి అతిథి జనుల వల్ల వినడమే కారణమయింది. ఈ ఆనురూప్యం పరస్పర ప్రణయానికి హేతువయింది. పరస్పర ప్రణయమే పరిణయంగా పరిణమించిందనే కథా సంవిధానంలో భావకత, అంటే సహృదయులను ఆకర్షించే కవి చేసిన ప్రయత్నం ప్రస్ఫుటమవుతున్నది.

వాస్తవంగా ఈ రెండు పద్యాలు రసకందాలు.

**బంధువు లెల్ల గృష్ణునకు**
**బాలిక నిచ్చెదమంచు శేముషీ**
**సింధువులై విచారములు**
**సేయగ వారలనడ్డపెట్టి దు**

**స్సంధుడు రుక్మి కృష్ణునెడ**
**జాల విరోధము జేసి మత్తపు**
**ష్పంధయవేణి నిత్తు శిశు**
**పాలునకంచు దలంచెనంధుడై.** 11

అర్థం : బంధువులు = చుట్టాలు; ఎల్లన్ = అందరు; కృష్ణునకు; బాలికన్ = రుక్మిణి అనే కన్యను; ఇచ్చెదము+అంచున్; శేముషీ సింధువులై = సముద్రమంతటి బుద్ధిని కలవారై; విచారములు సేయగన్ = ఆలోచిస్తుంటే; వారలన్ = వారిని; అడ్డుపెట్టి = ఎదిరించి; వారి కోరికను కాదని; దుః+సంధుడు = చెడ్డకూటమిని ఆలోచించునట్టి; రుక్మి; కృష్ణుని ఎడన్ = కృష్ణుని పట్ల; చాల విరోధమున్ + చేసి = ఎక్కువ పగను పూని; అంధుడై = కన్నుగానని వాడై; మత్త పుష్పంధయవేణిన్ = గండు తుమ్మెదల వలె నల్లని జడగలదైన రుక్మిణిని; శిశుపాలునకున్ = చేదిదేశపు యువరాజైన శిశుపాలునికి; ఇత్తున్ + అంచున్ = ఇస్తాను అంటూ; తలంచెన్ = భావించెను.

తా : బంధువులు, తల్లిదండ్రులుకూడా రుక్మిణిని శ్రీకృష్ణునికి ఇచ్చి పెండ్లి చేద్దామని గంభీరమైన, విశాలమైన బుద్ధితో ఆలోచిస్తుండగా, దుస్సంధుడైన రుక్మిగండుతుమ్మెదల బారువలె నల్లని జడగలదైన రుక్మిణిని శిశుపాలుని కే ఇస్తానని గర్వం కలవాడై నిశ్చయించాడు.

వ్యాఖ్య : రుక్మిణిని శిశుపాలునికిచ్చి పెండ్లి చేయదలచిన వాడు రుక్మి.

రుక్మిణీ దేవి బంధువులు శేముషీసింధువులు. బంధువులలో తల్లిదండ్రులు కూడా ఉంటారు కదా! 'శేముషి' అంటె బుద్ధి. "బుద్ధి ర్మనీషాధిషణాధీః ప్రజ్ఞాశేముషీమతిః" (అమరం). బంధువులబుద్ధి సముద్రంవంటిది. లోతైన నీరు, ఎత్తైన కెరటాలు కలిగి, చెలియలి కట్టదాటకుండా, చూడముచ్చటగా ఉండేది సింధువు. అలాగే, రుక్మిణీ కృష్ణుల అనురూప్యాన్నీ, లో కొత్తర గుణాలనూ గంభీరంగా ఆలోచించి, చర్చించి, బంధువులందరు వివేక శాలురై, రుక్మిణి శ్రీకృష్ణునికే భార్యకాదగినదని అభిప్రాయపడినారు.

రుక్మిణి జన్మాంతర సుకృతంచేత భగవత్ప్రవణమైన స్థితిని పొందింది కాబట్టి, శ్రీకృష్ణభగవానునికి ఆ కన్యక నిచ్చి వివాహం చేయడమే ప్రేయస్కరమూ, శ్రేయస్కరమూ అని ధిషణాపటిమగల బంధువులు అందరూ సమ్మతించారు. ఆ సందర్భంలోనే రుక్మి, బంధువుల సమ్మతికి విరుద్ధంగా ఆలోచించాడు.

రుక్మిదుస్సంధుడు. దుష్టకూటమికలవాడు. గర్వాంధుడు. మేలుకీళ్ళను గ్రహించే బుద్ధిలేని వాడై శ్రీకృష్ణుని యందు ద్వేషాన్ని పెంచుకొన్నాడు. చిత్తమలినాలనే క్లేశపంచకంతో కూడిన ఇంద్రియాలకు, బుద్ధి తమ అధీనమై ప్రవర్తించాలనే ఆశయం ఉండడం నైసర్గికం. విషయలోభంగల ఇంద్రియాలకు భగవంతుని యందువైముఖ్యం ఏర్పడుతుంది. అందువల్ల, శేముషీసింధువులైన బంధువులతో ఏకీభవించక, రుక్మి తన చెల్లెలును శిశుపాలునికిచ్చి పెండ్లి చేయాలని గట్టి పట్టుదలతో ఉన్నాడు.

శిశుపాలుడు మనోజన్యమైన కామం మూర్తీ భవించినవాడు. నోటిలో వ్రేలును పెట్టినా, పాలను పట్టినా భేదం తెలియక ఆనంద పడేవారు స్తనంధయులు - శిశువులు. వారిని పాలించే వాడు అంటే, శిశువులలో మేటి యైనవాడు శిశుపాలుడు.

రుక్మిణికి 'మత్త పుష్పంధయవేణి' అనే పదం విశేషణం. పరహిత చింతనతో, పూలరేకులు వాడి పోకుండా, సుకుమారంగా పూలరసాన్ని పీల్చుకొని మత్తుతో జుమ్మని మ్రోగుతూ కదలాడే నల్లని తుమ్మెదల బారులాగా అందమైన జడకలది రుక్మిణి.

పైన బంధువులు ఆలోచిస్తుండగా వారితో ఏకీభవించక, రుక్మి అట్టడుగున అంధుడై ఒక్క పట్టున ఉన్నాడని సూచించే ఈ ఉత్పలమాలా వృత్త పద్యం, విశేషణాలు సాభిప్రాయాలైనందువల్ల, పరికరాలంకారశోభితం.

**అన్న తలంపు తానెఱిగి**
**యన్నవనీరజ గంధిలోన నా**
**పన్నతనొంది యాప్తుడగు**
**బ్రాహ్మణు నొక్కని జీరి గర్వ సం**
**ఛన్నుడు రుక్మి నేడు నను**
**జైద్యు నకిచ్చెద నంచునున్న వా**
**డెన్ని విధంబులంజని బు**
**ధేశ్వర! చక్రికి విన్నవింపవే.** **12**

అర్థం : ఆ+నవనీరజ గంధి = కొత్తతామర పూవుల పరిమళం వంటి దేహ పరిమళం కలిగిన ఆ రుక్మిణి; అన్న తలంపును = అగ్రజుని అభిప్రాయాన్ని; తాన్ = తాను; ఎఱిగి = తెలుసుకొని; లోనన్ = మనస్సులో; ఆపన్నతన్+ఒంది = దుఃఖపడి; ఆప్తుడగు = ఇష్టుడైన; బ్రాహ్మణున్+ఒక్కనిన్ = ఒక బ్రాహ్మణున్ని; చీరి = పిలిచి; బుధ+ఈశ్వర = ఓ పండితోత్తమా! గర్వ సంఛన్నుడు = గర్వంచేత ఆవరింపబడినవాడైన; రుక్మి; నేడు = ఈనాడు; ననున్ =

నన్ను; చైద్యునకున్ = శిశుపాలునికి; ఇచ్చెదన్+అంచున్+ఉన్నవాడు = ఇస్తానంటున్నాడు; ఎన్ని విధంబులన్ = ఎన్నికష్టాలు పడియైనా; చని = (ద్వారకకు) పోయి; చక్రికిన్ = కృష్ణునికి; విన్నవింపవే = (నామాటగా) మనవి చేయవయ్యా!

తా : రుక్మిణి తన అన్న తలపును తెలుసుకొని చాలా విచారపడింది. తనకిష్టుడైన ఒక బాపనయ్యను పిలిచింది. ఓ సుధీమణీ! నా అగ్రజుడైన రుక్మి మహాగర్విష్ఠుడు. ఆయన నన్ను శిశుపాలునికిచ్చి పెండ్లి చేయసిద్ధపడ్డాడు. నీవు ఏ విధంగానైనా ద్వారకకు పోయి నా సంగతిని శ్రీకృష్ణునికి విన్నవించవయ్యా!

వ్యాఖ్య : రుక్మిణి ఒక విప్రవరునితో తన మనోరథాన్ని విన్నవించుకొన్నది.

రుక్మిణి నవనీరజగంధి. ఇప్పుడే వికసించిన కమలాల వాసన లాంటి సువాసన (శరీరమందు) కలది. అంతసుకుమారమైన, సురభిళమైన శరీరం కలిగిన ఆ కన్నియకు మనస్తాపం కలిగింది. తన అన్న తనను శిశుపాలుని జీవిత భాగస్వామినిగా చేస్తాడన్న సంగతి తనకు తెలియడమే ఆపన్నతను పొందడానికి కారణమయింది. తన మనస్తాపాన్ని తనను కన్న వారికి కూడా చెప్పలేదు. తన శ్రేయస్సును కోరే ఒక ప్రాజ్ఞుడైన బ్రాహ్మణునితో చెప్పుకొన్నది.

గర్వ సంఛన్నుడైన రుక్మి నిశ్చయించిన శిశుపాలుని అధీనం కాలేనన్నది. ఆ విప్రుడెన్ని కష్టాలు పడినా సరె! దయచేసి ద్వారకానగరానికి పోయి శ్రీకృష్ణునికి తన కోరికను తెలియజేయుమన్నది.

శ్రీకృష్ణుడు తనను ప్రేమించినట్లు రుక్మిణికి తెలిసిందా? లేదు. ఆయన చక్రి - మన శ్చక్రాన్ని త్రిప్పి 'నమః' అనిపించేవాడు. లేదా, సంసారచక్రాన్ని ఒక్క తర్జని (చూపుడు వ్రేలు) తోనే త్రిప్పేవాడు - అని మాత్రం తెలిసింది.

శ్రీకృష్ణ భగవానుణ్ని పొందడానికే బుద్ధి పుట్టినప్పుడు ఆచార్యుడే శరణమని విశ్వసించింది. ఆచార్యుని ద్వారా తన అభిమతాన్ని భగవానునికి తెలియజేస్తే అభీష్టం సిద్ధిస్తుందన్న అధ్యవసాయంతో బుధేశ్వరుణ్ని దూతగా పంపదలచింది. ఇది ముముక్షువు లక్షణం.

ఆత్మోజ్జీవన హేతువైన ఉక్తి వైచిత్రిని వ్యక్తం చేస్తున్న ఉత్పలమాలావృత్తమిది.

**అయ్యా! కొడుకు విచారము**
**లయ్యయు వారింపజాల డటుగాకుండన్**
**నెయ్యు మెటిగించి చీరుము**
**చయ్యన నిజసేవకానుసారిన్ శౌరిన్.** 13

అర్థం : అయ్యా = గురువర్యా! అయ్యయు = (మా) తండ్రి కూడా; కొడుకు విచారములు = పుత్రుని ఆలోచనలను; వారింపన్ = త్రోసివేయడానికి; చాలడు = సమర్థుడుకాడు; అటు గాకుండన్ = రుక్మి ఆలోచన కార్యరూపం దాల్చకుండ; నెయ్యము = (నా) స్నేహాన్ని - ప్రేమను; ఎఱిగించి = తెలిపి; నిజ సేవక + అనుసారిన్ = తనభక్తులను అనుసరించునట్టి; శౌరిన్ = శ్రీకృష్ణుణ్ని; చయ్యన = శీఘ్రంగా; చీరుము = పిలుచుకొని రావయ్యా!

తా : ఓ విప్రోత్తమా! ఆర్యా! తండ్రి కూడా తనకొడుకు (రుక్మి) యొక్క ప్రయత్నాన్ని మాన్పలేడు. కాబట్టి, ఆ ప్రయత్నం నెరవేరకుండా, నాకు శ్రీకృష్ణునియందు గల ప్రేమను ఆయనకే తెల్పవయ్యా! తన భృత్యులను అనుసరించి మెలగే ఆ కృష్ణమూర్తిని త్వరగా ఇక్కడికి పిల్చుకొని రావయ్యా!

వ్యాఖ్య : శ్రీకృష్ణుణ్ని పిల్చుకొని రావడమే కల్యాణకారకమని రుక్మిణి వేడుకొన్నది.

గర్వాంధుడైన రుక్మితలపెట్టిన కార్యాన్ని మా తండ్రి కూడా 'ఆ విధంగా చేయకూడదు' అని ఆపివేసే శక్తి మంతుడుకాడు, అని రుక్మిణి తన కోరికను తండ్రికైనా చెప్పుకోలేని కారణాన్ని విప్రునికి తెలిపింది. రుక్మి ఆలోచన ఆచరణలోకి రాకుండా - కార్యరూపం దాల్చకముందే - కృష్ణమూర్తి యందు నాకున్న ప్రేమను తెల్పడమే కాక, తానే ఈ విదర్భనగరానికి త్వరగా వచ్చే రీతిగా ఆహ్వానించుమని ప్రార్థించింది రుక్మిణీదేవి. 'పిలుస్తే వస్తాడో రాడో' అని బాపనయ్య సంశయగ్రస్తుడు కాకుండా, శ్రీకృష్ణభగవానుడు 'నిజసేవకానుసారి' అని ఆయనస్వభావాన్నీ, తన విశ్వాసాన్నీ వెల్లడించింది.

"భవంతి లీలా విధయశ్చవైదికాః
త్వదీయ గంభీర మనోనుసారిణః" (స్తో.ర.20)

'భగవానుని సృష్టిస్థిత్యాది లీలలూ, ఆయన ఆజ్ఞారూపాలైన శ్రుతి స్మృత్యాదివైదిక విధులూ, భగవద్భక్తులైన వారి హృదయాన్ని అనుసరించి వర్తిస్తాయి' అని శ్రీయామునాచార్యుల సూక్తి.

వాస్తవంగా, తాను భక్తురాలనీ, భగవానుడుభక్తుల కోరికను తీర్చేవాడనీ స్పష్టపరచింది. సర్వేశ్వరుని కైంకర్యార్థం తన సర్వస్వాన్ని వినియోగించే చిత్త స్థైర్యాన్ని ఆచార్యుని ముందు ప్రదర్శించుకొన్నది రుక్మిణి.

భక్తరక్షణార్థమై శూరలక్షణలక్షితుడై శ్రీకృష్ణుడు ద్వారక నుంచి శీఘ్రంగా విదర్భకు వచ్చే స్వభావం కలవాడని క్రమంగా పలికింది. తన ఆర్తిని భగవానునికి తెల్పి

ఆయనను ఆహ్వానించడానికి అర్హత కల ఆచార్యుడే ఘటకుడు అని నమ్రతనూ ప్రకటించింది రుక్మిణీదేవి.

"విచింత్యాప్తం ద్విజం కంచిత్ కృష్ణాయ ప్రాహిణోద్రుతమ్" - తప్త చిత్తయైన వైదర్భి విశేషంగా చింతించి, కృష్ణునికోసం ఒక శ్రౌతస్మార్తకర్మ నిష్ఠుడైన బ్రాహ్మణున్ని త్వరగా పంపింది అనే శ్రీవ్యాస వాక్యానికి భక్తపోతన రచించిన (12, 13) రెండు పద్యాలు వ్యాఖ్యానంగా వెలసి ఉన్నాయి.

పతి సంయోగ సులభయైన కన్యకయొక్క వివేకాన్ని విశదం చేస్తున్నదీ కందం.

వ : **అనికొన్ని రహస్య వచనంబులు సెప్పిన విని బ్రాహ్మణుండు ద్వారకానగరంబున కుంజని ప్రతిహారులవలన దన రాక యెఱింగించి యన్నగధరుండున్న నగరు ప్రవేశించి యందు గనకా సనాసీ నుండైయున్న పురుషోత్త ముంగాంచి పెండ్లి కొడుకవు గమ్మని దీవించిన ముసిముసి నగవులు నగుచు బ్రహ్మణ్య దేవుండైన హరి తన గద్దియ దిగ్గన డిగ్గి బ్రాహ్మణుం గూర్చుండ నియోగించి, తనకు దేవతలు సేయు చందంబునంబూజలు సేసి, సరస పదార్థ సంపన్నంబైన యన్నంబు బెట్టించి రెట్టించిన ప్రియంబున నయంబున భాసురుండైన భూసురుంజేరి లోక రక్షణ ప్రశస్తంబైన హస్తంబున నతని యడుగులు పుడుకుచు మెల్లన నతని కిట్లనియె.**

అర్థం : రహస్యవచనంబులు = గోప్యమైన మాటలను; ప్రతిహారుల వలనన్ = ద్వారపాలకుల ద్వారా; ఆ+నగధరుండు = గోవర్ధనగిరిని ధరించిన ఆ కృష్ణ భగవానుడు; నగరు = రాజభవనం; కనక+ఆసన+ఆసీనుండై యున్న = బంగారు పీట మీదకూర్చున్నవాడైన; పురుష+ఉత్తమున్, కాంచి = శ్రీకృష్ణమూర్తిని దర్శించి; దీవించినన్ = ఆశీర్వదించగా; బ్రహ్మణ్య దేవుండు-వైదిక కర్మలయందు పూజ్యుడైన భగవానుడు; గద్దియ = పీఠం నుంచి; దిగ్గనన్ = తటాలున; డిగ్గి = దిగి; నియోగించి = చెప్పి/చేసి; సరస పదార్థ సంపన్నంబైన = షడ్రసవస్తువులతో కూడిన; రెట్టించిన ప్రియంబునన్ = రెండింతలు హెచ్చిన ప్రీతితో; నయంబునన్ = నమ్రతతోనూ; భాసురుండైన భూసురున్ = ప్రకాశించిన బ్రాహ్మణున్ని; చేరి = సమీపించి; లోక రక్షణ ప్రశస్తంబైన హస్తంబునన్ = లోకాలను, లోకులను కాపాడడం చేత పొగడదగినదైన చేతితో; అడుగులు పుడుకుచు = (బ్రాహ్మణుని) పాదాలను ఒత్తుతూ; కాళ్ళు పిసుకుతూ; మెల్లన = ఆదరంతో; ఇట్లు అనియె = చెప్పబోయే రీతిగా సంభాషించెను.

తా : రుక్మిణీదేవి మరికొన్ని రహస్య విషయాలను చెప్పగా విని ఆ విప్రుడు ద్వారకకు వెళ్ళాడు. శ్రీకృష్ణభగవానుణ్ని దర్శించాడు. భూదేవుడూ, దేవదేవుడూ పరస్పరం గౌరవించుకొన్న భంగిమను ప్రకటించిన వచనం స్పష్టం.

**జగతీసురేశ్వర సంతోషచిత్తుండ**
**వైయున్న నీ ధర్మమతి సులభము**
**వృద్ధ సమ్మతమిది విత్తమెయ్యది యైన**
**బ్రాపింప హర్షించు బ్రాహ్మణుండు**
**తన ధర్మమున నుండు దరలడాధర్మంబు**
**గోరిక లతనికి గురియుచుండు**
**సంతోషిగాడేని శక్రుడైన నశించు**
**నిర్ధనుండైనను నిద్రబోవు**
**సంతసించె నేని సర్వభూత సుహృత్త**
**ములకు బ్రాప్తలాభ ముదితమాన**
**సులకు, శాంతులకును సుజనులకును గర్వ**
**హీనులకును వినతులే నొనర్తు.** **14**

అర్థం : జగతీ సుర+ ఈశ్వర = భూసురోత్తమా! సంతోష చిత్తుండవైయున్న = సంతోషం పొందిన మనస్సు కలవాడవై యున్న; నీ ధర్మము = నీ స్వభావం; అతి సులభము = మిక్కిలి చక్కగా లభించింది - చాలా సరసమైనది; ఇది = సంతోష చిత్తుడై ఉండే ధర్మం; వృద్ధ సమ్మతము = జ్ఞాన వయోవృద్ధులచేత అంగీకరింపబడింది; విత్తము = ధనం; ఎయ్యది యైనన్ = ఎట్టిదైనా - ఎంత మాత్రముదైనా; ప్రాపింపన్ = లభింపగా; బ్రాహ్మణుండు = పారుడు - విప్రుడు; హర్షించున్ = ఆనందించును; తన ధర్మమునన్ + ఉండున్ = స్వీయ వృత్తియందే ఉండును; ఆ ధర్మంబున్ = ఆ స్వధర్మం నుంచి; తరలడు = తొలగడు; అతనికిన్ = తన ధర్మాన్ని వదలని వ్యక్తికి; కోరికలు = తలచుకొన్న పదార్థాలు; కురియుచు+ఉండున్ = వర్షించును - సమకూరును; సంతోషికాడేని = సంతోషించినవాడు కాని యెడల; శక్రుడు+ఐనన్ = ఇంద్రుడైనను; నశించున్ = నష్టపడును; నిర్ధనుండైనను = దరిద్రుడైనను సంతోషం కల వాడే అయితే; నిద్రబోవున్ = సుఖంగా నిద్రించును; సర్వభూత సుహృత్తములకున్ = అన్ని భూతముల యందు ప్రేమకలవారికి; ప్రాప్తలాభముదితమానసులకు = పొందబడినఫలం చేత సంతోషపడిన మనస్సు కలవారికి; శాంతులకును = స్థిరచిత్తులకును; సుజనులకును = మంచిపుట్టుక కలవారికిని; గర్వహీనులకును = అహంకారం లేని వారికిని; ఏన్ = నేను; వినతులు = నమస్కారాలను; ఒనర్తున్ = చేయుదును.

తా : ఓ విప్రోత్తమా! నీవు సంతోష మనస్కుడవు. నీ స్వభావం అతి సరసమైనది. ఇట్టి ధర్మం పెద్దలకు ఇష్టమైనదే. ఎవడు ధనం స్వల్పంగా లభించినా తృప్తిని పొందునో, ఎవడు తన ధర్మాన్ని విడువక వర్తిస్తాడో, అట్టి విప్రునికి కోరికలన్నీ నెరవేరుతాయి.

ఎవడు దొరికినంతకు సంతసించడో వాడు స్వర్గాధిపతియైనను కృశించి నశిస్తాడు. దొరికినంతమాత్రంతో తృప్తి పడేవాడు ధనహీనుడైనా నిశ్చింతగా నిద్రపోతాడు. సకల ప్రాణుల మేలు కోరేవారికీ, లభించిన దానితో తృప్తిని పొందే వారికీ, శాంత స్వభావులకూ, సుజనులకూ, గర్వంలేని మహాత్ములకు నేను వందన మాచరిస్తాను.

వ్యాఖ్య : స్వధర్మపరులైన విప్రులకూ, సుజనులకూ శ్రీకృష్ణభగవానుడు నమస్కరిస్తానన్నాడు.

రుక్మిణి పంపిన విప్రుడు సంతోషచిత్తుడు. తన వర్ణాశ్రమాచార ధర్మాన్ని వదలక విధిగా ఆచరించేవాడు. విత్తం కొంచెం లభించినా విచార పడక సంతోషించే వ్యక్తికి సకల వాంఛలు నెరవేరుతాయి. దొరికినంత ఫలానికి సంతోషింపని వాడు దేవేంద్రునంతటి సంపద కలవాడైనా నశిస్తాడు. దరిద్రుడైనప్పటికీ దొరికినంత మేరకు సంతోష పడే వ్యక్తి సుఖంగా నిద్రిస్తాడు.

"అసంతుష్టోద్విజోనష్టః సంతుష్ట ఇవ పార్థివః।
సలజ్జా గణికానారీ నిర్లజ్జేవ కులాంగనా॥"

ఉన్న దానితో తృప్తి పడే రాజు వలె, నిత్యం సంతోష చిత్తుడుకాని బ్రాహ్మణుడూ నశిస్తాడు. సిగ్గులేని కులకాంతలాగా, సిగ్గుపడే వేశ్యకాంత నష్టపడుతుంది. ఇది ప్రామాణికమైన మాట.

కాబట్టి, ద్విజుడు నిత్య సంతుష్టుడై, స్వధర్మ నిరతుడై, జీవితాన్ని గడపడం జ్ఞానవయో వృద్ధులకు చాలా ఇష్టమైన విషయం.

సర్వభూత హితరతులు, స్వల్పలాభ సంతుష్టులు, శాంతచిత్తులు, సౌజన్యమూర్తులు, నిరహంకారులు శ్రీకృష్ణ భగవానునికి అత్యంత ప్రియులు కాబట్టి, వందనీయులు.

సద్గుణ గరిష్ఠుడూ, సదాచార పరాయణుడూ, సకల భూత హితకరుడూ అయిన విప్రునిపట్ల వినయ విధేయతలను ప్రకటించకుండా చారుతర మూర్తి గోపాల చక్రవర్తి ఉండలేకపోయాడని ఆట వెలదితోకూడిన ఈ సీస (శీర్ష) పద్యం తేట పరుస్తున్నది.

**ఎవ్వని దేశమందునికి**

**యెవ్వనిచే గుశలంబుగల్గు మీ**

**కెవ్వని రాజ్యమందు ప్రజ**

**లెల్ల సుఖింతురు వాడు మత్ప్రియుం**

**డివ్వన రాశి దుర్గమున**
**కెట్లరుదెంచితి వయ్య! నీవు, లే**
**నవ్వులుగావు నీతలపు**
**నంగల మేలొనరింతు ధీ మణీ.** 15

అర్థం : ధీమణీ = ప్రజ్ఞ కలవారిలో శ్రేష్ఠుడా! ఎవ్వని దేశమందు = ఏ రాజు పాలించే దేశమందు; ఉనికి = మీ నివాసం-కాపురం? ఎవ్వనిచేన్ = ఏ రాజుచేత; మీకు; కుశలంబు కల్గున్ = క్షేమం కలుగును? ఎవ్వని రాజ్యమందు = ఏ రాజు యొక్క ఏలుబడిలో; ప్రజలు+ఎల్లన్ = జనులందరు; సుఖింతురు = సుఖంగా జీవింతురో; వాడు = ఆ రాజు; మత్ ప్రియుండు = నాకు ఇష్టుడు. నీవు; ఈ + వనరాశి దుర్గమునకు = ఈ సముద్ర మందు ప్రవేశింపరాని (కోటకు) పట్టణానికి; ఎట్లు = ఏ విధంగా; అరుదెంచితివి+అయ్య = వచ్చితివయ్యా? నీ తలంపునన్ = నీ మనస్సున; కలమేలు = ఉన్న మంచి పనిని; ఒనరింతును = చేతును; లే నవ్వులు గావు = పరిహాసపు మాటలు కావు;

తా : సద్బుద్ధిగల ఓ విప్రోత్తమా! నీవే దేశమందు (కాపురం) ఉంటున్నావు? ఏ రాజు మీ క్షేమాన్ని విచారిస్తుంటాడు? ఏరాజు పాలనలో ప్రజలు సుఖంగా జీవిస్తుంటారో ఆ రాజు నాకు ప్రియమైన వాడు. నీవు ఈ జలధి మధ్యనున్న ప్రవేశింప శక్యం కానట్టి ద్వారకా నగరానికి ఏ విధంగా రాగలిగితివి? నీ మనస్సులోనున్న మంచి కోరికను నెరవేరుస్తాను. ఇది పరిహాసం కాదు అన్నాడు శ్రీకృష్ణ భగవానుడు.

వ్యాఖ్య : శ్రీకృష్ణమూర్తి విప్రోత్తమునితో కుశల ప్రశ్న చేశాడు.

విజ్ఞాన ఘనులైన విప్రుల యోగక్షేమాలను తెలుసుకొంటూ, ప్రజారంజకంగా రాజ్యాన్ని పాలించే ప్రభువు భగవదను గ్రహానికి పాత్రుడు. ప్రకృతి రంజకుడైన రాజు గల దేశం నుంచి ధీమంతుడైన బ్రాహ్మణుడు ఎందుకు వచ్చాడు? నడి సముద్రంలోని ద్వీపం మీద, ప్రవేశించరాని పెద్ద కోటలోపల నిర్మింపబడియున్నది ద్వారకా నగరం.

ఇట్టి ఉపేయమైన స్థలానికి ఎంతో కష్టపడే ఉపాయబుద్ధి కలవారైతే గాని చేరలేరు కదా! బాపనయ్యను 'ధీమణి' అంటూ కృష్ణుడు సంబోధించాడు. "ధీః ప్రజ్ఞా శేముషీమతిః" (అమరం) ఉపాయమూ, ఉపేయమూ (రెండు) భగవంతుడే అని విశ్వసించే బుద్ధి కలవారు భగవత్సన్నిధికి చేరుతారు. ఆచార్యుని హృదయం స్వార్థ పూరితమైనది కాదు. అది పరహిత చింతాభరితం. అంటే ఇతరులకు మేలు -

ప్రేయః శ్రేయస్సులనే కోరుతుంది. తాను కాక తక్కిన జనుల కోసం ఆచార్యుడు అర్థించే 'మేలు'ను సావధానంగా విని భగవానుడే నిర్వహిస్తాడు. ఇది నవ్వుల మాట కాదు, వేల్పుల బువ్వ లాగా అనుభవయోగ్యమైన మాట. "ఏష ఆదేశః, ఏష ఉపదేశః" అని వేదాన్త శాస్త్ర ప్రతిపాదితమైన మాట. "యేతత్ర బ్రాహ్మణాః సమ్మర్శినః, అలూక్షాః ధర్మకామాః స్యుః" అని ఉపనిషద్వాణి. "ధర్మార్థ కామాః సమమేవ సేవ్యాః" అని పంచమ వేద వాక్కు.

వివేకవంతులైన విజ్ఞానులు ధర్మార్థకామాలను సమానంగా ఆచరిస్తుంటారు. అక్కడనే అవి ఆగిపోకుండా, లోకకల్యాణార్థం వినియోగపడడమే కాదు, మోక్ష ప్రాప్తికే మార్గదర్శక మవుతాయన్న మాటను తెలియజేసే ఈ పద్యం ఉత్పలమాలా వృత్తం.

వ : **అని యిట్లు లీలాగృహీత శరీరుండైన యప్పర మేశ్వరుండడిగిన, ధరణీసుర వరుండతనికిట్లనియె. దేవా! విదర్భ దేశాధీశ్వరుండగు భీష్మకుండను రాజు గలడు. ఆ రాజుకూతురు రుక్మిణియను కన్యకా మణి గలదు. అయ్యిందు వదన నీకు కైంకర్యంబు సేయంగోరి, వివాహ మంగళ ప్రశస్తంబైన యొక్క సందేశంబు విన్నవింపు మని పుత్తెంచె నవధరింపుము.**

అర్థం : లీలా గృహీత శరీరుండు + ఐన = వేడుకగా గ్రహింపబడిన దేహం కలవాడైన; ఆ+పరమేశ్వరుండు = ఆ విష్ణుమూర్తి; అడిగినన్ = ప్రశ్నించగనే; ధరణీసురవరుండు = భూదేవతలలో శ్రేష్ఠుడు-విప్రోత్తముడు; అతనికిన్ = కృష్ణునితో; ఇట్లు అనియెన్ = ఇలాగా పల్కెను; దేవా = ఓ స్వామీ! విదర్భదేశ+ఆధి+ఈశ్వరుడు = విదర్భ దేశానికి ప్రభువు - భీష్మకుడు, ఆ రాజుకూతురు రుక్మిణియను, కన్యకామణి = శ్రేష్ఠురాలైన కన్యక, ఆ+ఇందువదన = చంద్రునిలాంటి ముఖం గల ఆ కన్యక; నీకు, కైంకర్యంబు = సేవను, చేయన్ కోరి = చేయడానికి ఇష్టపడి; వివాహ మంగళ ప్రశస్తంబైన = పెండ్లి అనే శుభకార్యం కోసం కొనియాడదగిన; ఒక్క సందేశంబు = ఒక్క సమాచారాన్ని; విన్న వింపుము+అని = విజ్ఞాపన చేయుమని; పుత్తెంచెన్ = (నన్ను) పంపెను. అవధరింపుము = చిత్తగించుము.

తా : ఇలాగా, లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణ భగవానుడడిగిన వెంటనే ఆ బ్రాహ్మణుడిట్లు విన్నవించాడు. ఓ దేవా! విదర్భ దేశపు రాజైన భీష్మకుని పుత్రిక రుక్మిణి. ఆ చంద్రానన నీకు కైంకర్యం చేయాలని అపేక్షించింది. నిన్ను వివాహం చేసుకొనే విషయమై ఒక్క సందేశాన్ని నీకు విన్నవించుమని చెప్పి, నన్ను పంపింది. నీతో చెబుతాను, వినుమన్నాడు విప్రుడు.

వ్యాఖ్య : రుక్మిణి చెప్పి పంపిన వార్తను చక్కగా చిత్తగించుమని శ్రీకృష్ణమూర్తితో అన్నాడు విప్రోత్తముడు.

శ్రీకృష్ణ భగవానుడు లీలాగృహీత శరీరుడు. "ఇచ్ఛా గృహీతాభిమతోరుదేహః" (వి.పు.) తాను కోరుకొన్న ఆకారాన్ని దాల్చేవాడు విష్ణుమూర్తి. ఆయన పరమేశ్వరుడు. బ్రహ్మరుద్రుల కంటె గొప్పవాడు. ఆ విష్ణువే విలాసంగా మానవ దేహాన్ని తానే సంకల్పించుకొని ధరించిన వాడు శ్రీకృష్ణుడు.

రుక్మిణి ఇందువదనయే. తనకు కాక, ఇతరులకు ఆహ్లాదాన్ని కలిగించే సుముఖుడు చంద్రుడు. చంద్రుని వంటి ముఖశోభ కలది రుక్మిణి. తన కోసం కాక పరుని ఆనందంకోసమే చేసే సేవను - దాస్యాన్ని కైంకర్య మంటారు. ఫలం తనకే చెందాలని చేసే పని (కర్మ) బంధ మవుతుంది. "అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః" (భ.గీ) ఫలాన్ని కోరకుండా, పరార్థంగా చేసే పని ముక్తిని పొందడానికి హేతువవుతుంది. బంధంలో ఉన్న కన్యకా మణి శ్రీకృష్ణునికి కైంకర్యం చేయగోరింది. ఆ కోరికలోని తీవ్రతను ఆచార్యుడు గమనించి, కృష్ణ భగవానునిచే అంగీకరింప జేయగలడనే అధ్యవసాయంతో పంపిన సందేశాన్ని చిత్తగించుమన్నాడు. శ్రీకృష్ణుడు రుక్మిణీ కైంకర్యాన్ని అంగీకరించడమే వివాహ శుభకార్యానికి నాంది కదా!

**ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోక**
**దేహ తాపంబులు దీఱిపోవు**
**నేనీ శుభాకారమీక్షింప గన్నుల**
**కఖిలార్థలాభంబు గలుగుచుండు**
**నే నీ చరణ సేవ లేప్రొద్దు చేసిన**
**భువనోన్నతత్వంబు బొందగలుగు**
**నేనీ లసన్నామ మే ప్రొద్దు భక్తితో**
**దడవిన బంధ సంతతులు వాయు**
**నట్టి నీయందు నాచిత్త మనవరతము**
**నచ్చియున్నది నీయాన నానలేదు**
**కరుణ జూడుము కంసారి! ఖలవిదారి!**
**శ్రీయుతాకార! మానినీ చిత్తచోర!!** **16**

అర్థం : కంస+అరి = కంసునికి శత్రువైనవాడా! ఖల విదారి = దుష్టులను దునిమేవాడా! శ్రీయుత+ఆకార = తేజస్సుతో కూడుకొన్న ఆకృతి కలవాడా! మానినీ చిత్తచోర = మానవతుల మనస్సును దొంగిలించిన వాడా! ఏ నీ గుణములు = ఏ నీ సర్వజ్ఞత్వాదిగుణాలు; కర్ణ+ఇంద్రియంబులు, సోకన్ = చెవులకు తాకగానే; దేహతాపంబులు = శరీరాన్ని అంటిన మంటలు; తీఱిపోవున్ = తగ్గిపోవునో; ఏ నీ శుభ+ఆకారము = ఏ నీ మంగళ రూపాన్ని; ఈక్షింపన్ = చూడగానే; కన్నులకు; అఖిల+అర్థలాభంబున్ = సకల ప్రయోజనాల ఫలం; కలుగుచుండున్ = సిద్ధించునో; ఏ నీ చరణ సేవన్ = ఏ నీపాద పూజను; ఏ ప్రొద్దున్ = ప్రతిదినమూ; చేసినన్ = చేయగానే; భువన+ఉన్న తత్వంబున్ = లోకమందు గొప్ప తనాన్ని; పొందన్, కలుగున్ = పొందడం సంభవించునో; ఏనీ లసత్ + నామము = ఏ నీ యొక్క ప్రకాశించే పేరు; ఏ ప్రొద్దు = ఎల్లప్పుడు; భక్తితోన్ = ప్రేమతో; తడవినన్ = స్మరించగా - పలుకగానే; బంధసంతతులు = సంసారబంధ సమూహాలు; పాయున్ = తొలగిపోవునో; అట్టి నీయందు = అట్టి పరాత్పరుడవైన నీయందు; నా చిత్తము = నా మనస్సు; అనవరతము = ఎడతెగక - ఎల్లప్పుడు; నచ్చియున్నది = నమ్మియున్నది; నీ+ఆన = నీ సాక్షిగా; నాన లేదు = సిగ్గులేదు; కరుణన్ = కృపతో; చూడుము = (నన్ను) కటాక్షింపుము.

తా : ఓ కంసారీ! ఖలవిదారీ! శ్రీయుతాకారా! మానినీ చిత్తచోరా! నీ కల్యాణ గుణాలను విన్న వెంటనే తాపత్రయం తగ్గిపోతుంది. నీ దివ్యమంగళ రూపాన్ని దర్శించిన కన్నులకు సకల విషయాలను చూచినంతటి భాగ్యం కలుగుతుంది. నీ పాద పూజను ప్రతిదినమూ చేస్తుంటే లోకాధిక్యం సిద్ధిస్తుంది. 'కృష్ణ' అనిప్రకాశించే నీ పేరును భక్తితో తలచినంతనే సంసార బంధాలు తొలగిపోతాయి. అట్టి నీ యందు నా మనస్సు లగ్నమైనది. ఇందుకు నీవే సాక్షివి. సిగ్గు విడిచి నా అభిమతాన్ని నీ ముందు విన్నవించుకొంటున్నాను. కరుణించి నన్ను కటాక్షింపుము.

వ్యాఖ్య : విప్రుడు శ్రీకృష్ణునికి రుక్మిణీ సందేశాన్ని విన్నవిస్తున్నాడు.

రుక్మిణి తన విజ్ఞప్తికి తగిన పేర్లతో కృష్ణమూర్తిని సంబోధించింది.

కంసారి : - కంసుణ్ని సంహరించిన వాడని సామాన్యార్థం. కం = సుఖాన్ని; స = నశింపజేసే అహంకారానికి; అరి = శత్రువని విశేషార్థం. సర్వానర్థాలకు కారణమైన అహంకారాన్ని తొలగించి 'దాసో஽హ'మనిపించే వాడు శ్రీ కృష్ణుడు; ఖలవిదారి = దుర్జనులను చీల్చి చెండాడే వాడని బాహ్యార్థం; రాగద్వేషకామక్రోధ లోభమోహ మదమత్సరాది దుర్గుణాలను ఛేదించే వాడని అంతరార్థం.

శ్రీయుతాకారుడు అంటే సూర్యకోటి సమ ప్రభతో వెలిగే రూపవంతుడు. అనపాయినియైన లక్ష్మీ దేవితో కూడిన దివ్యమంగళ విగ్రహుడని గంభీరార్థం.

మానినీ చిత్తచోరుడు అనే పదం ప్రణయకోపంతో బిఱ్ఱబిగిసికొని యుండే పడుచుల యెడదలో బెడద కలిగించి, వారి చిత్తాన్ని తన విత్తంగా మలచుకొనే కళాపూర్ణుడనే అర్థాన్ని వ్యక్తం చేస్తుంది.

శ్రీకృష్ణుడు నిరతిశయఔజ్జ్వల్య సౌందర్యసౌగంధ్య సౌకుమార్య లావణ్య యౌవనాద్యచింత్యదివ్యాద్భుత రూపం కలవాడు. సౌశీల్య వాత్సల్య మార్దవార్జవ సౌహార్ద సౌమ్యకారుణ్య మాధుర్య గాంభీర్యౌదార్య చాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమాద్యనంత కల్యాణ గుణ గణం కలవాడు. ఆయనలో సౌలభ్యమెంత ఉందో పరత్వమూ అంత ఉంది. సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ, సర్వభోక్తృత్వ, సర్వనియంతృత్వ, సర్వాంతర్యామిత్వ, సర్వస్రష్టృత్వ, సర్వపాలకత్వ, సర్వసంహారకత్వాది పరగుణాలూ ఉన్నాయి. పరుడంటే సర్వశేషి. అతని కంటె అధికుడు లేడన్నమాట. ఇట్టి రూప గుణాదులచేత సుకృతాత్ములకు ఆనందం కలిగించేవాడు శ్రీకృష్ణుడు. దానికి మొదటి సాధనం శ్రవణ మన్నది రుక్మిణి. శ్రీకృష్ణభగవానుని కల్యాణగుణాలు కర్ణరసాయనాలు. ఆ గుణాలు చెవులలో పడగానే పదిలంగా ఎదలోకి చేరుతాయి. తత్ఫలితంగా, గుండెమంటలారిపోతాయి. ఆధ్యాత్మికాధి భౌతికాధిదైవికాలన బడే తాపత్రయం నశిస్తుంది. "మనోఽస్య దైవంచక్షుః" (శ్రుతి) అప్పుడు మనోనేత్రానికి భగవద్రూపం కనబడుతుంది. సకల శుభలక్షణాలతో కూడిన కృష్ణమూర్తిని చూడగానే కన్నులకు అఖిలార్థలాభం కలుగుతుంది. "దృష్టిస్సతాం దర్శనేఽస్తుభవత్తనూనామ్" (భాగ. 10-10-39) అన్నట్లు, పృథివ్యాది పంచభూతాలు, నక్షత్రాలు, దిక్కులు, చెట్లు, చట్లు, వాగులు, సముద్రాలు, మృగాలు, సాధువులు ఒకటేమిటి? జగమంతా భగవంతుని స్వరూపమేకదా! వాటినన్నిటినీ - విశ్వమంతా చూచిన భాగ్యమబ్బుతుందని 'అఖిలార్థలాభ' పదానికి అర్థం. ఖిలంగానట్టి - నశింపని మోక్షపురుషార్థం లభిస్తుందని విశేషార్థం.

దివ్య మంగళ విగ్రహ దర్శనమైనదే తడవుగా మోక్షానికి ముఖద్వారమైన పాదాలకు సేవ చేయాలని చిత్తముత్తల పడుతుంది. పాదసేవ చేసిన ఫలితంగా లోకాధిపత్యం సులభమవుతుంది.

"పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి" అనే శ్రుతిరీత్యా భగవత్పాదరూపాలైన సర్వభూతాలకు (ప్రాణులకు) ప్రతిదినం సేవ చేస్తుంటే త్రిపాద్విభూతి - అనంతగరుడ విష్వక్సేనాది నిత్యసూరులు నివసించే పరమపదం ప్రాప్తిస్తుంది.

"కృష్ణేతి మంగళం నామ యస్య వాచి ప్రవర్తతే।
భస్మీభవంతి రాజేంద్ర! మహాపాతక కోటయః॥"

కృష్ణా! అనే శుభనామాన్ని అనన్యభక్తితో నోట పలికితే మహాపాపాలన్నీ బుగ్గి బూడిదయై పోతాయి. 'బంధసంతతు'లంటే సంసార కారణాలైన "దయ, జుగుప్స, మోహం, భయం, సంశయం, కులం, బలం, శీలం" అనే అష్టపాశాలు తెగిపోతాయి. ప్రాకృతిక బంధాలు పటాపంచలై పోయిన జీవాత్మ "జ్ఞానానందామలాత్మా" అన్న రీతిగా స్వస్వరూపంతో భాసిస్తుంది. "కృష్ణస్తు భగవాన్ స్వయం". కల్యాణగుణాలు, భవ్యరూపం, దివ్యపాదాలు, శుభనామం కలిగిన కృష్ణ భగవానునియందు రుక్మిణి మనస్సు లగ్నమైనది. "నీ గుణాలను విని, నీ రూపాన్ని స్మరించి, నీ పాదాలను సేవిస్తూ, నీ నామాన్ని కీర్తిస్తున్న నాకు సిగ్గులేదు. నీ ఒట్టు" అన్నది రుక్మిణి.

స్త్రీలకు మనసులోని విషయాలను ఇలాగా వెల్లడించుకోవడంలో సిగ్గుపడడం లోకపరిపాటి. అయినా నీ యందు నా చిత్తం నిత్యాభియుక్తమైనందు వల్ల లోకబాహ్యనై, సిగ్గు విడిచి నా మనోగతాన్ని విన్నవించుకొంటున్నాను. కాబట్టి, కృష్ణా! కృపతో నన్ను కటాక్షించు" మన్నది.

తేట గీతితో కూడిన ఈ సీసపద్యం సంబంధ సర్వనామ పద రచనతో స్వభావోక్తిగా ఔచిత్యాన్ని సంతరించుకొన్నది.

**ధన్యున్‌లోక మనోభిరాము గుల విద్యా రూపతారుణ్య సౌ**
**జన్య శ్రీబలదానశౌర్య కరుణా సంశోభితున్ నిన్ను నే**
**కన్యల్‌గోరరు? కోరదే మును రమాకాంతాలలామంబు రా**
**జన్యానేకపసింహ! నావలననే జన్మించెనే మోహముల్.** 17

అర్థం : రాజన్య+అనేకప, సింహ= (దుష్ట) రాజులనే ఏనుగులకు సింహంలాంటి వాడా! ధన్యున్ = పుణ్యశీలుణ్ణి; లోక మనస్+అభిరామున్ = జనుల మనస్సుకు ఒప్పినవాణ్ణి; కులవిద్యా - సంశోభితున్। కుల = కులంచేత; విద్యా = విద్యచేత; రూప = చక్కదనంచేత; తారుణ్య = యౌవనంచేత; సౌజన్య = మంచితనంచేత; శ్రీ = సంపద చేత; బల = బలంచేత; దాన = ఈవిచేత; శౌర్య = పరాక్రమంచేత; కరుణా = దయచేత; సంశోభితున్ = ప్రకాశించే వాడవైన; నిన్నున్; ఏ కన్యలు = వివాహం కాని పడుచులు; కోరరు = కోరకుందురు? మును = పూర్వం; రమాకాంతాలలామంబు = స్త్రీలలో శ్రేష్ఠురాలైన లక్ష్మీదేవి; కోరదే = కోరలేదా? మోహముల్ = వలపుల తలపులు; నా వలననే; జన్మించెనే = పుట్టినవా?

తా : శత్రురాజులనే ఏనుగులకు సింహమైన ఓ కృష్ణా! నీవు ధన్యుడవు, లోక మనోభిరాముడవు. కులం, విద్య, రూపం, యౌవనం, సుజనత్వం, సంపత్తు, బలం, దానం, శౌర్యం, కరుణ అనే గుణాలచేత బాగా ప్రకాశించేనిన్ను కోరని కన్యక లెవరు? స్త్రీలలో ప్రధానురాలైన లక్ష్మీదేవియే నిన్ను కోరలేదా? ఈ మోహం నాకే పుట్టి, నేనే కొత్తగా మోహించానా?

వ్యాఖ్య : రుక్మిణి, తనకు శ్రీకృష్ణుని మీద కల్గిన మోహాన్ని సమర్థించుకొన్న పద్యమిది.

'రాజన్యానేకప సింహ' పదం శ్రీకృష్ణునికి సాభిప్రాయ విశేషణం. 'అనేకప' మంటే తొండంతోనూ, నోటితోనూ (రెంటిచేత) నీటిని త్రాగుతుంది కాబట్టి, ఏనుగుకు ద్విపమనీ, అనేకపమనీ పర్యాయపదాలు. "రాజకం, రాజన్యకంచ నృపతి క్షత్రియాణాంగణే క్రమాత్" (అమరం) 'రాజక' శబ్దానికి పాలకులైన రాజుల సమూహమని అర్థం. 'రాజన్య' పదానికి క్షత్రియజాతి రాజుల సమూహమని అర్థం.

మదపుటేనుగుల లాగా క్రొవ్వి సంచరించే (శత్రు)రాజులకు సింహంలాంటి వాడు శ్రీకృష్ణుడు. భావికార్యాన్ని సూచిస్తున్న పదమిది.

శ్రీకృష్ణుడు ధన్యుడు. "పుణ్యానామపి పుణ్యోసౌ" అని ఆర్షవాక్యం. ధనమంటే పుణ్యమని అర్థం. ధనం లబ్ధో = ధన్యః. "సుకృతీ పుణ్యవాన్ ధన్యః" (అమరం) పుణ్యం కలవాడు.

లోకమనోభిరాముడు. లోకుల మనస్సును ఆకర్షించే అందం కలవాడు. జనుల చిత్తమందు రమించేవాడు. వంశం, విద్య, జవ్వనం, మంచితనం, తేజస్సు (లేదా) సంపత్తు, బలం, ఈవి, శౌర్యం, దయ అనే ఈ గుణాలచే వెలిగే వాడు. పేర్కొన్న పదాలు పండ్రెండు కాబట్టి, శ్రీకృష్ణుడు ద్వాదశాత్ముడనవచ్చు.

"కన్యా వరయతే రూపం, మాతావిత్తం, పితాశ్రుతం। బాంధవాః కులమిచ్ఛంతి, మృష్టాన్న మితరే జనాః॥". ఒక్కొక్కరు పెండ్లి కొడుకులో ఒక్కొక్క గుణం ఉండాలని కోరుతుంటారు. పెండ్లికూతురు తనకు కాబోయే భర్త అవయవ సౌష్ఠవం కలిగిన వన్నెలాడు కావాలనికోరుకుంటుంది. వధువు తల్లి అల్లుడు ధనవంతుడు కావాలనీ, తండ్రి విద్య, కీర్తి కలవాడు కావాలనీ, చుట్టపక్కాలు మంచి పేరు గల వంశమందు పుట్టినవాడై యుండాలనీ, ఇక చూచే జనమంతా షడ్రసోపేతమైన భోజనం పెట్టే దానగుణం కలవాడై యుండాలని కోరుకోవడం సాధారణం.

ఇక మేలిమి గుణాలు అనేకం ఒక్క యువకుని యందు ఉన్నప్పుడు ఆ పురుషుణ్ని కోరని కన్యకలుంటారా? ద్వాదశాత్ముడై ప్రకాశించే కృష్ణమూర్తిని పెండ్లాడగోరని కన్యలుండరు కదా!

"సాధురక్షకుండు షడ్వర్గరహితుండు
నాథుడయ్యెనేని నడవనోపు
నితడెభర్త యనుచు నింతి సరోజాక్షు
బుష్ప దామకమున బూజ సేసె॥ (భాగ. 8.8.282)

ఇంతులలో ఒజ్జబంతియైన సముద్రరాజ తనయ, లక్ష్మీదేవి పూర్వకాలంలో మోహరుచులవల్ల ముద్దుగా హరిని వరించింది కదా! ఇప్పుడు వలపు తలపు రుక్మిణి యందే కొత్తగా జనించిందా? కాదు కదా! కాబట్టి, కృష్ణభగవానుని రూప గుణాలను రుక్మిణి విని, ఆయనను ప్రేమించి పెండ్లాడ గోరడం తప్పు కాదు. న్యాయమే అని సమర్థించడం వల్ల కావ్యలింగం, రూపకం, పరికరాలంకారం, దృష్టాంతాలంకారం ఏకత్ర శోభించే శార్దూల విక్రీడిత వృత్త పద్యం.

**శ్రీయుతమూర్తి! యో పురుషసింహమ!**
**సింహముపాలిసొమ్ము గో**
**మాయువు గోరుచందమున**
**మత్తుడు చైద్యుడు నీ పదాంబుజ**
**ధ్యాయిని నైన నన్ను వడి**
**దాగొని పోయెద నంచునున్న వా**
**డాయధమాధముండెఱుగ**
**డద్భుతమైన భవత్ప్రతాపముల్** 18

అర్థం : శ్రీయుత మూర్తి = లక్ష్మీదేవితో కూడుకొన్న ఆకారం కలిగిన; ఓ పురుషసింహమా= ఓ పురుష శ్రేష్ఠుడా! సింహము పాలిసొమ్ము = సింహం పొందదగిన సొమ్మును; గోమాయువు = నక్క; కోరుచందమునన్ = కోరుతున్న రీతిగా; మత్తుడు = మదించినవాడైన; చైద్యుడు = చేది దేశపురాజు - శిశుపాలుడు; నీ పద+అంబుజ ధ్యాయిని+ఐన = నీ పాదనీరేజాలను ధ్యానించే దాననైన; నన్ను; వడిన్ = వేగంతో; తాన్ = తాను; కొనిపోయెదన్ = తీసుకొని పోతాను; అంచున్ + ఉన్న వాడు = అంటూ ఉన్నాడు. ఆ +అధమ+అధముండు = నీచులలోనూ నీచుడైన ఆ శిశుపాలుడు; అద్భుతమైన = ఆశ్చర్యకరమైన; భవత్+ప్రతాపముల్ = నీయొక్క విక్రమాలను; ఎఱుగడు = తెలియజాలడు.

తా : వక్షఃస్థలాన లక్ష్మీదేవిని వహించిన ఓ పురుషోత్తమా! మృగరాజుకు చేరదగిన సొత్తును నక్క కోరునట్లు నీ చరణ రాజీవాలను ధ్యానించే నన్ను కొవ్వు పట్టిన చైద్యుడు వేగంగా వచ్చి తీసుకొని పోవాలనుకొంటున్నాడు. అద్భుతమైన నీ ప్రతాపాలను ఆ నీచాతినీచుడెరుగడు.

వ్యాఖ్య : వీరభోగ్యమైన సొత్తును అధముడంటరాదనే ఆర్తిని ప్రకటించే పద్యం. ఒక ఆడపడుచు, మగవాడైనంతమాత్రాన తనకు మగడు కావాలని కోరుకోదు. తన యోగ్యతయెట్టిదో మొదట తనను తాను తెలుసుకొనే కోరిక సంస్కార వతికి కలుగుతుంది. తనను చేబట్టే అర్హతగల మగవాణ్ణి మగనిగా వరిస్తుంది కదా!

రుక్మిణి పురుషుణ్ణి మాత్రమే కోరలేదు. పురుష సింహాన్ని వరించింది. సింహం అవక్రవిక్రమానికి ప్రసిద్ధి. సమాసపదంలో ఉత్తరపదమైన సింహ, శార్దూల, వృషభ, చంద్రాది శబ్దాలు శ్రేష్ఠవాచకాలు. శ్రీకృష్ణుడు పురుషోత్తముడు. ఆయన శ్రీయుత మూర్తి. సిరిని తన ఉరఃస్థలాన దాల్చిన వాడు కాబట్టి మంగళ ప్రదుడు. "తవస్పర్శాదీశం స్పృశతికమలే! మంగళ పదమ్" (శ్రీగుణర.కో) నిరుపాధిక మంగళ వాచ్యమైన శ్రీదేవీ స్పర్శవల్లనే 'హరి'కి మంగళ పద మబ్బింది. జయలక్ష్మీ సంపన్నుడు అని అర్థం. రుక్మిణి శ్రీకృష్ణభగవానునికి చెందిన దానని ఆయన పాదాంబుజాలను సర్వదా ధ్యానిస్తూ తనను సమర్పించుకొన్నది. కాబట్టి, ఆయన స్వయంగా వచ్చి తనను స్వీకరించాలని ప్రార్థిస్తున్నది. "మా వీర భాగమభిమర్శతు చైద్య ఆరాత్ గోమాయువన్మృగ పతేర్బలి మంబుజాక్ష" అన్నది వ్యాస భాగవతం.

మృగరాజు కర్పించిన నైవేద్యాన్ని సృగాలంలాగా, వీరుడవైన నీ పాలిటి సొత్తునైన నన్ను చైద్యుడు త్వరగా వచ్చి స్పృశించకూడదని బాధను వెల్లడించింది. శ్రీకృష్ణుడు సింహమని పొగడింది. చైద్యుడు నక్క అని తెగడింది. ఈ నక్క, సింహం అనుభవించే పదార్థాన్ని తానే తొందరగా వచ్చి అనుభవించాలని ఉవ్విళ్ళూరుతున్నది. కాని, సింహ పరాక్రమం నక్కకు తెలియదన్నది. రెండు అడవిలో ఉండేవే, అయినా ఎత్తైన గిరులలో ఉండేది సింహం. నేల బొరియలలో ఉండేది నక్క. కాబట్టి అధమాధముడైన చైద్యునికి పురుష సింహుని ప్రతాపాలు ఎట్టివో తెలుసుకొనే బుద్ధి కూడా లేదన్నది. విష్ణుమూర్తిలాగా చతుర్భుజుడై, భూతేశుని లాగా త్రినేత్రుడై జన్మించిన శిశుపాలుణ్ణి, అతని తల్లి మేనల్లుడైన కృష్ణమూర్తితో 'ముచ్చటగా ఎత్తుకో'మ్మని అందీయగా, కృష్ణుడెత్తుకొన్న వెంటనే శిశుపాలునికి ఎక్కువగా ఉన్న రెండు చేతులు, మూడవ

కన్ను మటుమాయమైన సంగతి - భవత్ ప్రతాపమూ - తెలియని మూర్ఖుడన్నది. అధముని కోరిక నెరవేరకుండా, కృష్ణుడే వచ్చి తన సొత్తును తానే కాపాడుకోవాలని సందేశమంపింది.

శ్రీకృష్ణుడు కాక, అన్యులు తనను గోరువారు నీచాతినీచులని రుక్మిణి భావిస్తున్నది. భగవంతునియందు లగ్నమై పరవశించిన హృదయం గల భక్తుడు అన్య దేవతల పొందును అంగీకరించడు. శ్రీకృష్ణుని పాదపద్మ ద్వయిని ధ్యానిస్తూ పరవశించిన రుక్మిణి హృదయం, పరపురుషుని వాంఛను తిరస్కరిస్తున్నదని ధ్వనితం ఉపమాలంకారం. ఉత్పలమాలా వృత్తం.

**వ్రతముల్ దేవ గురు ద్విజన్మబుధ సే**
**వల్ దాన ధర్మాదులున్**
**గతజన్మంబుల నీశ్వరున్ హరి జగ**
**త్కల్యాణు గాంక్షించి చే**
**సితినేనిన్ వసుదేవ నందనుడు నా**
**చిత్తేశుడౌ గాక ని**
**ర్జితులై పోదురుగాక సంగరములో**
**జేదీశ ముఖ్యాధముల్** 19

అర్థం : గత జన్మంబులన్ = కడచిన జన్మలయందు; వ్రతముల్ = నోములు; దేవ, గురు, ద్విజన్మ, బుధ, సేవల్ = దేవతల యొక్క గురువుల యొక్క, బ్రాహ్మణులయొక్క, పండితుల యొక్క సేవలు; దాన, ధర్మ+ ఆదులున్ = దానాలు, ఆచారాలు, మొదలైన వాటిని; ఈశ్వరున్ = నియామకుడైన; జగత్, కల్యాణున్ = లోకానికి మేలు చేసే వాడైన; హరిన్ = విష్ణుమూర్తిని; కాంక్షించి; చేసితిన్+ఏనిన్ = చేసినట్లైతే; వసుదేవ నందనుడు = వసుదేవుని పుత్రుడైన శ్రీకృష్ణుడు; నా చిత్త+ఈశుడు = నా మనోనాయకుడు; ఔగాక = అగుగాక. చేదీశముఖ్య+ అధముల్ = శిశుపాలుడు మొదలైన నీచులు; సంగరములో = యుద్ధమందు నిర్జితులై = ఓడగొట్టబడిన వారై; పోదురుగాక.

తా : వెనుకటి జన్మలలో వ్రతాలను, దేవతలకు, ఆచార్యులకు, బ్రాహ్మణులకు, జ్ఞానులకు సేవలను, దాన ధర్మాదులను సర్వేశ్వరుడైన, లోకులకు శుభంకరుడైన శ్రీ విష్ణుమూర్తియొక్క ప్రీతి కోసం చేసి యున్నట్లైతే శ్రీకృష్ణుడు నా ప్రాణనాథుడవు గాక. శిశుపాలాది నీచులు యుద్ధమందు జయింపబడిపోదురుగాక.

వ్యాఖ్య : పూర్వజన్మ సుకృత ఫలంగా శ్రీకృష్ణుడే తనకు భర్త అవుగాక, అని రుక్మిణి కోరింది.

భగవంతుని ప్రీతి కోసం, అతనికి సేవా రూపంగా కర్మలనాచరిస్తే, అవి భగవత్ప్రాప్తిని కలిగిస్తాయని శ్రుతులు, స్మృతులు బోధిస్తున్నాయి. వ్రతమంటే నియమంగా చేసే భగవదారాధన రూపమైన కర్మ. ఏకాదశీ వ్రతం, వసంత నవరాత్రవ్రతం, శరన్నవరాత్రవ్రతం, ధనుర్మాస వ్రతం మొదలైనవి. "దేవాసో బలిమావహంతి" శ్రుతిరీత్యా, యజ్ఞయాగాలలో దేవతలకు హవిస్సును (త్యాగరూప ద్రవ్యాన్ని) సమర్పించే కర్మగానీ, దేవాలయాలను నిర్మించి, దేవతా ప్రతిష్ఠచేసి నిత్యోత్సవ, బ్రహ్మోత్సవాలను యథావిధి జరిపించడంగానీ 'దేవసేవ' అనబడుతుంది. "మాతృదేవోభవ. పితృదేవో భవ, ఆచార్య దేవోభవ, అతిథి దేవోభవ" అని వేదవాణి - తల్లిని, తండ్రిని, గురువును, అతిథిని దేవతలుగా వ్యవహరించే వాడవు కమ్ము - అని అర్థం. కాబట్టి తల్లిదండ్రులకు, అత్తమామలకు, ఆచార్యులకు, అతిథి అభ్యాగతులకు, వృద్ధులకు చేసే ఉపచారం గురుసేవగా భావింపబడుతుంది.

'ద్విజన్మ' శబ్దానికి దంతాలు, పక్షులు, మూడువర్ణాలవారు అని అర్థం. ఇక్కడ చివరి అర్థానికే ప్రాధాన్యం. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు ఉపనయన సంస్కారం వల్ల 'ఆచార్యః విద్యాతస్తం జనయతి' అనే ఆపస్తంబ సూత్ర ప్రకారం, గురువు (తండ్రి) చేత గాయత్రీ మంత్రోపదిష్టులై, (బ్రహ్మోపదేశాన్ని పొందినవారై) జ్ఞాన జన్మను పొందిన వారు ద్విజన్ములు. ఈ బ్రహ్మ చర్యాద్యాశ్రమస్థులకు చేసే సేవ ద్విజన్మ సేవ.

'బుధులు' అంటే పండితులు, బోధకులని అర్థం. ఆయా శాస్త్రాలలో పారంగతులై, లోకులకు విధి నిషేధ రూపమైన సముచిత విద్యను సమాజ హితైషులై బోధించే వారికి చేసేసేవ 'బుధసేవ'. - 'దానం' అంటే యోగ్యులకు గో భూవస్త్రాన్నజలాది ద్రవ్యాలను త్యాగరూపంగా సమర్పించడం. 'ధర్మం' అంటే వర్ణాశ్రమాలకు ఉచితమైన ఆచారం, వాపీ కూపతటాక గృహారామాదులను నిర్మించడం, 'ఆది' శబ్దం చేత భూతహితం, సహనం, దయ కలిగి యుండడమన్నమాట.

"సమత్వ మారాధన మచ్యుతస్య" అన్నట్లు అన్ని ప్రాణులయందు సమభావం, సమదృష్టితో ప్రవర్తించడం భగవదారాధన రూపమైన కర్మయే కదా!

శ్రీకృష్ణుడు సర్వేశ్వరుడే. బ్రహ్మాది సర్వజీవులలో వ్యాపించి నియమించేవాడు. సర్వేశ్వరుని కల్యాణ గుణాలవల్ల, అవతారాల వల్ల, లీలలవల్ల లోకాలు, లోకులు, లోకేశులు బ్రతుకుతున్నారు. అట్టి జగత్కల్యాణుడైన భగవానుణ్ని పొందడానికి జీవులు ప్రయత్నం చేసినా, ఆయనను పొందలేరు. పూర్వజన్మలలో చేసిన పుణ్య కర్మలచేత భగవానుడు తృప్తి పడిన నాడు తానే జీవులను చేబట్టి తన సన్నిధికి చేర్చుకొంటాడు. అందుకే పుణ్యంకొద్దీ పురుషుడంటారు. ఏది పుణ్యం ఏది పాపం? "యత్ త్వత్ప్రియం తదిహ పుణ్యమపుణ్యమన్యత్" ఏకార్యం భగవంతునికి ప్రీతి కల్గిస్తుందో అది పుణ్యం, నిగ్రహం కలిగించేది పాపమన్నారు శ్రీవత్సాంక మిశ్రులు. కాబట్టి రుక్మిణీ దేవికి ఆత్మ ప్రత్యయం - తన పట్ల, తాను చేసిన సేవల పట్ల విశ్వాసం - పుష్కలంగా ఉంది.

వసుదేవనందనుడే వాసుదేవుడు - శ్రీకృష్ణుడు. ఆయనను పరమ పురుషునిగా భావించింది. ఆయనే తన చిత్తేశుడు - తన మనస్సునేలే వాడు - పతికావాలి. తన విశ్వాసానికి విరుద్ధంగా ప్రవర్తించే అధములు - శిశుపాలుడు, అతని బాసటగా నిల్చే నీచులు - యుద్ధంలో శ్రీకృష్ణుని చేత పరాజితులు కావాలని ప్రార్థించింది.

ఫలోత్ప్రేక్షాలంకారం. మత్తేభ విక్రీడితం.

**అంకిలి సెప్పలేదు, చతురంగ బలంబులతోడ నెల్లి యో**
**పంకజనాభ! నీవు శిశుపాల జరాసుతులన్ జయించి నా**
**వంకకు వచ్చి రాక్షస వివాహమునన్ భవదీయశౌర్యమే**
**యుంకువ సేసి కృష్ణ! పురుషోత్తమ! చేకొని పొమ్ము వచ్చెదన్.** 20

అర్థం : ఓ పంకజనాభ = తామరపూవు బొడ్డు నందు కలవాడా! పురుషోత్తమ = పురుష శ్రేష్ఠుడా! కృష్ణ! నీవు; చెప్పన్ = చెప్పడానికి; అంకిలి = అడ్డు; లేదు = ఏమీలేదు; ఎల్లి = రేపు; చతురంగ బలంబులతోడన్ = నాలుగు అంగాల సేనలతో; శిశుపాల, జరాసుతులన్ = శిశుపాలుణ్ని, జరాసంధుణ్ని; జయించి = గెలిచి; నా వంకకున్ = నా వైపు; వచ్చి; భవదీయ శౌర్యమే = నీదైన శూరత్వమే; ఉంకువ చేసి = శుల్కంగా చేసి; రాక్షస వివాహమునన్ = రాక్షసం అనే వివాహ విధితో; చేకొని = గ్రహించి; పొమ్ము = తీసుకొని పొమ్ము; వచ్చెదన్ = (నీవెంట) వస్తాను.

తా : పంకజనాభుడవూ, పురుష శ్రేష్ఠుడవూ అయిన ఓ కృష్ణా! నీవు అడ్డు చెప్పడానికి కారణమేమీ లేదు. రేపు చతురంగ సేనలతో కూడా శిశుపాల, జరాసంధులను

గెల్చి, నా యొద్దకు వచ్చి నీ శూరత్వాన్ని నాకు సుంకంగా ఇచ్చి, రాక్షస వివాహం చేత నన్ను పరిగ్రహించి, తీసికొని పోవాలి. నేను నీ వెంట వస్తాను.

వ్యాఖ్య : శ్రీకృష్ణుడు తనను చేకొనే విధానాన్ని రుక్మిణి విన్న వించే పద్యమిది.

శ్రీకృష్ణుడు పద్మనాభుడు. చతుర్ముఖ బ్రహ్మకు జన్మస్థానమైన తామరపూవు పొక్కిలి యందుకలవాడు. విశ్వాన్ని సృజించడానికి విష్ణుమూర్తి బొడ్డునందు వేయి రేకులుగా వికసించియున్న కమలమే కారణం. ఆ కమలం మొలిచిన విష్ణువు యొక్క నాభి ఎంతో గభీరమైనది. నాభి నుంచి ఆరంభమైన 'పరావాక్' ఆలోచన - సంకల్పం స్థిరమైనది. అమోఘమైనది. విశ్వాయమానమైన పరాగం, జ్ఞానగంధం కలిగిన పద్మం విష్ణుమూర్తి పొక్కిలిలోనే పుట్టింది. కాబట్టి కృష్ణుడు తలచుకొన్న కార్యం నిర్విఘ్నంగా నెరవేరుతుందనే అర్థం అనురణిస్తుంది.

కృష్ణుడు పురుషోత్తముడు. అయాచితంగా - అడుగబడకుండానే - అనేకార్థాలను ఇచ్చేవాడు పురుషుడు. పురుషులలో శ్రేష్ఠుడు కృష్ణుడు. కోరబడకయే అన్ని ఇచ్చే వానికి కోరిన కార్యాన్ని నెరవేర్చడంలో అంకిలి చెప్పే అవసరం లేదు. "ఉత్తమః పురుషస్త్వన్యః" (భ.గీత) ప్రకృతి కంటే పరులైన బ్రహ్మరుద్రాది జీవులకంటె పరుడైన వాడు పురుషోత్తముడు. ప్రకృతినీ, జీవులనూ నియమించే ప్రధాన పురుషేశ్వరుడు కృష్ణుడు. సర్వేశ్వరుడు 'కృష్ణ' శబ్ద వాచ్యుడు. "కృషిర్భూవాచకః శబ్దో, ణశ్చనిర్వృతి వాచకః" - 'కృష్' శబ్దం 'ఉత్పత్తి' అర్థం గల భూవాచకం. 'ణ' అంటె ఆనందం. విశ్వసృష్టి చేసి ఆనందించే వాడు కృష్ణుడు. రుక్మిణి ఈ పదాలను సంబోధించింది.

ఒక రాజకుమారిని చేకొనడానికి ఎదురొడ్డే వారెందరో ఉంటారు. చైద్యుని కీయాలని నిశ్చయింపబడిన కన్య విషయమై నేనేమి చేయాలని అనడానికి, నీవు అడ్డు చెప్పడానికి హేతువేమీ లేదు. అయితే నేను చెబుతున్నాను. ఆలకించవయ్యా స్వామి! నీవు రేపు రథాలు, ఏనుగులు, గుఱ్ఱాలు, కాలిబంట్లు అనే నాలుగంగాలసేనలతో సాటు శిశుపాలుడు, జరాసంధుడులనే చైద్య, మగధా ధీశులను జయించాలి అన్నది. క్షత్రియులు గాంధర్వంగా గానీ, రాక్షసంగాగానీ వివాహమాడడం శాస్త్ర సమ్మతం. "గాంధర్వ రాక్షసే క్షత్రే ధర్మ్యౌతౌ మా విశంకిథాః। పృథగ్వాయదివామిశ్రౌ కర్తవ్యౌ నాత్ర సంశయః॥ (భారతం ఆదిపర్వం 73/8) క్షత్రియులకు గాంధర్వ రాక్షసపద్ధతులు ధర్మ మార్గాలే. విడివిడిగానైనా, రెండింటిని కలిపి అయినా పాటింపవచ్చునని శ్లోకార్థం.

అయితే, రుక్మిణికి రాక్షస వివాహమే అవసరమయింది. కాబట్టి, కృష్ణుడు తన దగ్గరికి వచ్చి అతని శూరత్వాన్ని తనకు ఓలిగా చేయాలి, అంటే పణంగా పెట్టాలన్నది. ఎదిరించిన వారందరినీ కృష్ణుడు గెలిచి వీర్యశుల్కయైన తనను బలాత్కారంగా పరిగ్రహించాలన్నది. అలాగా కృష్ణుని వెంట తాను వస్తానని నొక్కి చెప్పింది రుక్మిణి.

"శ్వోభావిని త్వ మజితో ద్వహనే విదర్భాన్
గుప్తః సమేత్య పృతనా పతిభిః పరీతః"

"ఓ అజితా! నీవు సేనా పతులతో కూడి రహస్యంగా విదర్భకు వచ్చి రేపు జరుగబోయే వివాహంలో శిశుపాల జరాసంధుల సైన్యాన్ని ఓడించి వీర్యశుల్కనైన నన్ను బలాత్కారంగా రాక్షస విధానంతో వివాహ మాడు"మని వ్యాస భాగవతంలో ఉంది.

సేనాపతులతో కూడి రహస్యంగా రమ్మన్నట్లు పోతన పద్యంలో లేదు. "భవదీయ శౌర్యమే యుంకువసేసి" అన్న రుక్మిణి కృష్ణమూర్తిని సేనాపతులతో కూడి రహస్యంగా రమ్మనడం సముచితం కాదనుకొన్నాడు పోతనకవి.

"హరియొకడేగినాడు" అని బలరాముడు తర్వాత అనేకసేనతో విదర్భకు పోయాడన్న పద్యం ఈ భావాన్ని సమర్థిస్తున్నది కదా!

వేదాంత దర్శనంలో జీవులందరు స్త్రీలే. ఒక్క భగవానుడే పురుషోత్తముడు. భగవంతుణ్ని పొందాలనుకొనే వారికి ప్రతిబంధకంగా ఉండేవి అహంకారమమకారాలు -అంటే నేను, నాది అనే భావాలు. నీవు స్వతంత్రుడవు, నేను పరతంత్రుడను. నీవే ఈ మమతాహంకృతులను తొలగించి నన్ను చేకొనాలి అని ఏకాగ్రతతో ఉపాసిస్తే, భగవానుడు అడ్డు చెప్పకుండా అభిమతార్థాన్ని నెరవేరుస్తాడు.

సంబోధన పదాలుసాభిప్రాయాలు, కాబట్టి, పరికరాలంకారం. ఉత్పలమాలావృత్తం.

**లోపలి సౌధంబులోన వర్తింపంగ**
**దేవచ్చునే నిన్ను దెత్తునేని**
**గావలివారల గల బంధువులజంపి**
**కాని తేరాదని కమలనయన!**
**భావించితేని నుపాయంబు చెప్పెద**
**నాలింపు కులదేవయాత్రజేసి**
**నగరంబు వెలువడి నగజాతకును మ్రొక్క**
**బెండ్లికి మునుపడ బెండ్లి కూతు**

**నెలమి మావారు పంపుదు రేను నట్లు**
**పురము వెలువడి యేతెంచి భూతనాథు**
**సతికి మ్రొక్కంగ నీవు నా సమయమునకు**
**వచ్చి కొని పొమ్ము నన్ను నవార్య చరిత! 21**

అర్థం : కమలనయన = కమలాలవంటి కన్నులు గల ఓ కృష్ణా! లోపలి సౌధంబులోనన్ = అంతఃపురపు మేడలో; వర్తింపంగన్ = ఉండగా; నిన్నున్; తేవచ్చునే = (ఈవలికి) తీసుకొనిరావడం సాధ్యపడునా? తెత్తున్+ఏనిన్ = తీసుకొని వచ్చే పక్షంలో; కావలి వారలన్ = కావలియుండేవారిని; కలబంధువులన్ = అక్కడున్నచుట్టాలను, చంపికాని = చంపిన తర్వాతగాని; తేరాదు = తీసుకొని రావడానికి వీలు పడదు; అని; భావించితి+ఏనిన్ = నీవు తలచినచో; ఉపాయంబు = సాధించే విధానాన్ని; చెప్పెదన్ = చెబుతాను; ఆలింపు = విను.

కులదేవ యాత్రన్ + చేసి = ఇలువేల్పును పూజించడానికి పోయే ఆచారాన్ని బట్టి; నగరంబు = పట్టణంనుంచి; వెలువడి = వెలుపలికి వచ్చి; నగజాతకును = పార్వతీదేవికి; మ్రొక్కన్ = నమస్కరించడంకోసం; పెండ్లికి; మునుపడన్ = ముందుగా; పెండ్లి కూతును = పెండ్లి పడుచును; ఎలమిన్ = ప్రీతితో; మావారు; పంపుదురు = పంపుతుంటారు; ఏనున్ = నేను కూడా; అట్లు = ఆ రీతిగానే; పురము వెలువడి = పట్టణం నుంచి బయల్దేరి; ఏతెంచి = వచ్చి; భూతనాథు సతికి = గౌరీదేవికి; మ్రొక్కంగా = నమస్కరింపగా; అవార్య చరిత = అడ్డులేని నడవడి కలవాడవైన కృష్ణా! నీవును - ఆ సమయమునకు; వచ్చి; నన్నున్ = నన్ను; కొనిపొమ్ము = చేకొని పోవయ్యా!

తా : పుండరీకాక్షా! అంతఃపురపు మేడలో సంచరించే నిన్ను హరించడం సుకరమా? ఒక వేళ దానికి సిద్ధపడినా, ద్వారపాలకులనూ, అక్కడున్న చుట్టాలనూ మట్టు పెడితే తప్ప అది సాధ్యపడదని నీ వనుకొంటే ఒక ఉపాయం చెబుతాను. చిత్తగించవయ్యా! కృష్ణా! పెండ్లికి ఒక దినం ముందు కులదేవతాయాత్ర చేయడంలోకాచారం. ఆ విధంగా మా వారు పెండ్లి కూతురునైన నన్ను పంపుతారు. నేను నగరం నుంచి వెలుపలికి వచ్చి పార్వతీ దేవిని పూజించి మ్రొక్కిన వేళకు వారింపరాని చరితం గల నీవు వచ్చి నన్ను చేకొనిపోవయ్యా!

వ్యాఖ్య : రుక్మిణి తనను చేకొనే ఉపాయాన్ని శ్రీకృష్ణునికి విన్నవించే పద్యం.

శ్రీకృష్ణుడు కమలనయనుడు. తామర పూరేకులను పోలియున్న కన్నులున్నవాడు. విశాలమైన చూపు, స్వచ్ఛమైన దూరదృష్టికలవాడు. కాబట్టి, రాజకన్యయైన రుక్మిణి రాజభవనంలోపల ఉండే అంతఃపురసౌధంలో నడయాడుతుంటుందనుకొంటాడు. చంద్రకాంతుల నీనుతున్నట్లు తళతళమెరిసే మేడలోకి చిన్న చీమదూరి పారుతున్నా

కనబడక మానదు. పెండ్లి కోసం వెల్లవేసి మరింత మెరుగులు దిద్దిన మిద్దెలోకి నల్లని కన్నయ్య మెల్లగా చేరుతున్నప్పుడు కన్నుల్లో వత్తులు వేసుకొని నిరంతరం కాపలాకాసే వారి కంట బడకుంటాడా? కంటగించుకొని కైలాటలాడే కాపరులను గుమ్మనకుండా గుమ్మంలోనే కైలాసానికి పంపవలసి ఉంటుంది. గుమ్మం దాటి నెమ్మదిగా లోపలికి పోతే అక్కడ అచ్చర లేమలను పోలిన కన్నియ నెచ్చెలుల చూపుల చురుకులకు గురికాక తప్పదు. బాహాటంగా వధూజన బంధువులు కసరుకొంటూ ముసురుకుంటే వారందరి ఉసురు దీయకుండా, అంతఃపుర నిశాంతం నుంచి పెండ్లి పడుచును అమాంతంగా చేపట్టి బయటకు తెచ్చుకోవడం సంభవమా? మంగళ దేవతయైన కమలయందే దృష్టి కలవాడు' కాబట్టి కృష్ణుడు డెందంలో ఆనందంకందళించే వివాహశుభకార్య సందర్భంలో, సౌభాగ్య సంపదతో వర్ధిల్లే విదర్భ రాజకన్య కంటకన్నీరొలకకుండా, ఆ ముద్దియ నొద్దికగా పరిగ్రహించడం సాధ్యపడదా? అని కూడా ఆలోచిస్తుంటాడు అని రుక్మిణి భావించింది.

సాధింపదగిన కార్యమూ, సమయమూ ప్రసన్నంగా ఉండే విధానాన్ని తానే శ్రీకృష్ణునికి సూచించింది.

సాధారణంగా కన్నియలు తమ మనస్సులో కన్న మగవానికి, కన్న వారినీ, తన చుట్టూ ఉన్న వారినీ కాదని - 'మర్మం' చూ పెట్టడంలో ఎంత గడు సరులోకదా! వివాహానికి ముందు రోజున పెండ్లి కూతురును చేసి గౌరీ దేవిని పూజించడం ఆచారం. ఇలువేల్పును పూజించడం నేడు కూడా లోకంలో వాడుక ఉంది. పల్లెటూళ్ళల్లోనూ జనులు పోచమ్మ గుడికి పోయి పూజలు నైవేద్యాలు సమర్పిస్తారు. సౌభాగ్యం కలుగాలని నవవధువు సర్వమంగళ దేవతను ఆరాధించడం వైదికాచారం. వివాహానికి ఇది పూర్వరంగం. రుక్మిణి పుట్టినింటి ఆచారాన్ని బట్టి ఆ యింటి పెద్దలు పెండ్లి కూతురును అలంకరించి, బంధుమిత్రాదులతో మంగళవాద్యాలతో నగర బాహ్య ప్రదేశంలో ఉన్న వారి కులదేవతా మందిరానికి పంపుతారు. అక్కడ తాను కాత్యాయనీ దేవతకు షోడశోపచారపూజ చేసి, మ్రొక్కే వేళకు కృష్ణుడు అక్కడికిరావాలని సమయాన్ని, స్థలాన్ని సూచించింది. కృష్ణుని రాకడను వారించడానికి ఎవ్వరికీ సాధ్యం కాదు కాబట్టి, ఆయన వచ్చి తనను చేకొని పోవడం సుశక్యమే, అని రుక్మిణి కృష్ణమూర్తికి ఉపాయం చెప్పింది.

భగవంతునికి శేషమైయున్న ఆత్మ అనర్థంచెందకుండా, ఆత్మ స్వరూపానికి తగిన భగవత్కైంకర్యం చేయడానికి భగవంతుణ్నే భర్తగా పొందగోరిన రుక్మిణి తదితర దేవతను ఆశ్రయించడమెందుకు? అంటే "వైష్ణవానాంయథాశంభుః" విష్ణుభక్తులలో ముఖ్యుడు భూతనాథుడు అని వ్యాసభగవానుని సూక్తి. అచ్యుతుణ్ని నేరుగా ప్రార్థిస్తే సిద్ధిస్తుందో లేదో సంశయమే. ప్రేమ ఉత్కటమై తనను భగవానునికి పత్నిగా చేయుమని తద్భక్తులను సేవించి ప్రార్థిస్తే సిద్ధించడం నిస్సంశయం. గోపికలు శ్రీకృష్ణభగవానుని సంశ్లేషాన్ని కోరి కాత్యాయనీ వ్రతమాచరించడమే ఇందుకు పరమ ప్రమాణం. శ్రీకృష్ణుణ్ని భర్తగా పొందే ఉపాయమే రుక్మిణి భూతనాథు సతికి మ్రొక్కే ప్రక్రియలో ఉంది కదా!

ఉపాయమూ ఉపేయమూ, రెండూ తానే అయిన శ్రీకృష్ణునికి ఉపాయం చెప్పే తేట గీతితోడి సీస పద్యమిది.

**ఘనులాత్మీయతమో నివృత్తి కొఱకై**
**గౌరీశుమర్యాద నె**
**వ్వని పాదాంబుజ తోయమందుమునుగన్**
**వాంఛింతురేనట్టి నీ**
**యనుకంపన్ విలసింపనేని వ్రత చ**
**ర్యన్ నూఱు జన్మంబులన్**
**నిను జింతించుచు బ్రాణముల్ విడిచెదన్**
**నిక్కంబు ప్రాణేశ్వరా.** **22**

అర్థం : ప్రాణేశ్వరా = ఓ ప్రాణనాయకా! ఘనులు = గొప్పవారు; ఆత్మీయ, తమస్+నివృత్తి కొఱకై = తమ అజ్ఞానాన్ని తొలగించుకోవడం కోసం; గౌరీ +ఈశు, మర్యాదన్ = పార్వతీపతియైన శివుని లాగా, ఎవ్వరి పాద + అంబుజ తోయమందు = ఎవ్వని పాదకమల తీర్థమందు; మునుగన్ = స్నానం చేయడానికి; వాంఛింతురు = కోరుదురో; అట్టినీ + అనుకంపన్ = అలాంటి వాడవైన నీ యొక్క దయచేత; ఏన్ = నేను; విలసింపన్ + ఏని = ప్రకాశించక పోతే; వ్రతచర్యన్ = బ్రహ్మచర్యనియమాన్ని నడపడంతో; నూఱు జన్మంబులన్ = వందజన్మలయందు; నినున్ = నిన్ను; చింతించుచు = స్మరిస్తూ; ప్రాణముల్ = అసువులను; విడిచెదన్ = పాసెదను; నిక్కము = సత్యం.

తా : ఓ ప్రాణేశ్వరా! కృష్ణా! పెద్దలు తమ అజ్ఞానాన్ని తొలగించుకోవడానికి శివుని వలె ఎవని పాదోదక మందు స్నానం చేయగోరుతారో అలాంటి నీ కృపకు నేను

పాత్రురాలను కాకపోయినట్లైతే, నూరు జన్మలనెత్తియైనా బ్రహ్మచర్యవ్రత దీక్షతో నిన్ను ధ్యానిస్తూ, ప్రాణాలను విడుస్తాను. ఇది సత్యం.

వ్యాఖ్య : రుక్మిణి, నూరు జన్మలెత్తినా కృష్ణుని భార్యగానే ఉంటాననే అధ్యవసాయ ప్రకటన.

జీవునికీ, దేవునికీ భార్యాభర్తృత్వ సంబంధం ఘనిష్ఠమైనది. రుక్మిణీ కృష్ణుల దాంపత్యయోగం నిత్యమైనది కాబట్టి 'ప్రాణేశ్వరా!' అన్న పదం అన్వర్థమేకదా! మహాపురుషులు జనన మరణ రూపసంసార సాగరంలో ముంచడానికి కారణమైన తమ అజ్ఞానాన్ని నివారించుకోవడానికి శ్రీవిష్ణుపాదోదకంలో స్నానం చేసి పవిత్రులుగా ఉండాలని కోరుతారు. 'తమః' శబ్దానికి చీకటి, శోకం, అజ్ఞానం, తమోగుణమనీ నానార్థాలున్నాయి. తమస్సు పారమార్థిక జ్ఞానాన్ని కలుగనీయదు. భగవత్పాదతీర్థమే తమస్సును తొలగించి పవిత్రులను చేస్తుంది. భగవత్పాదజలమే గంగ. బ్రహ్మదేవుడు త్రివిక్రమావతార కాలాన తనలోకానికి చేరిన తన తండ్రి - విష్ణుమూర్తి - వామ పాదాన్ని, ప్రక్షాళన చేయాలని తలచిన వెంటనే ఆ పాదం నుంచి ఉద్భవించిన ధర్మజలంతో, కడిగి ఆ పాద తీర్థాన్ని లోనికి పుచ్చుకొన్నాడు. తలమీద చల్లుకొని వికాసాన్ని పొంది ధన్యుడయ్యాడు.

విష్ణు పాదోద్భవియైన గంగను భగీరథుని ప్రార్థన వల్ల శివుడు తలదాల్చి తన గురుపాతకం నుంచి నివృత్తిని పొంది "శివః శివోఽభూత్" - పవిత్రుడయ్యాడు. మూడులోకాలు పవిత్రమైనాయి. దేవతలు, పితృదేవతలు, అగ్నులు ఆ పాదోదకాన్ని లోనికి తీసుకొని, తలదాల్చి తృప్తి పడినట్లు పురాణాలు ప్రవచిస్తున్నాయి. "అభ్యాగతః స్వయం విష్ణుః" అన్నట్లు గృహస్థులు తమ ఇంటికి వచ్చిన సాధుజనుల పాదాలను కడిగి, పూజించి, ఆ తీర్థాన్ని పుచ్చుకొని, చల్లుకొని తమను, తమ యిండ్లను పవిత్రం చేసుకోవడం నేటికీ లోక పరిపాటి.

"చరణం పవిత్రం వితతం పురాణం
యేన పూతస్తరతి దుష్కృతాని"

పవిత్రమైన విష్ణుపాదం, ఆ తీర్థం మహాపాతకాలను పంచబంగాళం చేస్తుందని వేదవాణి.

'పవి' అంటే వజ్రాయుధం. సంసార మనే కడలిలోని కష్టాలనే కెరటాలతాకిడి వజ్రాయుధపు దెబ్బలాగా ఉంటుంది. అట్టి 'పవి' నుంచి 'త్ర' అంటే రక్షించడమే 'పవిత్ర' శబ్దార్థం.

"స్వమహిమ్ని ప్రతిష్ఠితః" - "ఏతా వానస్యమహిమా" (శ్రుతి) శ్రీకృష్ణభగవానుని మహిమలాంటి మహిమ చరాచర విశ్వంలో మరొకరికి లేనే లేదు. అట్టి మహిమ గల శ్రీకృష్ణుని దయచేత రుక్మిణి, శోభితురాలు కావాలని ప్రార్థిస్తున్నది. తాను ఆయనను ప్రేమిస్తున్నది. కాని ఆయన తనను ప్రేమిస్తున్న జాడ, పొడకూడా ఆమెకు తెలియదు కదా!

కృష్ణుని కృపకు తాను పాత్రురాలుకాకుంటే - కృష్ణుడు దయచేసి తనను చేకొనక పోతే, వ్రతదీక్షతో ప్రవర్తిస్తానంటుంది. అన్న పానాదులను అనుభవించక, ఉపవాసాలతో తన దేహాన్ని కృశింపజేస్తూ, కృష్ణమూర్తినే సర్వదా ధ్యానిస్తూ నూరుజన్మలనైనా ఎత్తుతానన్నది. వందసార్లు పుట్టి, "తమంత రేణ నైవాన్యం మనసా ఽపి పతింవృణే" అన్నట్లు కృష్ణమూర్తినే తప్ప తన మనస్సులోనైనా వేరొకరిని భర్తగా వరించనన్నది. నూరుసార్లు అదే నియమంతో చచ్చి "నీ ధర్మ పత్నినే అవుతాను" అనే పూనిక వహించింది. 'నిక్కము' అన్న పదం ప్రతిజ్ఞను తెల్పుతుంది. తమ ప్రేమనే ముఖ్యంగా భావించి తాము కోరిన వాడు భర్తగా లభించకుంటే పూబోడులు ఎంతటి సాహసానికైనా పూనుకొంటారు కదా!

తన అనుగ్రహాన్ని సంపాదించడానికి అలాగే చేస్తుందనే నిజాన్ని కృష్ణుడు గ్రహించి, ఉపేక్షించక రుక్మిణిని పరిగ్రహించడానికి దయచేస్తాడనే భావన ప్రస్ఫుటితం.

ఉపమాలంకారం. మత్తేభవిక్రీడితవృత్తం.

**ప్రాణేశ! నీ మంజు భాషలు వినలేని**
**కర్ణరంధ్రంబుల కలిమియేల?**
**పురుషరత్నమ! నీవు భోగింపగాలేని**
**తనులత వలని సౌందర్యమేల?**
**భువనమోహన! నిన్ను బొడగానగాలేని**
**చక్షురింద్రియముల సత్త్వమేల?**
**దయిత! నీ యధరామృతంబానగా లేని**
**జిహ్వకు ఫలరస సిద్ధియేల?**
**నీరజాతనయన! నీవనమాలికా**
**గంధ మబ్బలేని ఘ్రాణమేల?**
**ధన్య చరిత! నీకు దాస్యంబుసేయని**
**జన్మమేల యెన్ని జన్మములకు?** 23

అర్థం : ప్రాణ+ఈశ = ప్రాణానికి ఆధారమైన వాడా! కృష్ణా! నీ మంజు భాషలు = నీ ఇంపైన మాటలను; వినలేని = వినజాలని; కర్ణరంధ్రంబుల = చెవుల చిల్లుల యొక్క; కలిమి = ఉనికి -భాగ్యం; ఏల = ఎందుకు? పురుషరత్నమ = పురుషులలో మణివంటి వాడా! పురుష శ్రేష్ఠుడవైన కృష్ణా! నీవు; భోగింపగాలేని = భోగమనుభవించడానికి అనువు పడని; తనులత వలని = తీగలాంటి దేహంవలన కలిగిన; సౌందర్యము = అందం; ఏల = ఎందుకు? భువన మోహన = లోకాలను మోహింపజేయువాడా! నిన్నున్ = నిన్ను; పొడగానగా లేని = చూడనేరని; చక్షుః + ఇంద్రియముల = కన్నుల (చూపు) యొక్క; సత్త్వము = ఉండడం; పటుత్వం; ఏల? దయిత = ప్రియుడా! నీ + అధర+అమృతంబు = నీ క్రింది పెదవి యందలి తియ్యని పానకాన్ని; ఆనగా లేని = రుచి చూడజాలని; జిహ్వాకు = నాల్కకు; ఫలరససిద్ధి = (ద్రాక్ష మొదలైన) పండ్లరసాలను త్రాగే అనుభవం; ఏల? నీరజాతనయన = ఓ పద్మనయనా! నీ వనమాలికా గంధము = నీవు ధరించిన పూలహారం యొక్క సువాసన; అబ్బలేని = పొందజాలని; ఘ్రాణము = నాసిక, ముక్కు; ఏల? ధన్యచరిత = పుణ్య చరిత్రగల కృష్ణా! నీకు; దాస్యంబు = సేవ; చేయని; జన్మము = పుట్టుక; ఎన్ని జన్మములకు = ఎన్ని పుట్టుకలు పుట్టినప్పటికీ; ఏల = ఏమి ప్రయోజనం?

తా : ప్రాణేశా! కృష్ణా! మనోజ్ఞమైన నీ మాటలు వినలేని చెవులూ, నీవు అనుభవించడానికి అక్కరకు రాని అవయవాల అందమూ, నిన్ను చూడనోచని కన్నులూ, నీ మోవి తేనెను గ్రోలని నాలుక, నీవనమాలికా వాసనను చూడలేని నాసిక, నీకు సేవజేయలేని జన్మలు నిష్ప్రయోజనాలు.

వ్యాఖ్య : సర్వేంద్రియ సంతర్పియైన శ్రీకృష్ణమూర్తికి సేవ జేయజాలని జన్మలు నిరర్థకాలని ఆవేదన. త్వక్ చక్షుః శ్రోత్ర జిహ్వాఘ్రాణేంద్రియాలు - జ్ఞానేంద్రియాలు - సర్వేశ్వరునికి నివేదింపబడాలి, అని రుక్మిణి విషాదంగా తన గాఢానురాగాన్ని దీపింపజేస్తున్నది.

ఇంద్రియాలలో కర్ణేంద్రియం ఉపదేశార్హమై పావనమయింది. భగవానుని ముఖారవిందం నుంచి మకరందం స్రవించే లాగా మధురంగా ఉండే మాటలు మంజులమైనవి. చెవులకు చిల్లులు ఉన్నా వినే భాగ్యం బధిరులకు లేదు. మాటలు శబ్ద గ్రహణశక్తిగల చెవి గూబల ద్వారా హృదయంలో చేరి ఆనందాన్ని అంకురింపజేస్తాయి. అలక్షితమైన అంతరంగంలో అంకురించిన ఆనందం బాహ్యాంగాలను పులకింపజేసి చక్షుర్గమ్యమవుతుంది. ఆనందదాయకాలైన ప్రాణేశు మంజుభాషలను ముచ్చటగా వినే భాగ్యం లేని చెవులకు చిల్లులున్నా అవి పెంకుగుల్ల

ల్లాగా వ్యర్థమే. పల్లవిస్తూ మెల్లగా కొనలు సాగుతున్న సన్నని లతల అందం వాటికి ఆశ్రయంగా నిల్చిన హరిచందనంలాంటి తరువులకు అల్లిబిల్లిగా అల్లుకొన్నప్పుడు కనువిందుగా ఉంటుంది.

స్త్రీ శరీర సౌందర్యానికి ప్రకృతిలోని సుకుమారమైన తీగను ఉపమించడం వల్ల భోగ్యత దృశ్యమానంగా పరిఢ విల్లుతుంది. రత్నమైనా రాయైనా ఖనిలోనే జనిస్తుంది. కాఠిన్యమున్నా రత్నం కాంతులీనడం వల్ల అమూల్యమయింది. అనర్ఘరత్నం భోగభాగ్యానికి కారణమయింది కదా!

పురుషరత్నానికి భోగాస్పదం కాలేని దేహ సౌందర్యం కందకం లాగా నిరర్థకమే. భువనాలకు మోహజనకుడైన వ్యక్తిని చూడ నోచని కన్నుల కలిమి గాజు గిన్నెల కొలిమి లాగా నిష్ప్రయోజనమే. ప్రియుని తేనె పెరలాంటి వాతెర రుచి నెరుగని నాలుక కరాళిక లాగా కొరగానిదే. వనమాలిక - అయిదు వన్నెల పూవులతో అల్లబడి గళం నుంచి చరణయుగళం దాకా వ్రేలాడే పూలదండ. దీనికే "వైజయంతి" అని మరొక పేరు "ఆపాద పద్మం యామాలావనమాలేతి సామతా." వనజాక్షుని వనమాలికా వాసనను చూడజాలని ఘ్రాణమున్నా అది శింఘాణమే. ధన్య చరితునికి దాస్యం చేయలేని మనిషి పుట్టుక పాపపుట్టల పట్టికయే కదా!

ఇంద్రియాలకు విషయాలకు నిత్య సంబంధమున్నా ఆ సంబంధంలేకపోతే ఇంద్రియాల ఉనికి వ్యర్థ మనడంవల్ల సంబంధాసంబంధరూపకాతిశయోక్త్యలంకారం. పోతన గారి కల్పితమైన ఈ పద్యం ప్రేమనే కాక భక్తిని కూడా ప్రకటిస్తున్నందువల్ల వాక్యార్థహేతుక కావ్యలింగాలంకారం.

సందేశంలో ఈ పద్యం వల్ల రుక్మిణి అభిలాష విప్రలంభంగా పరిపుష్టిని పొందింది. సుకుమార పదప్రయోగం వల్ల అనుభావ సామగ్రి సంయోజితం. దానిచేత ఔత్సుక్య రూపమైన వ్యభిచారిభావం ధ్వనిస్తున్నది. తత్ఫలితంగా అయోగ విప్రలంభం ఉద్దీప్తమవుతున్నది. ఆట వెలదితో కూడి శృంగార రస వ్యంజకమైన దీ సీస పద్యం.

**వ : అని యిట్లు రుక్మిణీ దేవి పుత్తెంచిన సందేశంబును, రూప సౌందర్యాది విశేషంబులును, బ్రాహ్మణుండు హరికి విన్నవించి, కర్తవ్యం బెద్దిసేయ నవధరింపు మని సవరణగా నిట్లనియె.**

అర్థం : అని, ఇట్లు = ఈ విధంగా; రుక్మిణీదేవి; పుత్తెంచిన = చెప్పి పంపిన; సందేశంబును = వృత్తాంతాన్ని; రూప సౌందర్య + ఆది విశేషంబులును = దేహలావణ్యం మొదలైన సంగతులను;

బ్రాహ్మణుడు; హరికి = శ్రీకృష్ణునికి; విన్నవించి = చెప్పి; కర్తవ్యంబు = చేయతగిన పని; ఎద్ది = ఏది; సేయన్ = చేయడానికి; అవధరింపుము = చిత్తగించుము అని; సవరణగా = వరింపదగినదిగా; ఇట్లు; అనియె.

తా : రుక్మిణీ పంపిన బ్రాహ్మణుడు ఆమె చెప్పి పంపిన వృత్తాంతాన్నీ, ఆమె చక్కదనం మొదలైన సంగతులనూ శ్రీకృష్ణునికి చెప్పి, ఇక ఏమి చేయవలసినదో, ఆ పని చేయ ప్రయత్నించుమని, ఇంక రుక్మిణి వరింప దగినదని చెప్ప నారంభించాడు.

**పల్లవ వైభవాస్పదములు పదములు**
**కనకరంభా తిరస్కారు లూరు**
**లరుణప్రభా మనోహరములు కరములు**
**కంబు సౌందర్య మంగళము గళము**
**మహిత భావాభావమధ్యంబు మధ్యంబు**
**చక్షురుత్సవదాయి చన్నుదోయి**
**పరిహసితార్ధేందు పటలంబు నిటలంబు**
**జితమత్త మధుకరశ్రేణి వేణి**
**భావజా శుగముల ప్రాపులు చూపులు**
**కుసుమశరుని వింటి కొమలు బొమలు**
**చిత్తతోషణములు చెలువ భాషణములు**
**జలజనయన ముఖము చంద్రసఖము** **24**

అర్థం : పదములు = (రుక్మిణీదేవి యొక్క) పాదాలు, అడుగులు; పల్లవవైభవ+ ఆ స్పదములు = చిగుళ్ళ సంపదకు తావులు; ఊరులు = తొడలు; కనక రంభా తిరస్కారులు = బంగారు అరటులను ధిక్కరించేవి; కరములు = చేతులు; అరుణ ప్రభామనోహరములు = ఇంచుక ఎఱ్ఱని కాంతులచే మనస్సును దోచేవి; అందమైనవి; గళము = మెడ; కంబు సౌందర్య మంగళము = శంఖం యొక్క అందంవంటి అందంచేత శుభకరమైనది; మధ్యము = నడుము; మహిత భావ + అభావ మధ్యంబు = మహిమను పొందిన, ఉన్నది లేదు (అనే రెంటికి) నడిమిది; చన్నుదోయి = కుచద్వయం; చక్షుః+ఉత్సవ దాయి = కన్నులకు సంతోషం ఇచ్చేది. నిటలంబు = నొసలు; పరిహసిత +అర్ధ+ఇందు, పటలంబు = ఎగతాళిచేయబడిన, అర్ధ చంద్ర బింబం వంటిది; వేణి = జడ; జిత, మత్త, మధుకర, శ్రేణి = జయింపబడిన, మదించిన, తుమ్మెదల పంక్తి వంటిది; చూపులు = దృష్టులు; భావజు + ఆశుగముల ప్రాపులు = మన్మథుని

బాణాలకు ఆశ్రయాలు; బొమలు = కనుబొమలు; కుసుమశరుని వింటి కొమలు = పుష్పబాణుడైన మన్మథుని ధనుస్సు యొక్క అంచులు; చెలువ భాషణములు = ఇంతి (రుక్మిణి) మాటలు; చిత్త తోషణములు = మనస్సును ఆనందపరచేవి; జలజ నయన ముఖము = కలువ వంటి కన్నులు కలిగిన రుక్మిణి ముఖం; చంద్రసఖము = చంద్రునితో చెలిమి చేసేది.

తా : కృష్ణా! రుక్మిణీదేవి పాదాలు చిగుళ్ళ సంపదకు ఉనికిపట్టు. తొడలు బంగారు అరటిబోదెలను తిరస్కరించేవి. చేతులు అరుణవర్ణశోభితాలు. కంఠం శంఖమే. నడుము ఉన్నదో లేదో అన్నంత సన్ననిది. చనుగవ చూడ ముచ్చటగా ఉంటుంది. నొసలు అర్ధ చంద్రాకృతిగా ఉంటుంది. జడ నల్లని గండుతుమ్మెదల బారునుమించి మించుతుంది. చూపులు మన్మథుని తూపులు. కనుబొమలు కందర్పుని చాపాగ్రాలు. మాటలు ఆహ్లాదకరాలు. కలువకంటి మొగం పూర్ణచంద్ర బింబమే.

వ్యాఖ్య : రుక్మిణీదేవి రూపచిత్రణం. సందేశహారి గొప్ప కళాపూర్ణుడు. కార్యసాధకుడు. సందేశం అందించడంలోనే చాతుర్యం చూపించాడు. అంతకుమించి మూలాతిరిక్తంగా, రుక్మిణీ సౌందర్య వర్ణన అనన్య ప్రతిభతో పరమగంభీరంగా వ్యక్తం చేశాడు. ఇది రమణీయ భావనామయమైనది. రూపచిత్రణంలో చిత్రకారునికి రంగులు, కుంచెలు, పటం మొదలైన వస్తు సామగ్రి అవసరం. కాని, కవి మాత్రం ఏ వస్తువును కూడా ఉపయోగించుకోడు కదా! తన హృదయంలో భావించిన మూర్తిని కేవలం కమనీయ శబ్దాలను ప్రయోగించి శ్రోతల హృదయాలలో సాక్షాత్కరింపజేస్తాడు. దేహ సౌందర్యాన్ని ప్రకృతికి అధీనమైన సర్వసౌందర్యంతో సదృశంగా మనోజ్ఞమైన వర్ణన చేయడం భావనా పారమ్యానికి నిదర్శనం కదా! ఈ రూపవర్ణనలో ప్రయుక్తమైన పదాలు ఎంత సుకుమారమైనవో మొదటి మాటలోనే ధ్వనింపజేయడం గమనీయం.

రుక్మిణీ దేవి పదాలు - అడుగులు, పల్లవాల (పత్+లవ) వైభవానికి ఆస్పదాలు. తలిరులకున్న (ఎరుపు) వర్ణసంపద, మార్దవ సంపద ఆ దేవి అడుగుల నుంచి లేశ మాత్రంగా గ్రహింపబడినదే. పాదాలు చిగుళ్ళకంటె మెత్తనివని భావం. తొడలు బంగారు అరటిబోదెలనడంవల్ల వన్నెలోనూ, వట్రువలోనూ నున్న దనంలోనూ, బలంలోనూ వాటిని మించినవని అర్థం.

అరుణ ప్రభ అంటె సూర్యోదయానికి ముందు లేత ఎరుపు, తెలుపు గలకాంతి. ఇది చైతన్యాన్ని కలిగిస్తుంది. కాబట్టి చేతులు అరుణ ప్రభలాగా మనోహరంగా ఉన్నాయన్నమాట. శంఖనిస్వనం మృదువుగా ఉంటుంది. శంఖం తెల్లగా వట్రువదీరి

అందంగానూ ఉంటుంది. అది శుద్ధసత్త్వానికి సంకేతం. "ముక్తయే పాంచజన్యంచ" శంఖం మోక్షమిస్తుంది. 'చక్ర శంఖాలు' అనక 'శంఖచక్రాలు' అని మొదట శంఖాన్ని చెప్పడానికి శ్రేయః ప్రదమే కారణం, అందుకే శంకర భగవత్పాదులు మొదట శంఖాన్నే స్తుతించారు. రుక్మిణి గళం కంబుసౌందర్యమంగళం. పూర్వోత్తరకాయాలకు నడిమిది కాబట్టి మధ్యము. నడుము అని పేరు. నడుము ఉన్నదా - లేదా అని సందేహించేరీతిగా, సన్నగా ఉండడం సౌభాగ్యహేతువు. కాబట్టి 'మహిత' శబ్దం ప్రయుక్తం. ఇంతికి ఉరోజాలు, శిరోజాలు అందచందాలను చిందుతాయి. మగవాని కనుగవ మొదట మగువ చనుగవమీదనే ఆనుతుంది. ఉల్లం పల్లవిస్తుంది.

'పటలం' సమూహార్థక పదం. చంద్రకళలు శుక్ల పక్షంలో పెరుగుతుంటాయి. కృష్ణపక్షంలో తరుగుతుంటాయి. కాబట్టి కృష్ణ పక్షంలోని పదిహేను తిథులలో (ఇటు ఏడు, అటు ఏడు) మధ్య తిథియైన అష్టమి నాటి రాత్రి ఇందు పటలం అర్ధ బింబంగా ఉంటుంది. రుక్మిణీదేవి నుదురు కృష్ణాష్టమి నాటి అర్ధేందుబింబంగానే ఉన్నది. కాబట్టి ఆమె నుదురు, కుదుర్కొని యుండక ఎప్పుడూ చెదురుతుండే అర్ధేందు పటలాన్ని పరిహసిస్తూ ఉంటుందట.

నల్లని తుమ్మెదలు పూదేనెను త్రాగి కొవ్వు పట్టి జుమ్మని మ్రోగుతూ గుంపుగా తిరుగుతుంటాయి. గండు మెండైన కొన్ని తుమ్మెదలు కలిసి ఒక దారిలో పయనించగానే అదే దారిలో తక్కిన గండుతుమ్మెదలు బారుదీఱి పయనిస్తుంటాయి. అతి వినీలమైన శిరోజాలను పాయలు దీసి అల్లిన రుక్మిణీదేవి జడ గండుతుమ్మెదల బారు (పంక్తి) లాగా నల్లని వన్నెతో బారెడు పొడువుగా శోభిస్తున్నది. దానిచే ఆమె వేణి మత్తమధుకరశ్రేణిని ఓడించింది. మధుకరాలమత్తు తీరి పోగానే అవి దారులు పట్టవు. బారులు దీరవు కదా!

భావజుడంటె మనస్సులో పుట్టే వాడు మన్మథుడు. ఆశుగములంటే వేగంగా పయనించేవి బాణాలని అర్థం. మనస్సులోని ఆశయాలు కనుచూపులలో ప్రసరిస్తాయి కదా! మన్మథుని బాణాలు పువ్వులే. అరవిందం, అశోకం, చూతం, నవమల్లిక, నీలోత్పలం అనే అయిదు పువ్వులు బాణాలుగా కలవాడు. కాబట్టి మన్మథునికి 'పంచబాణు'డని పేరు. పూలబాణాలు మెత్తని హృదయంలో ఒత్తుగా నాటుకొని వలపును రగిలిస్తాయి. కాబట్టి, రుక్మిణిచూపులు మదనుని తూపులకు ప్రాపులు.

పుష్ప బాణుడైన మన్మథునికి చెరుకు గడయే ధనుస్సు - విల్లు. కమ్మ విల్కాడని ప్రసిద్ధం. చెరుకు గడల కొనలు కొంచెం వాలి మొనదేలి యుంటాయి. కాబట్టి, తియ్యని చెరుకుల కడలే రుక్మిణీదేవి కనుబొమలు. ఆమె మాటలు మనోరంజకాలు. కలువలైనా, కమలాలైనా జలజాలే. చంద్రసాహచర్యంతో కలువలనే అర్థం సముచితం. చంద్రుడు కలువలకు వికాసాన్ని కల్పిస్తాడని కవి సమయం. కలువకంటి ముఖం పూర్ణేందు బింబం వలె ఆహ్లాదకరమైనదని అభివ్యక్తం.

శిల్పరామణీయక మైన ఈ సీస పద్యం ఉపమాలంకారాలమయం. ప్రతి పాదార్థంలోని మొదటి పదాలు ఉపమానాలు, తర్వాతి పదాలు ఉపమేయాలు. కాని, ఎత్తు గీతిలోని చివరి చరణంలో జలజనయన ముఖము - అనే ఉపమేయం మొదట, ఉపమానం తర్వాత ప్రయుక్తమైనది. ముఖ్యంగా అంగాలు అధికశోభతో వ్యతిరేకాలంకృతాలు.

అయత్నసిద్ధమైన శబ్దాలంకారాలు కూడా ఈ పద్యంలో రస వ్యంజకంగా ఉన్నాయి. మొదటిపాదంలోని ప్రథమార్ధమందు యమకం. ద్వితీయార్ధమందు వృత్త్యనుప్రాస. రెండవ పాదంలోని ప్రథమార్ధంలో ఛేకం, ద్వితీయార్ధంలో యమకం. తృతీయచరణ ప్రథమార్ధంలో యమకం, ద్వితీయార్ధంలో ఛేకం, నాల్గవ పాదంలోని మొదటి సగంలో ఛేకం, రెండవ సగంలో వృత్త్యనుప్రాస. చివర ఆట వెలదిలో నాలుగు పాదాలు ఛేకానుప్రాసం. రూపసౌందర్య రచనలో ఈ శబ్దాలంకారాలు అర్థాలంకారాలకు సహాయపడి వాటికి అతిశయద్యోతకంగా ఉన్నాయి.

"శబ్దా స్తద్వ్యంజకా అర్థబోధకాః శ్రుతిమాత్రతః" అని సాహిత్యదర్పణకారుడన్నట్లు, వినగానే అర్థబోధకాలైన శబ్దాలు ప్రసాదగుణ వ్యంజకంగా శోభిస్తున్నాయి. ఇట్టి పద్య రచన కావ్య సౌందర్యానికి ఉత్కర్షాదాయకం కదా!

ఇంతముచ్చటగా వధువు యొక్క అంగ ప్రత్యంగాలను వరుని ముందు వర్ణించి చెప్పడం ఔచిత్యమా? అంటే, బ్రాహ్మణుడు వయోవృద్ధుడు. సత్త్వగుణ సంపన్నుడు, బ్రహ్మజ్ఞానం కలవాడు, ముఖ్యంగా ఘటకుడు. సందేశం విన్నవించిన తర్వాత సవరణగా పలికిన మాటలని తెలిసింది కదా! తన కార్యాన్ని నిర్వర్తించుకోవడానికి ఈ వర్ణన సవరణగా భావించాడు. శ్రీకృష్ణునికి రుక్మిణియందు మనస్సును లగ్నం చేయడానికి ప్రయత్నించాడు. రుక్మిణీదేవి సౌందర్యాకర్ణనం శ్రీకృష్ణునికే అవసరం. ప్రేయః సిద్ధి కలుగుతుందనే అధ్యవసాయంతో వర్ణించాడు.

ప్రేయఃసాధనయేకాక, శ్రేయఃసాధనమని కూడా భావించినట్లు స్పష్టంగా గోచరిస్తున్నది. రుక్మిణీదేవిని లక్ష్మీదేవిగా ఉపాసనీయ భావనతో వర్ణిస్తే, జన్మరాహిత్యం

కలుగుతుందనే ఆచార్యత్వపూర్తి కలవాడు. కాబట్టి, పాదాలు మొదల్కొని ముఖందాకా వర్ణించాడు. దేవత(ల)ను వర్ణించే విధానమిది.

**ఆ యెలనాగ నీకు దగు నంగనకుందగు దీవు మాయుపా**
**ధ్యాయుల యాన పెండ్లియగు దప్పదు జాడ్యము లేల నీవు నీ**
**తోయము వారు గూడుకొని తోయరుహానన దెత్తుగాని వి**
**చ్చేయుము శత్రులన్ నుఱుము సేయుము సేయుము శోభనం బిలన్ 25**

అర్థం : ఆ, ఎలనాగ = ఆ చిన్నది; నీకున్ = నీకు, తగున్ = తగినది. అంగనకున్ = ఆ మగువకు; ఈవు = నీవు; తగుదు = తగిన వాడవు; మా ఉపాధ్యాయుల = మా గురువుల మీద; ఆన = ఒట్టు; పెండ్లి, అగు, తప్పదు; జాడ్యములు +ఏల = ఆలస్యం చేయడం ఎందుకు? నీవు, నీ తోయము వారున్ = నీకు కావలసిన వారును; కూడుకొని = కలిసి; తోయరుహ+ఆననన్ = కమలంవంటి ముఖం కలదైన రుక్మిణిని; తెత్తుగాని = చేకొని వత్తువుగాని; విచ్చేయుము = రమ్ము; శత్రులన్ = విరోధులను; నుఱుము సేయుము = మర్దించి పొడి పొడి చేయుము; ఇలన్ = భూమి యందు; శోభనంబు, సేయుము = శుభం చేయుము.

తా : ఓకృష్ణా! నీకు తగినది ఆ రుక్మిణి. ఆమెకు తగిన వాడవు నీవు. మా గురువుల సాక్షిగా చెబుతున్నాను. మీ ఇద్దరికి పెండ్లి తప్పక అవుతుంది. ఆలస్యమెందుకు? నీవు, నీకు కావలసిన వారిని వెంటబెట్టుకొని ఆపద్మ ముఖిని చేకొని వత్తువుగానిరా, పోదాం. శత్రువులను మర్దించి లోకానికి మేలు చేయవయ్యా!

వ్యాఖ్య : రుక్మిణికి భర్తగా నీవే తగుదువని కృష్ణునికి ఉత్కంఠ కలిగించే పద్యం. బ్రాహ్మణుడు రుక్మిణీసౌందర్యాన్ని వర్ణించి ఆ లేబ్రాయపు పడుచు నీకు ధర్మపత్నిగా ఉండదగినది, ఆమెకు పతిగా నీవే ఉండదగిన వాడవు. ఉత్తమ సంస్కారాన్ని బట్టి, అందచందాలనుబట్టి, ఈడుజోడును బట్టి మీరు ఆలుమగలుగా ఉండదగిన వారు. మా గురువుల మీద ఒట్టు సుమా! మీకు తప్పక పెండ్లి అవుతుందని శ్రీకృష్ణునికి ఆసక్తి తల మున్కలయ్యేలాగా చేశాడు. దీనివల్ల కార్యసాధకుని మాట నేర్పరితనం అభివ్యక్తమవుతున్నది.

పరస్పర సాదృశ్యాన్ని బట్టి, పరిశుద్ధాంతఃకరణుడైన వేదమూర్తి అన్నమాట అబద్ధం కాదని, నమ్మకం కలుగడానికి, గౌరవ ప్రదులైన వారిపై ఒట్టేసి చెప్పడంవల్ల ఏ వరుడు హర్షించడు? కృష్ణుని సంతోషం మేర మీరక ముందే, ఇంక 'జాడ్యములేల?' అన్నాడు విప్రుడు. "ఆలస్యాదమృతం విషమ్" - అవసరమైన మంచి పనిని వెంటనే

చేయక ఆలస్యం చేస్తే అమృతమైనా విషమవుతుందికదా! "శ్రేయాంసి బహువిఘ్నాని" సమయానికనుగుణంగా మంచి పనులు చేస్తుండగా, ఎన్నో ఆటంకాలు కలుగుతునే ఉంటాయంటారు విజ్ఞులు. కాబట్టి "శుభస్యశీఘ్రమ్." తడయకుండా, శుభకార్యాన్ని త్వరగా నిర్వహించాలి అనే హితం మితంగా బోధించాడు. తన కిష్టులైన వారిని, పరివారాన్ని వెంట బెట్టుకొని రుక్మిణిని 'తెత్తుగాని విచ్చేయు' మని కృష్ణుణ్ణి కార్యవ్యగ్రుడయ్యే విధంగా ప్రేరేపించాడు. కార్యనిర్వహణలో అడ్డు తగిలే పగవారిని అణచి వేయాలని కూడా హెచ్చరించాడు.

రుక్మిణీ కృష్ణుల కల్యాణం జగత్కల్యాణంగా పరిణమిస్తుందన్నాడు.

'తోయమువారు - తోయరుహానన' - తృతీయపాదమందు యమకం, చతుర్థ పాదమందు అంత్యానుప్రాసమనే శబ్దాలంకారం నిబంధితమైన ఉత్పలమాల.

**వ : అని యిట్లు పలికిన బ్రాహ్మణుని వలన విదర్భ రాజతనయ పుత్తెంచిన సందేశంబును, రూపసౌందర్యాది విశేషంబులును విని, యవధరించి, నిజకరంబున నతనికరంబు బట్టి నగుచు, నయ్యాదవేంద్రుండిట్లనియె.**

తా : ఈ రీతిగా పలికిన బాపనయ్య ద్వారా రుక్మిణీ సందేశాన్ని, ఆమె శరీరావయవాల సోయగాలను విని, అంగీకరించి, తన చేతితో విప్రుని చేయి పట్టుకొని కృష్ణుడు నవ్వుతూ, చెప్పబోయే విధంగా పలికాడు. 'తన చేతితో అతని చేయి పట్టడం' - ఆదరార్థం. చనువు ఇవ్వడమే. నవ్వడంవల్ల 'నీవు చెప్పినదంత నాకు ముందే తెలుసు' ననడానికి సంకేతం.

'యాదవ+ఇంద్రుడు' అనే పదానికి యదువంశశ్రేష్ఠుడు - గొల్లనాయకుడు అని అర్థం. యదువంశీయులకు రాజ్యమేలే అర్హత లేదు. కాబట్టి కృష్ణుడు రాజేంద్రుడుకాదు. ఈ పద ప్రయోగం కథా రచన నైపుణ్యాన్ని తెల్పుతుంది.

**కన్నియ మీద నా తలపు గాఢము కూరుకురాదు రేయి నా**
**కెన్నడు, నా వివాహము సహింపకరుక్మితలంచుకీడు నే**
**మున్నె యెఱుంగుదున్, బరుల మూకలడంచి కుమారి దెత్తు, వి**
**ద్వన్నుత! మానుద్రచ్చి నవవహ్ని శిఖన్ వడి దెచ్చుకైవడిన్. 26**

అర్థం : విద్వత్+నుత = పండితులచే కొనియాడబడిన విప్రోత్తమా! కన్నియ మీదన్ = కన్యకయైన రుక్మిణి మీద; నా తలపు = నా మనస్సు; గాఢము = దృఢంగా అంటి ఉన్నది. నాకు, ఎన్నడున్ = ఏనాడుకూడా; రేయిన్ = రాత్రివేళ; కూరుకురాదు = నిద్రరాదు. రుక్మి; నా

వివాహము = నా పెండ్లిని; సహింపక = ఓర్వక; తలంచు = తలచునట్టి; కీడున్ = చెరపును; నేన్ = నేను; మున్నె = ముందే; ఎఱుంగుదున్ = తెలిసిన వాడను; మానున్ = చెట్టును; త్రచ్చి = తరచి; నవవహ్ని శిఖన్ = క్రొత్త అగ్నిజ్వాలను; వడిన్ = వేగంగా; తెచ్చు = తీసుకవచ్చే; కైవడిన్ = విధంగా; పరుల = శత్రువుల; మూకలు = సమూహాలను - సేనలను; అడంచి = అణచివేసి; కుమారిన్ = కన్యకను; తెత్తున్ = తీసుకొని వచ్చెదను.

తా : ఓ విద్వన్నుత! రుక్మిణి పైన నాకు మక్కువ ఎక్కువ. కాబట్టి, ఏనాడుకూడా రాత్రులందు నాకు నిద్రపట్టదు. రుక్మి నా పెండ్లి నోర్వక చేసే అపకారం నాకు ఇంతకు ముందే తెలుసు. చెట్టును తరచితరచి అగ్నిజ్వాలను బయటకు తెచ్చే విధంగా శత్రుసైన్యాన్ని జయించి రుక్మిణిని తెచ్చుకొంటాను.

వ్యాఖ్య : అగ్ని జ్వాలలాగా పవిత్రంగా వెలిగే రుక్మిణిని కృష్ణమూర్తి తెచ్చుకొంటాననే వర్ణన.

శ్రీకృష్ణుడు భూసురుణ్ని 'విద్వన్నుత' అని సంబోధించాడు. శాస్త్రాలను అధ్యయనం చేసి లౌకిక, పారలౌకిక జ్ఞానాన్ని ఆర్జించినవారు విద్వాంసులు. శాస్త్రజ్ఞుడైనా, లౌకికంగా నిర్లిప్తుడై పారమార్థిక చింతనతో జీవనం గడిపే వ్యక్తులు విద్వన్నుతులు. "తమేవం విద్వానమృత ఇహభవతి". బ్రహ్మ జ్ఞాన సంపన్నుడు అమృతమయుడు. రుక్మిణీ కృష్ణులు లీలావతారులైన లక్ష్మీనారాయణులని ఉపాసిస్తున్నవాడు. లౌకికంగా, ప్రాప్త లాభముదితమానసుడు. కాబట్టి ఇట్టి సుజనులకు శ్రీకృష్ణుడు ఐదుపది చేస్తానన్నాడు కదా! (15 పద్యంలో). పరతంత్రయైన రాజకన్య తన తల్లిదండ్రులకు, తోబుట్టువులకు ఎవరికీ తెలియకుండా చెప్పి పంపిన సందేశాన్ని యథాతథంగా విన్నవించి, దాంపత్య ఘటకత్వం కోసం మాటలతో చిత్రించిన లావణ్యమూర్తిని తన యెదలో పదిలపరచి, తన తలపును వలపుగా కెలకించిన నేల వేలుపు సాహసాన్ని చూచి, జ్ఞానాన్ని అనుష్ఠానంగా - ఆచరణగా మలచుకొన్న మహా ప్రజ్ఞను గమనించి, శ్రీకృష్ణుడు 'విద్వన్నుత' అని ప్రశంసించడం ఆ జగతీసురేశ్వరుని భాగధేయం కదా!

రుక్మిణి అనే కన్య యందు శ్రీకృష్ణుడు బద్ధానురాగ మనస్కుడయ్యాడు. కాబట్టి ఆయనకు రాత్రులందు నిద్ర పట్టకున్నదట. విప్రుడు వర్ణించిన తీరును బట్టి అంతటి 'అందాలరాశి'యని తెలియదేమో కాని, అంతకుముందే అతిథుల వల్ల విన్న 'ఆలలన రూపు బుద్ధియు శీలము లక్షణము గుణము చింతించి' ఆమెను ఇల్లాలుగ చేకొంటాననుకొన్నప్పటి నుంచే అనురాగమధికమైనందువల్ల కృష్ణుడు 'కూరుకురాదు రేయి నా కెన్నడు' అంటున్నాడని ఈ పద్యం వల్ల వెల్లడవుతున్నది.

"బలవంతుడు పైనెత్తిన
బలహీనుడు, ధనము గోలువడిన యతడు, ప్రము
చ్చిలి వ్రేగునతడు, గామా
కులచిత్తుడు, నిద్ర లేక కుందుదు రధిపా"

అని, భారతం నిద్రపట్టని వారి పట్టిక నిచ్చింది.

తన వివాహానికి రుక్మి భంగం కలిగించేసంగతి కృష్ణునికి ముందే తెలుసునట. కాబట్టి, జగద్ధితార్థమై రుక్మిణీ సందేశాన్ని అందించిన భూదేవునికి శ్రీకృష్ణభగవానుడు విరోధులను అణచివేసి 'దారువును ద్రచ్చి అగ్ని శిఖను బయటకు తెచ్చే విధంగా రుక్మిణిని తెచ్చుకొంటాను' అని అభయమిచ్చాడు. ఇది వైదికోపమానం. యజ్ఞంలో ప్రతిష్ఠించే అగ్ని అధరారణిని ఉత్తరారణితో మథించగా, ఆ కఱ్ఱల నుంచి పుట్టి జ్వాలగా వెలుగుతుంది. ఆ జ్వలన జ్వాలను బయటకు తెచ్చి వేదమంత్రాలను పఠిస్తూ హోమకుండంలో ప్రతిష్ఠించడం వైదిక సంస్కారం.

ఉపమానోపమేయాలకు సాదృశ్యాన్ని మనోజ్ఞంగా వర్ణించడం ఉపమాలంకార లక్షణం.

ఉపమానం - మానుద్రచ్చి వహ్నిశిఖను తేవడం.

ఉపమేయం - పరుల మూకనడంచి కుమారిని తేవడం.

కైవడిన్ - ఉపమావాచకం.

తెత్తును - సమాపక క్రియ - సాధారణ ధర్మం.

ఇది పూర్ణోపమాలంకారం.

రుక్మిణియనే కుమారిని నవవహ్నిశిఖతో పోల్చడం వల్ల, కన్యక అగ్ని లాగా శుచిర్భూత. "తీర్థోదకం చ వహ్నిశ్చ నాన్యతః శుద్ధి మర్హతః" - నదీజలం, అగ్ని, ఈ రెండూ మరొకరిచేత - వేరొక ద్రవ్యం చేత - శుద్ధి చేయ తగనివి. అవిస్వయంగా పరిశుద్ధమైనవి అని 'భవభూతి' సూక్తి.

"తామగ్ని వర్ణాం తపసాజ్వలంతీం వైరోచనీమ్" అనే ప్రాబల్యా స్ఫురిస్తుంది.

నూరు జన్మలైనా ఎత్తి కృష్ణ భగవానుణ్నే భర్తగా పొందే ఆర్తితో ఉంది రుక్మిణి. అంతకంటె ఎన్నో రెట్లు అధికంగా ఆమెపైన వ్యామోహం ఉండడంవల్ల నిద్రపట్టక బాధ పడుతున్నాడు కృష్ణుడు.

నువ్వులలో నూనె, కట్టెలో అగ్ని, దేహంలో జీవాత్మ కనబడక ఉంది. కట్టెను రాపాడి అగ్నిని వెలికి తీసే రీతిగా దేహంలో జ్యోతిగా వెలుగుతున్న ఆత్మను కర్మబంధాలను ఛేదించి వెలికి తీసి, పరమాత్మ స్వీకరిస్తాడని ఉత్తర మీమాంసాశాస్త్రం తెల్పుతుంది. 'తదోకోగ్రజ్వలనం' అనే బ్రహ్మ సూత్రం గమనీయం. ఉత్పలమాల.

**వచ్చెద విదర్భ భూమికి**
**జొచ్చెద భీష్మకుని పురము సురుచిరలీలన్**
**దెచ్చెద బాలన్ వ్రేల్మిడి**
**వ్రచ్చెద నడ్డంబురిపులు వచ్చిన బోరన్.** 27

అర్థం : విదర్భ భూమికిన్ = విదర్భ దేశానికి; వచ్చెదన్; భీష్మకుని పురమున్ = భీష్మకుని పట్టణమైన కుండిన నగరమందు; సురుచిర లీలన్ = మనోహరమైనవిలాసంతో; చొచ్చెదన్ = ప్రవేశిస్తాను. బాలన్ = రుక్మిణిని; వ్రేల్మిడిన్ = చిటికలో; తెచ్చెదన్ = తీసుకొని వస్తాను; రిపులు = పగవారు; అడ్డంబు వచ్చినన్ = అడ్డు తగిలితే; పోరన్ = యుద్ధమందు; వ్రచ్చెదన్ = చీల్చి వేస్తాను.

తా : నేను ఇప్పుడే విదర్భ దేశానికి వచ్చి కుండిన నగరంలోకి చాకచక్యంగా ప్రవేశిస్తాను. రుక్మిణిని తెచ్చుకొంటాను. అడ్డు తగిలిన వారిని పోరులో చీల్చేస్తాను.

వ్యాఖ్య : "తోయ రుహానన దెత్తుగాని విచ్చేయుము" అని భూసురేంద్రుడు చెప్పిన మాటకు యాదవేంద్రుని సమాధానం. సందేశ ఫల మీ కందమందు స్పష్టంగా ఉంది.

వ : **అని పలికి, రుక్మిణీదేవి పెండ్లి నక్షత్రంబు దెలిసి, తన పంపున రథసారథియైన దారకుండు శైబ్య సుగ్రీవ మేఘ పుష్ప వలాహకంబులను తురంగంబు లంగట్టి, రథ మాయత్తంబు చేసి తెచ్చిన నమోఘ మనోరథుండైన హరి తానును, బ్రాహ్మణుండును రథా రోహంబుసేసి, యేక రాత్రంబున నా నర్తక దేశంబులు గడచి విదర్భ దేశంబునకుంజనియె. అందు గుండిన పురీశ్వరుండైన భీష్మకుండు కొడుకునకు వశుండై, కూతు శిశుపాలునకిత్తునని తలంచి, శోభనోద్యోగంబు సేయించె. అప్పుడు.**

అర్థం : పెండ్లి నక్షత్రంబున్ = వివాహముహూర్తం - సమయాన్ని; తన పంపునన్ = తన ఆజ్ఞచేత; దారకుడు = కృష్ణుని రథసారధి; తురంగంబులన్ = గుఱ్ఱాలను; ఆయత్తంబు చేసి = సిద్ధం చేసి; అమోఘ మనోరథుండైన = వ్యర్థం కానట్టి కోరిక కలవాడైన; రథ+ఆరోహంబుసేసి

= రథమెక్కి; ఏకరాత్రంబునన్ = ఒక్కరాత్రిలోనే; కడచి = దాటి; అందున్ = ఆ విదర్భ దేశమందు; వశుండై = అధీనుడై- లోబడిన వాడై; శోభన+ ఉద్యోగంబు = శుభకార్య ప్రయత్నాన్ని; సేయించె = చేయించెను; అప్పుడు = ఆ సమయాన.

తా : కృష్ణుడిట్లు పలికి, రుక్మిణి పెండ్లి సుముహూర్తం తెలుసుకొని రథం సిద్ధం చేయుమని సారథికి చెప్పగా, దారకుడు శైబ్య, సుగ్రీవ, మేఘ పుష్ప, వలాహకాలనే అశ్వాలను గట్టి రథాన్ని సిద్ధం చేశాడు. వెంటనే కృష్ణుడు, విప్రునితోకూడ రథమెక్కి ఒకే ఒకరాత్రి ఆనర్తక దేశ భూములను దాటి విదర్భకు చేరాడు. కుండిన నగరంలో భీష్మకుడు కొడుకు మాట మీరలేక కుమార్తెను శిశుపాలునికీయ దలచాడు. వివాహ శుభకార్యం కోసం ప్రయత్నం చేయించే సమయంలో -

**రచ్చలు గ్రంతలు రాజమార్గంబులు**
**విపణి దేశంబులు విశదములుగ**
**జేసిన చందనసిక్తతోయంబులు**
**గలయంగ జల్లిరి కలువడములు**
**రమణీయ వివిధ తోరణములు గట్టిరి**
**సకల గృహంబులు సక్కజేసి**
**కర్పూర కుంకుమాగరు ధూపములు వెట్టి**
**రతివలు పురుషులు నన్నియెడల**
**వివిధ వస్త్రములను వివిధ మాల్యాభర**
**ణానులేపనముల నమరి యుండి**
**రఖిల వాద్యములు మహాప్రీతి మ్రోయించి**
**రుత్సవమున నగర మొప్పియుండె.** **28**

అర్థం : రచ్చలు = సభామంటపాలు; క్రంతలు = సందులు; రాజమార్గంబులు = రాచబాటలు; విపణి దేశంబులు = అంగళ్ళ వీథులు; విశదములుగన్ = పరిశుభ్రములుగా; చేసిరి. చందన సిక్త తోయంబులు = మంచి గంధంతో తడుప (కలుప) బడిన నీళ్ళు; కలయంగన్ = అంతట కలిసే రీతిగా; చల్లిరి = చిలుకరించిరి. కలువడములు = కలువ పూలదండలను; రమణీయ+ ములు, రమణీయ = అందమైన, వివిధ = నానావిధాలైన; తోరణములు = ముఖద్వారాలకు దండలుగా; కట్టిరి. సకల గృహంబులు = అన్ని యిండ్లను; చక్కజేసి = బాగు పరచి; కర్పూర -ములు, కర్పూర = పచ్చకర్పూరం యొక్క; కుంకుమ = కుంకుమ పువ్వుయొక్క; అగరు = అగరు చెక్కయొక్క; ధూపములు = (సువాసనగల) పొగలు; పెట్టిరి; అతివలు = స్త్రీలు;

పురుషులును = మగవారు కూడా; అన్ని+ఎడల = అన్నిచోట్ల; వివిధ వస్త్రములను = అనేక విధాలైన కట్టు పుట్టాల చేతను, వివిధ మాల్య+ఆభరణ+ అనులేపనములన్ = నానావిధాలైన పూలదండలచేతను, భూషణాల చేతను, మైపూతలచేతను; అమరియుండిరి = ఒప్పియుండిరి; అఖిలవాద్యములు = అనేక భజంత్రీలను; మహాప్రీతిన్ = అధిక సంతోషంతో; మ్రోయించిరి = వాయించిరి; నగరము = పట్టణము; ఉత్సవమునన్ = వేడుకతో; ఒప్పియుండె = శోభిస్తుండెను.

తా : పట్టణంలోని సభామంటపాలు, పెద్ద, చిన్న వీధులను, రాజమార్గాలను, అంగడి మొదలైన ప్రదేశాలను శుభ్రపరచి చందనం కలిపిన నీళ్ళను చిమ్మి కలువ పూదండల తోరణాలను రాజసేవకులు కట్టారు. ఇండ్లనన్నింటిని కసపూడ్చి, గోడలకు సున్నం వేసి, అలికి, ముగ్గులు పెట్టి, పచ్చకర్పూరం, కుంకుమపువ్వు, అగరుచెక్క మొదలైన సుగంధ ద్రవ్యాల పొగలు వేశారు. మగువలు, మగవారు అందరు విలువైన నూతన వస్త్రాలను, నగలను, పూలహారాలను ధరించి, కస్తూరి, పునుగు, జవ్వాది మొదలైన సువాసన వస్తువులను దేహానికి పూసుకొని మహానందంతో ఉన్నారు. సకల వాద్యాలను అధికసంతోషంతో మ్రోయించారు. కుండిన నగరమంత ఉత్సాహ భరితంగా ఉండింది.

వ్యాఖ్య : నగరమంత కల్యాణ శోభతో కళకళలాడిందనే స్వాభావిక వైచిత్రిని ఈ ఆట వెలది తోడి సీసపద్యం స్పష్టంగా ప్రదర్శిస్తున్నది.

వ : **అంతనాభీష్మకుండు విహిత ప్రకారంబులం బితృదేవతలనర్చించి, బ్రాహ్మణులకు భోజనంబులు వెట్టించి, మంగళాశీర్వచనంబులు సదివించి, రుక్మిణీదేవి నభిషిక్తం జేసి, వస్త్రయుగళభూషితంగావించి, రత్న భూషణంబులిడి, ఋగ్యజుస్సామమంత్రంబుల మంగళాచారంబులొనరించి, భూసురులు రక్షాకరణంబులాచరించిరి. పురోహితుండు గ్రహశాంతి కొఱకు నిగమనిగదిత న్యాయంబున హోమంబుగావించె. మఱియు నా రాజు దంపతుల మేలు కొఱకు తిలధేను కలధౌతకనక చేలాది దానంబులు ధరణీదేవతల కొసంగె. అయ్యవసరంబున**

అర్థం : అంతన్ = ఆ తర్వాత; ఆ భీష్మకుండు; విహిత ప్రకారంబులన్ = శాస్త్రంలో చెప్పబడిన విధంగా; పితృదేవతలను; అర్చించి = పూజించి; బ్రాహ్మణులకు భోజనాలను పెట్టించి; మంగళ+ఆశీర్వచనంబులు = పుణ్యాహవాచనంతోపాటు శుభసూచకాలైన ఆశీర్వచన మంత్రాలను; చదివించి = పఠింపజేసి; రుక్మిణీదేవిని; అభిషిక్తన్+ చేసి = మంగళస్నానం చేయించి; వస్త్రయుగళ భూషితన్+కావించి = రెండు వస్త్రాలచేత అలంకరింప బడిన దానిగా చేసి; రత్న

భూషణంబులు = రత్నాలను పొదివిన బంగారు నగలను; ఇడి = ధరింపజేసి; ఋక్+యజుస్సు+సామములనే మంత్రములచేత; మంగళ+ఆచారంబులు = శుభకార్యాలను; ఒనరించి = చేసి; భూసురులు = బ్రాహ్మణులు; రక్షా కరణంబులు = రక్ష చేసే ప్రక్రియలను; ఆచరించిరి = చేసిరి; పురోహితుండు = ముందు క్షేమం కోరే బ్రాహ్మణుడు; గ్రహశాంతి కొఱకు = నవగ్రహాల శాంతి కోసం; నిగమ నిగదిత న్యాయంబునన్ = వేదోక్త ప్రకారంగా; హోమంబు; గావించెన్ = చేసెను; మఱియు ఆరాజు; దంపతుల మేలు కొఱకు = నూతన వధూవరుల శ్రేయస్సు కోసం; తిల, ధేను, కలధౌత, కనక, చేల+ఆది; దానంబులు = నువ్వులు, ఆవులు, వెండి, బంగారం, వస్త్రాలు మొదలైన దానాలను; ధరణీ దేవతలకున్ = బ్రాహ్మణులకు; ఒసంగెన్ = ఇచ్చెను; ఆ + అవసరంబునన్ = ఆసమయాన.

తా : ఆ తర్వాత భీష్మక మహారాజు పితృదేవతలను అర్చించాడు. అంటే, వివాహ శుభకార్యానికి ముందే నాందీ కర్మను వంశంలో పెద్దవాడు - తండ్రి లేని వ్యక్తి - మాత్రమే చేయడం విధి విహితం. బ్రాహ్మణులకు భోజనాలను పెట్టించాడు. పుణ్యాహ వాచనం చేయించాడు. మంగళాశీర్వచనాలతో రుక్మిణీదేవికి స్నానం చేయించి, వస్త్రయుగ్మంతో - పావడ, పయటను ధరింపజేసి - రత్నాభరణాలతో అలంకరింపజేశాడు. మూడు వేదాల మంత్రాలను పఠిస్తూ బ్రాహ్మణులు మంగళాచారాలను, రక్షాబంధనం జరిపించారు. పురోహితుడు నవగ్రహశాంత్యర్థం వేదోక్త ప్రకారంగా హోమం చేసి, నవవధూవరుల శ్రేయస్సుకోసం బ్రాహ్మణులకు తిలదానం, గోదానం, రజితదానం, హిరణ్యాదానం, వస్త్రదానం మొదలైన దానాలను చేయించాడు. ఆ సమయంలో.

**భటసంఘంబులతో రథావళులతో భద్రేభయూథంబుతో**
**బటువేగాన్విత ఘోటక వ్రజముతో బంధుప్రియశ్రేణితో**
**గటు సంరంభముతో విదర్భ తనయంగైకొందునంచున్ విశం**
**కట వృత్తిన్ జనుదెంచె చైద్యుడు గడున్ గర్వించి యప్పీటికిన్. 29**

అర్థం : చైద్యుడు = శిశుపాలుడు; భట సంఘంబులతోన్ = కాలిబంట్ల సమూహాలతోనూ; రథ+ఆవళులతోన్ = రథాల పంక్తులతోనూ; భద్ర+ఇభ యూథంబుతోన్ = భద్రజాతి ఏనుగుల గుంపుతోనూ; పటు - తోన్, పటు = మిక్కిలి; వేగ = వేగంతో; అన్విత = కూడుకొన్న; ఘోటక = గుఱ్ఱాల; వ్రజముతోన్ = గుంపుతోనూ; బంధు, ప్రియ శ్రేణితోన్ = బంధువర్గంతో, మిత్ర వర్గంతోనూ; కటు సంరంభముతోన్ = అధికమైన ఆటోపంతో; విదర్భ తనయన్ = విదర్భరాజుకూతురైన రుక్మిణీ దేవిని; కైకొందున్+అంచున్ = చేకొంటాను- పెండ్లాడుతాను

అంటూ; వికంకట వృత్తిన్ = అడ్డులేని మిడిసిపాటుతో; కడున్ = చాల; గర్వించి = అహంకరించి; ఆ + వీటికిన్ = ఆ (కుండిన) పట్టణానికి; చనుదెంచెన్ = వచ్చెను.

తా : చేదిదేశపు రాజైన శిశుపాలుడు రథగజాశ్వపదాతి చతురంగ-బలాలతోనూ, చుట్టాలతో, స్నేహితులతో కూడుకొని మిక్కిలి హేరాళమైన నడవడితో రుక్మిణీదేవిని పెండ్లాడుతాను గదా, అని విఱ్ఱవీగుతూ ఆ పట్టణానికి వచ్చాడు.

వ్యాఖ్య : రుక్మిణీదేవిని పెండ్లాడు తానని పటాటోపంతో విజృంభించి వచ్చిన చైద్యుని నడవడికి తగిన దీ మత్తేభవృత్త పద్యం.

**బంధులగూడి కృష్ణబలభద్రులు వచ్చిన బాఱఁద్రోలి ని**
**ర్మంథరవృత్తి చైద్యునికి మానిని గూర్చెదమంచు నుల్లస**
**త్సింధుర వీర వాజి రథ సేనలతో జనుదెంచిరా జరా**
**సంధుడు దంతవక్త్రుడును సాల్వ విదూరథపౌండ్రకాదులున్** 30

అర్థం : ఆ జరాసంధుడు, దంతవక్త్రుడు, సాల్వుడు, విదూరథుడు, పౌండ్రక వాసుదేవుడు; ఆదులున్ = మొదలగు రాజులు కూడా; బంధులన్ +కూడి = చుట్టాలతో కలిసి, కృష్ణ బలభద్రులు = కృష్ణుడు మరియు బలరాముడు; వచ్చినన్ = వచ్చినట్లైతే; పాఱన్+ద్రోలి = తరిమివేసి; నిర్మంథర వృత్తిన్ = ఆటంకంలేని నడవడితో; చైద్యునకున్ = శిశుపాలునికి; మానినిన్ = రుక్మిణీదేవిని; కూర్చెదము+అంచున్ = పెండ్లి చేసితీరుతామంటూ; ఉల్ల-తోన్, ఉల్లసత్ = ప్రకాశిస్తున్న; సింధుర = ఏనుగులు; వీర = యోధుల; వాజి = గుఱ్ఱాల; రథ = తేరులు (అనబడే), సేనలతో; చనుదెంచిరి = వచ్చిరి.

తా : జరాసంధుడు, నిలువున రెండు చీలికలుగా ఉన్న శరీర భాగాలను జరయనే దేవత అతికించినందువల్ల జీవించిన బలవంతుడు. మగధదేశాధిపతి, శిశుపాలునికి మిత్రుడు. శ్రీకృష్ణునికి విరోధులైన జరాసంధుడు, దంతవక్త్రుడు, సాల్వుడు, విదూరథుడు, పౌండ్రక వాసుదేవుడు మొదలైన భూపతులందరు, కృష్ణబలరాములు బంధువర్గంతో కూడి వస్తే వారిని తరిమికొట్టి, నిరాటంకంగా శిశుపాలునికి రుక్మిణీదేవితో పెండ్లి చేసి తీరుతామని చతురంగ బలాలతో కుండిన నగరానికి వచ్చారు. తాత్పర్యం స్పష్టం.

**వ : మఱియు నానా దేశంబుల రాజులనేకులే తెంచిరి. అందు శిశుపాలునెదుర్కొని పూజించి, భీష్మకుండొక్క నివేశంబున నతని విడియించె. అంత తద్వృత్తాంతంబు విని**

అర్థం : ఏతెంచిరి = వచ్చిరి; నివేశంబునన్ = ఇంటిలో; విడియించెన్ = నివసింపజేసెను; తత్+వృత్తాంతంబు = ఆ వార్తను.

తా : ఇంక అనేక దేశాలనేలేరాజులు ఎందరో విరివిగా వచ్చారు. వారిలో శిశుపాలునికి భీష్మకుడు సీమాంతం వరకు ఎదురుగా పోయి, వరపూజ చేసి, ఒకవిడిది గృహంలో దించాడు. (ఎదురుకోలు చేయడం, వరుని పూజించడం, విడిదియింట్లో నివసింపజేయడమనే ఆచారం ఈనాడూ ఉంది కదా!) బలరాముడా వార్తను విన్నవాడై.

**హరియొకడేగినాడు మగధాదులు చైద్యహితానుసారులై**
**నరపతులెందఱేని జనినారు కుమారిక దెచ్చుచోట సం**
**గరమగు దోడుగా వలయు గంసవిరోధికి నంచు వేగ దా**
**నరిగె హలాయుధుండు కమలాక్షుని జాడననేక సేనతోన్.** **31**

అర్థం : హల+ఆయుధుడు = నాగలి ఆయుధంగా గలవాడైన బలరాముడు; హరి = కృష్ణుడు; ఒకడు = ఒక్కడే; ఏగినాడు = పోయినాడు; మగధ+ఆదులు = మగధదేశాధిపతి యైన జరాసంధుడు, మొదలైనవారు; చైద్య హిత+అనుసారులై = శిశుపాలుని మేలు కోసం అనుసరించిన వారై; ఎందఱు+ఏని = ఎందఱో; నరపతులు = రాజులు; చనినారు = వెళ్ళినారు; కుమారికన్ = రుక్మిణిని; తెచ్చుచోటన్ = తీసుకొని వచ్చే స్థలంలో; సంగరము+అగున్ = యుద్ధమైతీరును. కంసవిరోధికిన్ = కంసారియైన శ్రీకృష్ణునికి; తోడున్ + కావలయున్ = సహాయపడవలెను; అంచున్ = అనుకొంటూ; అనేక సేనతోన్ = పెక్కు సైన్యంతో; తాన్ = తాను; కమల+అక్షునిన్ = తామరస నేత్రుడైన కృష్ణుణ్ని; చూడన్ = చూడడానికి; (జాడన్ = అతడు పోయిన దారిని బట్టి; ఇది పాఠాంతరం) వేగన్ = శీఘ్రంగా; అరిగెన్ = పోయెను.

తా : కృష్ణుడు ఒంటరిగా విదర్భకు వెళ్ళాడు. శిశుపాలునికి సాయపడడానికి జరాసంధుడు మొదలైన రాజులెందరో వెళ్ళారు. రుక్మిణిని తీసుకొని వచ్చే సమయాన ఆచోట యుద్ధం కాగలదని ఊహించిన బలరాముడు తమ్మునికి తోడ్పడడం కోసం అపరిమితసైన్యంతో కృష్ణుణ్ని జాడ వేగంగా పోయాడు.

వ్యాఖ్య : బలభద్రుని సౌభ్రాత్రం ప్రకటించే చంపకమాలా వృత్తపద్యం.

బలరాముడు రోహిణీవసుదేవుల కుమారుడు. ఆయనకు హలమే ఆయుధం. "కామపాలోహలాయుధః" (అమరం) ముందు జరుగబోయే కార్యాన్ని ఊహించే ప్రజ్ఞాశాలి. దూరదృష్టికలవాడన్న మాట.

చంపకం : సంపెంగ పూలు చంచరీకాలను (తుమ్మెదలను) తమ మీద ఆననీయవంటారు విజ్ఞులు.

కృష్ణుడు దేవకీవసుదేవుల పుత్రుడు. బలరాముడు కృష్ణునికి అగ్రజుడు. అగ్రజుడు ధిషణ కలవాడైతే ఆ వంశం బాగుపడుతుంది. తమ్ముని కనుదమ్ములు తమ్మి యింటి గరిత మీదనే ఆని యుంటాయి. కాబట్టి విదర్భకు ఒంటరిగా వెళ్ళాడు. అసహాయ శూరుడే అయినా అక్కడికి వచ్చిన రాజులందరు కంస విరోధికి విరోధులే. రుక్మిణిని హరించే సమయాన హరికి వారితో సంగరం తప్పక సంభవిస్తుందనీ, తోబుట్టువుకు తోడ్పడాలనీ అన్నయ్య గుండె అమితంగా కొట్టుకొన్నది. అందువల్ల బలరాముడు అధిక సైన్యాన్ని తీసుకొని అనుజుని జూడడానికి ఆలస్యం చేయకుండా అతి వేగంగా నేగినాడు కదా!

వాస్తవంగా, అన్నదమ్ములు అన్యోన్యానురాగులై ఐకమత్యంతో ప్రవర్తిస్తే, వారిని ఏ ప్రబలశక్తి కూడా అడ్డుకోజాలదని బలదేవుని ప్రేమావిలాశయం. "హరిం హరంత మనుయంతిదేవాః." చేతనాచేతనాలను హరించే హరికి దేవతలు అనుయాయు లవుతారని ఉపనిషద్వాణి.

**ఆలోపలనేకతమున**
**నాలోల విశాలనయన యగు రుక్మిణి త**
**న్నా లోకలోచనుడు హరి**
**యాలోకము చేసి కదియడని శంకితయై** 32

అర్థం : ఆలోపలన్ = అంతలో; ఏకతమునన్ = ఒంటరిగా ఉన్నచోట; ఆలోల విశాలనయన = అంతటచలించే వెడల్పైన కన్నులు గల, రుక్మిణీదేవి; ఆలోకలోచనుడు = ప్రకాశించే కన్నులు గల; హరి = కృష్ణుడు; తన్నున్ = తనను; ఆలోకము చేసి = చూచి; కదియడు+అని = సమీపించడని; శంకితయై; సంశయించినదై.

తా : శిశుపాలుడు మొదలైన రాజులందరు వచ్చి చేరినంతలో రుక్మిణి ఒంటరిగా ఉండి, కృష్ణుడు తనను చూచి తన వద్దకు చేర రాడయ్యెనని మనస్సులో సంశయం పొందినదై (ముందు పద్యంతో అన్వయం)

వ్యాఖ్య : శ్రీకృష్ణుడు ఇంక రాలేదేమి అని రుక్మిణి పరితపించే వర్ణన.

రుక్మిణి కన్నులు విశాలమైనవి కాబట్టి అంతట కలయ చూచింది. రాజులందరు కుండిన నగరానికి చేరుకొన్నారు. కృష్ణుడు మాత్రం రాలేదని మనస్సులో విచార మధికమయింది. "అతి స్నేహం పాపశంకి" అన్నట్లు ఉత్కటమైన ప్రేమ మనస్సును వ్యతిరేక భావంతో ఆందోళింపజేస్తుంది. విశాలమైన కన్నుల్లో ఆ మనస్తాపం

స్ఫురించడం వల్ల అవి ఇటు - అటు చలిస్తున్నాయి. ఏకాంతమందు కూర్చున్నందువల్ల మనస్సు సంశయ గ్రస్తమయింది.

కృష్ణుడు ఆలోకలోచనుడు. "ఆలోకద్యోతనౌసమౌ" (అమరం). లోకాలను ప్రకాశింపజేసే సూర్యచంద్రులు కన్నులుగా గలవాడు. "చంద్రసూర్యౌచనేత్రే" - హరికి సూర్యచంద్రులే నేత్రాలుకదా! అంతప్రకాశమానమైన ఆయన కన్నులకు నేను మాత్రం కనబడలేదా? ఇంతకు కృష్ణుడు పెండ్లి సమయానికి ముందు తనను జూచి చేరరాడేమో అని రుక్మిణీదేవి సందేహిస్తున్నది.

అర్థభేదం గల ఆలోకశబ్ద ప్రయోగంవల్ల లాటానుప్రాసాలంకారమున్న కందపద్యమిది.

**లగ్నంబెల్లి వివాహముంగదిసె నేలారాడు గోవిందుడు**
**ద్విగ్నంబయ్యెడి మానసంబు వినెనో వృత్తాంతమున్ బ్రాహ్మణుం**
**డగ్ని ద్యోతను డేటికిందడసెనా యత్నంబు సిద్ధించునో**
**భగ్నంబై చనునో విరించి కృతమెబ్భంగిన్ బ్రవర్తించునో.** 33

అర్థం : లగ్నంబు = సుముహూర్తం; ఎల్లి = రేపు; వివాహమున్ = పెండ్లి, కదిసెన్ = సమీపించెను; గోవిందుడు = మాటను కాపాడే కృష్ణుడు; ఏలారాడు = ఏ కారణం చేత రాకున్నాడు? మానసంబు = మనస్సు; ఉద్విగ్నంబు+అయ్యెడిన్ = కలవరపడుతున్నది; వృత్తాంతమున్ = పంపిన వార్తను; వినెనో = విన్నాడో, లేదో; అగ్నిద్యోతనుడు అనే పేరుగల బ్రాహ్మణుడు; ఏటికిన్ = ఎందుకు? తడసెనో = ఆలస్యం చేసినాడో; యత్నంబు = (నేను చేసిన) ప్రయత్నం; సిద్ధించునో = ఫలించునో; భగ్నంబై = చెడినదై; చనునో = పోవునో; విరించి కృతము = బ్రహ్మచేత చేయబడిన పని; ఏ+భంగిన్ = ఏ విధంగా; ప్రవర్తించునో = జరుగునో.

తా : సుముహూర్తం రేపే. వివాహం సమీపించెకదా! కృష్ణుడింక రాలేదు. కారణమేమో తెల్యదు. నా మనస్సు కలత చెందుతున్నది. నా సందేశం కృష్ణుడు విన్నాడో లేదో, అగ్నిద్యోతనుడు ఎందుకురాకుండా ఆలస్యం చేశాడో? నా ప్రయత్నం ఫలిస్తుందో లేక చెడిపోతుందో! ఇంతకూ బ్రహ్మవ్రాసిన వ్రాతయెట్లున్నదో కదా!

వ్యాఖ్య : రుక్మిణీదేవి కృష్ణమూర్తి రాకను కోరుతూ, తాను పంపిన బ్రాహ్మణుడు తిరిగి రాలేదేమి? అని ఆలోచిస్తున్న పద్యం.

తెల్లవారితే సుముహూర్తం. వివాహమంటే వధూవరులు పరస్పరం విశేష భారాన్ని వహించే పవిత్రమైన సంస్కారం. అట్టి శుభకార్యం జరిపే సమయం రానేవచ్చె కదా!

కృష్ణుడు రాని కారణమేమి? 'నిజసేవకానుసారి' కదా కృష్ణుడు అని నమ్మి సందేశమంపితిని' మఱి గోవిందుడు ఏలరాకున్నాడు? 'గో' శబ్దానికి ఉన్న నానార్థాలలో 'వాక్కు' అనే అర్థం కూడా ఉంది. 'కృష్ణభక్తుడు నష్టపడడు' అని భక్తుడు పలికితే, భక్తునిమాటను భగవానుడు కాపాడుతాడనే కదా! "ప్రతిజానీహికౌంతేయ! నమేభక్తః ప్రణశ్యతి" అని గీతాబోధ. కాబట్టి తన మాటను పాటించి కృష్ణుడు రాలేదేమి? అనే భావం 'గోవింద' శబ్దంలో ధ్వనితం.

నిజంగా, రుక్మిణీదేవికి తన వాంఛ నెరవేరేదాకా ఉల్లం తల్లడిల్లుతుంటుంది కదా! తాను చెప్పి పంపిన వార్తను కృష్ణుడు వినకున్నాడా? "తురీయం వాచో మనుష్యావదంతి" 'మాటలాడే వారు మనుష్యులు' అని శ్రుతి పలికినట్లు, ఏ మనిషి ద్వారానో నేను సందేశంపంప లేదే. అతడు స్వయంగా బ్రహ్మవర్చస్వి. పేరు అగ్నిద్యోతనుడు. అగ్నిని ప్రకాశింపజేసే వాడు. జగత్ప్రాణుడు. లోకాచార్యుడు. అగ్ని పరమాత్మయే. "అగ్నేనయసుపథా" 'ఓ అగ్ని దేవా! (మమ్ము) మంచి (వేద) మార్గాన నడిపించు మని అమోఘమైన ప్రాబల్యులచే, పరమాత్మ అనుగ్రహించే విధంగా, ప్రార్థించే సత్త్వగుణ సంపన్నుడు కదా! కాబట్టి, అగ్నిద్యోతనుడూ తిరిగిరాకుండా, ఏ హేతువుచే ఆలసించాడో, ముఖ్యంగా కృష్ణమూర్తినే పెండ్లాడుతానని చేసిన నా ప్రయత్నం సఫలమవుతుందో, విఫలమవుతుందో, ఇంతకూ బ్రహ్మవ్రాత యెట్లున్నదో, అని రుక్మిణీదేవి సందేహ పడుతున్నది.

'విరించి కృతం' అంటే బ్రహ్మ చేసిన పని. "మనెడు ప్రొద్దుల నొసళ్ళను వ్రాయుదేవర" అంటారాయనను. జీవుల పూర్వజన్మ సంచిత కర్మ ననుసరించి కరణ కళేబరాలనిచ్చి, వారెంత కాలం, ఎలా బ్రతుకాలో బ్రహ్మదేవుడు ఆ దేహధారుల నుదుటి మీద వ్రాస్తాడట. "వేదాభ్యాసోజడః" వేదం నేర్చిన వ్యక్తిని జడుడంటారు. "బుద్ధిః కర్మానుసారిణీ" అన్నట్లు, పూర్వకర్మను అనుసరించేది బుద్ధి. ఆ న్యాయం జీవునికీ బ్రహ్మ దేవునికీ చెల్లుతుంది. బుద్ధి జాడ్యం గల బ్రహ్మకు ప్రాణులతలమీద ఏదో వ్రాసే దాకా తెలియనే తెల్యదట. నిజంగా స్రష్టకు పక్షపాత ముంటే చరితార్థుడు కాలేడు కదా! కాబట్టి, తాను వ్రాసిన తర్వాత చదివి, 'అయ్యో! ఇలా వ్రాశానేమి?' అని పశ్చాత్తాపపడినా, బ్రహ్మకు తన వ్రాసిన వ్రాతను తుడిచి వేసే సామర్థ్యమూ లేదు. "లలాట లిఖితా రేఖా పరిమాష్టుం నశక్యతే".

వ్రాసేదేదో బ్రహ్మకే తెలియదంటే, ఇక బ్రహ్మవ్రాత మనకెలా తెలుస్తుంది? అందుకే 'నావ్రాత యెట్లుంటే అట్లు జరుగుతుంది' అనడం వాడుక అయింది. బ్రహ్మదేవుడే వివాహ దాంపత్యాన్ని నిర్ణయిస్తాడని లోకుల విశ్వాసం. అనుభావ సంచారీ భావాలున్న శార్దూల విక్రీడిత వృత్త పద్యం.

**ఘనుడా భూసురుడే గెనో నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో**
**విని కృష్ణుండిది తప్పుగా దలచెనో విచ్చేసెనో యీశ్వరుం**
**డను కూలింపదలంచునో తలపడో యార్యామహాదేవి యున్**
**ననురక్షింప నెఱుంగునో యెఱుగదో నాభాగ్యమెట్లున్నదో. 34**

అర్థం : ఘనుడు = గొప్పవాడైన; ఆ భూసురుడు = ఆ బ్రాహ్మణుడు; ఏగెనో = (ద్వారకకు) పోయెనో; నడుమన్ = మధ్యన; మార్గశ్రాంతుడై = దారిలో నడవడం చేత అలసిన వాడై; చిక్కెనో = చిక్కుపడి ఆగినాడో; కృష్ణుండు; ఇది = నేను చెప్పి పంపిన వార్తను; విని; తప్పుగాన్ = నేరమని; తలచెనో = భావించెనో; విచ్చేసెనో = లేదా, వచ్చాడో; ఈశ్వరుడు = భగవానుడు; అనుకూలింపన్ = (నాయత్నం) నెరవేర్చడానికి; తలంచునో, తలపడో = సంకల్పిస్తాడో, సంకల్పించడో; ఆర్యామహాదేవియున్ = పార్వతీదేవియైనా; ననున్ = నన్ను; రక్షింపన్ = కాపాడడానికి; ఎఱుంగునో = శక్తురాలవునో; ఎఱుగదో = అశక్తురాలవునో; నా భాగ్యం = నా అదృష్టం; ఎట్లున్నదో.

తా : అగ్నిద్యోతనుడు ద్వారకకు చేరినాడో, లేకమార్గ మధ్యంలో అలసటచే చిక్కి ఆగినాడో; కృష్ణుడు నా సందేశాన్ని విని అపరాధ మనుకొన్నాడో, లేక వచ్చాడో; ఈశ్వరుడు నా యత్నాన్ని నెరవేరుస్తాడో, నెరవేర్చడో, పార్వతీదేవికి నన్ను రక్షించాలని ఉన్నదో, లేదో తుదకు నా అదృష్టమే రీతిగా ఉన్నదో, అని నానా విధాలుగా రుక్మిణీదేవి ఆలోచిస్తున్నది.

వ్యాఖ్య : ప్రతీక్షావ్యగ్రయైన రుక్మిణీదేవి తన వితర్కాన్ని ప్రకటించే మత్తేభవృత్తపద్యం.

ఈ వితర్కమందు 'వినికృష్ణుండిది తప్పుగా దలచెనో; అనే భావన కూడా ఉంది. రుక్మిణి కృష్ణుణ్ని చూడనే లేదు. కేవలమాయన రూపగుణాదులను విన్నంత మాత్రాన ఆమెకు ఆయన మీద ప్రణయమేర్పడింది. కన్య, పెద్దల నిర్ణయానికి లోబడి యుండడం పరిపాటి. రుక్మిణి కన్నవారినీ, అన్నలనూ లెక్క చేయక, రహస్యంగా తాను వలచిన ప్రియునికి ఒక విప్రుని ద్వారా సందేశం పంపి, తన వాంఛను నెరవేర్చుకొనడానికి సాహసించడం జుగుప్సాకరం. కాబట్టి కృష్ణుడు, రుక్మిణీదేవి

చేసిన పరిణయ ప్రయత్నాన్ని అపరాధంగా భావించాడేమో. "నిన్ను పతిగా పొందితే బ్రతుకు మధురం. లేకపోతే నిన్నే తలచుకొంటు చచ్చిపోతాను" అంటుందేమి? ప్రేమకు పరాకాష్ఠ మరణమేనా? ఈ మగువకింత తెగువ తగునా? నిజంగా, ప్రేమ ఎంతమధురమో! అని కృష్ణుడు, ఇంతలో కుండిన నగరానికి వచ్చియుండెనో, అని రుక్మిణి ఆలోచించడమూ వ్యభిచార భావాల సంపుటి. తమక మధికమవడంవల్ల దైన్యం, విషాదంతో పాటు ఔత్సుక్యం మొదలైన భావాలు ప్రతీయమాన మవుతున్నాయి. సందేహ పంచకాలంకృతపద్యం.

**వ : అని, వితర్కింపుచు.**

అర్థం : వితర్కింపుచున్ = రుక్మిణి తనలో తాను పరిపరివిధాలా ఆలోచించుకొంటూ, ఇంక -

**పోడను బ్రాహ్మణుండు యదు పుంగవు వీటికి వాసు దేవుడున్**
**రాడను నింక బోయి హరిరమ్మని చేరెడియిష్టబంధుడున్**
**లేడను రుక్మికిం దగవులేదిట చైద్యునకిత్తునంచును**
**న్నాడను గౌరికీశ్వరికి నావలనం గృపలేదు నేడనున్. 35**

అర్థం : బ్రాహ్మణుండు = అగ్నిద్యోతనుడు; యదుపుంగవు వీటికిన్ = యదువంశ శ్రేష్ఠుడైన కృష్ణుని పట్టణానికి; పోడు+అనున్ = పోయియుండడు అనుకొంటుంది; వాసుదేవుడున్ = కృష్ణుడు; రాడు + అనున్ = రానేరడు అనుకొంటుంది; ఇంకన్ = మళ్ళీ; పోయి; హరిన్ = కృష్ణుణ్ని; రమ్ము+అని; చీరెడి = పిలుచునట్టి; ఇష్టబంధుడున్ = ఇష్టుడైన చుట్టం; లేడు+అనున్ ఇటన్ = ఇక్కడ; రుక్మికిన్; తగవు లేదు = న్యాయం లేదు; చైద్యునకు = శిశుపాలునికి; ఇత్తును+అంచున్ + ఉన్నాడు+ అనున్ = ఇస్తానంటూ ఉన్నాడనుకొంటుంది; ఈశ్వరికి = భగవతియైన; గౌరికి = పార్వతీదేవికి; నేడు = ఈదినం; నా వలనన్ = నా పట్ల; కృప = దయ; లేదు, అనున్.

తా : అగ్నిద్యోతనుడు ద్వారకా నగరానికి పోలేదు, పోయినట్లైతే కృష్ణుడు రాకుండునా? కాబట్టి, కృష్ణుడు ఇక రాడనేది నిశ్చయం. కృష్ణుణ్ని పిలుచుకొని రావడానికి మరొకరిని పంపుతాననుకొంటే ఆప్తుడైన చుట్టమూ లేడు. నా అన్నయైన రుక్మికి న్యాయమనేది లేనే లేదు. నాకు ప్రియుడైన కృష్ణునికి పగవాడైన శిశుపాలునికి నన్ను ఇచ్చి పెండ్లి చేస్తానని పట్టుదలతో ఉన్నాడు. ఐశ్వర్య సంపన్నురాలైన పార్వతీదేవికి నాయందు ఈనాడు దయలేదనుకొంటూ రుక్మిణి ఆరాటపడుతున్నది.

వ్యాఖ్య : ద్విప్రాస గల ఈ ఉత్పల మాలావృత్త పద్యమందు అనుభావాలద్వారా అయోగ విప్రలంభ శృంగారం వ్యజ్యమానమవుతున్నది. తాత్పర్యం స్పష్టం.

ఆశ ఒక చోట ఉండి, కార్యమొక చోట జరుగుతుంటే, కన్నియల హృదయంలో పోదు, రాదు, లేదు అనే వ్యతిరేక భావాలే స్ఫురిస్తాయి. ఆ పదాలను ప్రాసగా నిబంధించడం వల్ల, పద్యం సింగారాన్ని సంతరించుకొన్నది.

**చెప్పదు తల్లికిం దలపుజిక్కు, దిశల్ దరహాస చంద్రికన్**
**గప్పదు, వక్త్రతామరసగంధ సమాగత భృంగసంఘమున్**
**రొప్పదు, నిద్ర గైకొన దురోజ పరస్పరసక్తహారముల్**
**విప్పదు, కృష్ణమార్గగతవీక్షణ పంక్తుల ద్రిప్పదెప్పుడున్.** 36

అర్థం : (రుక్మిణి) తలపు జిక్కు = మనస్సులోని ఆరాటం - విచారం; తల్లికిన్ = తల్లికి కూడా; చెప్పదు; దరహాస చంద్రికన్ = వెన్నెలలాంటి చిరునవ్వుచే; దిశల్ = దిక్కులను; కప్పదు = ఆవరింప జేయదు; వక్త్ర-సంఘమున్, వక్త్ర = ముఖం అనే; తామరస = కమలంయొక్క; గంధ = వాసనకు; సమాగత = వచ్చిన -మూగిన; భృంగ = తుమ్మెదలయొక్క; సంఘమున్ = గుంపును; రొప్పదు = అదలింపదు; నిద్రన్ = నిద్రను; కైకొనదు = చేకొనదు -పోదు; ఉరోజ-హారముల్, ఉరోజ = చన్నులందు; పరస్పర = ఒకటితో మరొకటి; సక్త = పెనగియున్న; హారముల్ = ముత్యాల పేరులను; విప్పదు = విడదీయదు; ఎప్పుడున్ = ఒక్క క్షణమైనా; కృష్ణ-పంక్తులన్, కృష్ణ = కృష్ణుని యొక్క; మార్గ = వచ్చే దారిని; గత = పొందిన; వీక్షణ = చూపులయొక్క; పంక్తులన్ = వరుసలను; త్రిప్పదు = మరలింపదు.

తా : రుక్మిణీదేవి తన మనసులోని బాధను తల్లితో నైనా చెప్పదు. వెన్నెల లాగా తెల్లని కాంతి దిక్కులందు వ్యాపించే రీతిగా కాస్త చిరునవ్వైనా నవ్వదు. ముఖ పద్మమందు మూగిన తుమ్మెదల నెగ్రదోయదు. నిద్రపోదు. రొమ్ముల నడుమ ఒండొంటితో పెనవేసుకొన్న ముత్యాల హారాల చిక్కును విడదీయదు. కృష్ణుడు వచ్చే దారిని చూచేతన చూపులను ఒక్కక్షణమైనా మరొక వైపు మరలించదు.

వ్యాఖ్య : రుక్మిణీ దేవి మనో విరహ వర్ణన.

కృష్ణుని యందే మనస్సు మగ్నమైనది కాబట్టి రుక్మిణి మాటాడదు. నవ్వదు, దేహబాధ నెరుగదు, నిద్రపోదు, సమాధియోగమందున్న వ్యక్తికి ఇంద్రియవ్యాపారం సన్నగిల్లుతుంది కదా!

బిడ్డలు తమకు కలిగిన బాధలను కన్నతల్లితో చెప్పుకోవడం లోకంలో కనబడుతుంది. ఆడబిడ్డలకు తల్లి దగ్గర ఉన్నంత చనవు తండ్రి దగ్గర ఉండదు.

"అమ్మా! నేనొకరిని ప్రేమించానే" అని తల్లికైనా చెప్పడానికి సాధారణంగా ఆడపిల్లలకు సిగ్గుమొగ్గలేయడం వల్ల చెప్పుకోరు. ఇక రుక్మిణి, తమ పెద్దలు అధమాధమునికి తనను అంటగడుతున్నారని బాధపడుతూ, తెగించి, రహస్యంగా శ్రీకృష్ణభగవానుణ్ణి తనను పాణి గ్రహణం చేసుకోవడానికి పిలుచుకొని రావలసినదని గురువును పంపింది. సుముహూర్తం దగ్గర పడుతున్నా శ్రీకృష్ణుని పొడ, జాడ తనకు కనబడనందువల్ల, శ్రీకృష్ణునితో తనకు దాంపత్యయోగం ఉందో లేదో అనే సందిగ్ధావస్థలో ఉంది రుక్మిణి. ఈ ముగ్ధకు కలిగిన దుగ్ధను దూరం చేసేవాడు ఆ గురువే, ఆ భగవానుడే. కాబట్టి, రుక్మిణీ దేవి సమస్యను తల్లికాదు కదా, ఎవ్వరూ పరిష్కరించలేరు. ఎంత అందాలరాశియైనా, ఇట్టి నిర్వేదస్థితిలో రుక్మిణికి మందహాసమెందుకుంటుంది? విచ్చీ విచ్చని పెదవుల్లోంచి పల్మోనల కాంతి, వెన్నెల లాగా పలు దెసల ఆవరించడంలేదు. భ్రమరాలుపద్మపరిమళాన్ని పసిగట్టి వచ్చి మూగుతుంటాయి. రుక్మిణీ దేవి, ముఖమే పద్మమని భ్రాంతితో మూగే రోలంబాలను రొప్పడం లేదు. ఆమెకు నిద్ర పట్టడమూ లేదు. వక్షోజాల మధ్య ఒక్కటిగా పెనవేసుకొన్న హారాల చిక్కునూ విప్పదు. ఎందుకు? ఆమె చూపులు కృష్ణుడు వచ్చే దారియందే నిల్చి యున్నాయి. కవిక్రాంత దర్శి గదా! ఇవన్నీ వ్యభిచారభావాలే.

దరహాసాన్ని చంద్రికగానూ, వక్త్రాన్ని తామరసంగానూ - ఉపమేయాన్ని ఉపమానమందు ఆరోపించడం వల్ల రూపకాలంకారం. ముఖం పద్మమనే భ్రాంతిచే తుమ్మెదలు మూగడం భ్రాంతి మదలంకారం. దేని మీద ధ్యాస లేకపోవడానికి కృష్ణ మార్గగత వీక్షణమే హేతువు.

ఈ పద్యం కూడా ద్విప్రాసగల ఉత్పలమాలావృత్తమే.

**తుడువదు కన్నులన్ వెడలు తోయకణంబులు, కొప్పు జక్కగా**
**ముడువదు, నెచ్చెలింగదిసి ముచ్చటకుంజన దన్నమేమియున్**
**గుడువదు, నీరమున్ గొనదు, కూరిమి కీరము జేరి పద్యమున్**
**నొడువదు, వల్లకీ గుణ వినోదము సేయదు, డాయదన్యులన్.** 37

అర్థం : కన్నులన్ = కన్నులనుంచి; వెడలు = కారుతున్న; తోయకణంబులు = నీటి బొట్లను; తుడువదు = తుడుచుకోదు; కొప్పున్ = కేశపాశాన్ని; చక్కగాన్ = అందంగా; ముడువదు; నెచ్చెలిన్ = ప్రియమైన స్నేహితురాలిని; కదిసి = చేరి; ముచ్చటకున్ = మాటలాడడానికి; చనదు = పోదు; అన్నము; ఏమియున్ = కొంచెమైనా; కుడువదు = తినదు; నీరమున్ = నీళ్ళైనా; కొనదు = త్రాగదు; కూరిమి కీరమున్ = ప్రియమైన చిలుకను; చేరి = సమీపించి;

పద్యమున్, నొడువదు = చెప్పదు; వల్లకీ గుణ వినోదమున్ = వీణా తంత్రుల మీటే వేడుకను; చేయదు; అన్యులన్ = ఇతరులను; డాయదు = సమీపించదు.

తా : రుక్మిణీదేవి తన కన్నీళ్ళనూ తుడుచుకోదు; కొప్పును అందంగా ముడుచుకోదు. తన స్నేహితురాలి దగ్గరికి పోయి సంభాషించదు, అన్నం తినదు, నీళ్ళు త్రాగదు. పెంచిన చిలుకకొక్క పద్యమైనా చెప్పదు. వేడుకగా వీణాతంత్రులను మీటదు. ఎవరి దగ్గరికీ పోదు.

వ్యాఖ్య : కృష్ణుని దర్శన స్పర్శనలకోసం ప్రతీక్షిస్తున్న రుక్మిణీదేవి విషణ్ణచిత్తయైన వర్ణన.

జీవితంలో చేయవలసిన పనిని చేయకపోతే సజ్జనులు కోపిస్తారు. "కర్తవ్య మకృతంకార్యం సతాం మన్యుముదీరయేత్" (రామాయణం).

"యత్నే కృతే యది నసిద్ధ్యతి కో౽త్ర దోషః" -ప్రయత్నించినా ఫలించకపోతే దోషం ఉండదు - అని చేతులు దులుపుకోవచ్చు. కాని, రుక్మికి తగవు - న్యాయం - లేదని, రుక్మిణీదేవి తన జీవితేశుని కోసం తానే తగిన యత్నం చేసింది. తీరా, సమయానికైనా తన యత్నం సిద్ధించేసూచన కనబడకపోతే కన్నియ మనస్సు బెడదతో కన్నీళ్ళ పర్యంతమయింది. శ్రీకృష్ణుని మీద పెల్లుబికిన అనురాగం ఆయన దర్శనం కానందువల్ల విరహంగా పరిణమించింది. దర్శనానికి ఒక పరికరమైన విషాదం అనుభవిస్తున్నది. విషాదం, శోకం కర్తవ్యాన్ని మరపిస్తుంది. కాబట్టి, కారేకన్నీళ్ళను కూడా తుడుచుకోలేకుండా ఉన్నది రుక్మిణీదేవి. విడిపోయిన కొప్పును ముడుచుకోదు. నెచ్చెలిని చేరి ముచ్చటించదు. ఆమెకు ఆకలి వేయదు. దప్పికాదు. ముద్దుగా పెంచిన చిలుకకు పద్దియం నేర్పాలన్న జ్ఞాపకమే లేదు. విరహవేదనలో వీణపై స్వరాలను పలికించాలనే భావమే కలుగదు. ఒంటరిగా పరితపించడమే తప్ప నలుగురితో చేరి యుండాలనిపించడం లేదు. ఈ చిత్తవృత్తులనే శృంగార రసపరమైన వ్యభిచారి లేదా సంచారి భావాలంటారు. వ్యతిరేకార్థక క్రియా పదాలు పాదాదులందు గల పద్యాల వరుసలో ఇది మూడవ పద్యం. రుక్మిణీ దేవి స్థితిని ఉన్నదున్నట్లు వర్ణించడం వల్ల స్వభావోక్త్యలంకారం. ఈ పద్యం త్రిప్రాసగలిగిన చంపక మాలావృత్తం.

**మృగనాభియలదదు మృగరాజమధ్యమ**
**జలములనాడదు జలజగంధి**
**ముకురంబు జూడదు ముకురసన్నిభముఖి**
**పువ్వులు దుఱుమదు పువ్వుబోణి**

**వనకేళి గోరదు వనజాతలోచన**
**హంసంబు బెంపదు హంసగమన**
**లతల బోషింపదు లతికాలలితదేహ**
**తొడవులు దొడవదు తొడవుతొడవు**
**తిలక మిడదునుదుట దిలకినీ తిలకంబు**
**గమల గృహము జొరదు కమల హస్త**
**గారవించి తన్ను, గరుణగైకొన వన**
**మాలిరాడు తగవు మాలియనుచు.** 38

అర్థం : వనమాలి = వనమాలాధారియైన కృష్ణుడు; తన్నున్ = తనను; గారవించి = మన్నించి; కరుణన్ = దయతో; కైకొనన్ = చేకొనడానికి; తగవుమాలి = న్యాయాన్ని వీడి; రాడు+అనుచున్ = ఇకరాడంటూ; మృగరాజమధ్యమ = సింహంయొక్క నడుమువంటి నడుముగల రుక్మిణీదేవి; మృగనాభి = కస్తూరిని; అలదదు = పూసుకోదు; జలజగంధి = కమలాల పరిమళం లాంటి దేహ పరిమళం గల రుక్మిణీదేవి; జలములన్ + ఆడదు = స్నానం చేయదు; ముకురసన్నిభముఖి = అద్దాన్ని బోలిన ముఖం గల రుక్మిణీదేవి; ముకురంబున్ = అద్దాన్ని; చూడదు = చూచుకోదు; పువ్వుబోణి = పువ్వులాంటి శరీరం గల రుక్మిణీదేవి; పువ్వులు = పువ్వులను; తుఱుమదు = కొప్పున పెట్టుకోదు; వనజాతలోచన = తామరల వంటి కన్నులుగల రుక్మిణీదేవి; వనకేళిన్ = వనవిహారాన్ని; కోరదు = అపేక్షించదు; హంసగమన = హంసనడకలాంటి నడక గల రుక్మిణీదేవి; హంసంబున్ = హంసను; పెంపదు = సాకదు; లతికా లలిత దేహ = తీగలాగా మనోహరమైన శరీరం గల రుక్మిణీదేవి; లతలన్ = తీగలను; పోషింపదు = పెంచదు; తొడవు తొడవు = భూషణాలకు భూషణమైన రుక్మిణీదేవి; తొడవులున్ = నగలను; తొడవదు = ధరించదు; తిలకినీ తిలకంబు = తిలకం పెట్టుకొనేస్త్రీలలో శ్రేష్ఠురాలైన రుక్మిణీదేవి; నుదుటన్ = నొసటి యందు; తిలకము = బొట్టును; ఇడదు = పెట్టుకోదు; కమల హస్త = కమలాల వంటి చేతులు గల రుక్మిణీదేవి; కమల గృహమున్ = లక్ష్మీదేవి మందిరంలోకి; చొరదు = ప్రవేశించదు.

తా : కృష్ణమూర్తి న్యాయంగా తననుమన్నించి, దయతో పెండ్లాడడానికి ఇక రాడని సింహమధ్యయైన రుక్మిణీదేవి కస్తూరిని పూసుకోదు. తామరసగంధి స్నానంచేయదు. ముకుర సమాన ముఖి అద్దమూ చూచుకోదు. పువ్వుబోణి పూలను తుఱుమదు, వనజనేత్ర వనవిహారం చేయదు. హంసగమన హంసలను పెంచదు. లతాసదృశదేహ లతలను పోషించదు. సొమ్ములకు సొమ్మైన రుక్మిణీదేవి సొమ్ములను పెట్టుకోదు. తిలకి నులకుతిలకం తిలకమూ పెట్టుకోదు. పద్మహస్త పద్మగేహాన్ని ప్రవేశించబోదు.

వ్యాఖ్య : శ్రీకృష్ణమూర్తిని పొందగోరే వ్యామోహంవల్ల రుక్మిణీదేవి నిత్యకృత్యాలను మానుకొన్నవర్ణన. కలిసిన తర్వాత కలిగిన ఎడబాటు వలని బాధ కన్నా, కంటితో తాను కననివాణ్ని, విన్నంత మాత్రాననే తన కాంతునిగా పొందాలని ఆశ పడుతున్న మనో వ్యథ ఎన్నో రెట్లు మిన్న. "తతో_ప్యాశామహీయసీ." ఆశ అన్నిటికంటె గొప్పది కదా! పర్వతమే ఉన్నతమైన దనుకొంటే దాన్ని తన పొట్టలో దాచుకొన్న సముద్రం అంతకంటె గొప్పది. ఘన ద్రవాది ద్రవ్యరాశులను ఆవరించియున్న ఆకాశం మరీ గొప్పది. ఆకాశం కంటే పరబ్రహ్మగొప్పవాడు. ఆ పరబ్రహ్మను కూడా తనకొంగున ముడి వేసుకోవాలనే ఆశ వస్తుతః ఎంత గొప్పదో! అంత గొప్పదైన ఆశ సన్నగిల్లుతుంటే, అనిత్యమైన తన శరీరం మీద మోహం మోసులెత్తదు కదా! రాజాంతఃపురకన్యలు పొద్దు గడవడానికి నిత్యం కొన్ని పనులను చేస్తుంటారు. రుక్మిణీదేవి ప్రతిదినం అనుష్ఠించి, ఇపుడు మనోవేదనతో మానుకొన్న చేష్టితాల పట్టిక పద్యంలో ఉంది. పద్యంలో సొగసూ ఉంది. మృగరాజమధ్యమ మృగనాభి అలదదు. సింహమధ్యయైన కథానాయిక కస్తూరి పూసుకోదు అని అర్థం.

సింహం యొక్క నడుము వలె సన్నగా నడుము ఉన్న తన దేహానికి కస్తూరిని మునుపటి రీతిగా పూసుకోవడం లేదు అనడంలో రుక్మిణీదేవి అంగసౌందర్యం ధ్వనిస్తున్నది. మానసిక వ్యథ కూడా వెల్లడి అవుతున్నది. నాయిక నడుముకు సింహాన్ని కాక దాని నడుమును ఉపమానంగా చెప్పి సన్నదనాన్ని నిదర్శనంగా చూపే అర్థాలంకారమూ ఉంది. నడుముకు నాభికి నైకట్యమున్నా అర్థాలంకారం వెలవెలబోతున్నది. అర్థాలంకారం కంటె శబ్దాలంకారమే సహృదయ హృదయావర్జకంగా ఉంది. రుక్మిణి మృగరాజమధ్య. మృగనాభి అంటె మృగమదం - కస్తూరి అనే పరిమళ ద్రవ్యం. మృగమంటే లేడి. కస్తూరీ మృగం లేడి తెగలోని విశేషజంతువు. కస్తూరీ మృగం యొక్క నాభికి పట్టిన కొవ్వు రాలిపోతూ ఉంటుంది. ఆ కొవ్వే - ఆ మదమే కస్తూరి. ఆటవికులు - గిరిజనులు అడవిలో చాకచక్యంగా ఆ పరిమళద్రవ్యాన్ని సంపాదించి వ్యాపారంతో జీవిస్తారు. అది మృగరాజు, ఇది సామాన్య మృగం. అయినా మృగనాభిసాదరంగా లేపనీయం. ఇక్కడి సౌందర్యం శబ్దాలమార్పును (పరివృత్తిని) సహించదు. "శబ్దం వినానైవ కద్యా_పి తేజః" అర్థం నిస్తే జమవుతుంది. కాబట్టి, అర్థాలంకారం కూడా యమకమనే శబ్దాలంకారాన్నే శోభింపజేస్తున్నది.

జలజ-పద్మ గంధం లాగా కమ్మని వాసన ఉన్న దేహం కలది రుక్మిణీదేవి. జలముల నాడదు. మురికి పట్టి కంపు కొట్టితే కదా స్నానం చేయాలి. ఉపమేయ మందే ఉపమాన ప్రయోజనం సహజంగా ఉన్నప్పుడు, ఉపమాన వస్తూత్పత్తికీ, ఆశ్రయమైన జలకా లాడకపోవడం ప్రతీపాలంకార లక్షణం. కాని, జలాల యందాడితేనే జలజానికి వికాసం కదా! కమ్మని వాసన లీనే సొగసైన దేహం గల రుక్మిణి స్నానం మానివేయడం మనోవ్యథను సూచిస్తుంది. జలజగంధం వంటి గంధం కలది అనే పదం నిదర్శనాలంకార లక్షితం. ఈ అర్థాలంకారం అడుగున ఉండి 'జల-జలజ' అనే పదాల సొహళింపు గల ఛేకానుప్రాసమనే శబ్దాలంకారాన్ని జగజగ మెరిపిస్తున్నది.

ముకుర సన్నిభముఖి రుక్మిణి - అద్దం లాగా నిద్దమైన కాంతులతో ముద్దులొలికే మోము కలది. అద్దంలో తనను చూచుకోదు. ముకురం చూడకపోవడానికి ముకుర సన్నిభ ముఖముండడం హేతువు కాదు. అంత నైగనిగ్యమున్నా, వేదనా తీవ్రత వల్ల తన అందాన్ని చూచుకోవాలని డెందం స్పందించక పోవడమే హేతువు అనే అర్థాలంకారానికి ప్రాధాన్యం లేదు. అలాగే పువ్వులు దుఱుమదు పువ్వుబోణి అనే మాటకూడా అట్టిదే. ఈ రెండు మాటల్లో ఛేకానుప్రాసానికే ప్రాధాన్యమున్నది. 'వన కేళి గోరదు వనజాతలోచన' - అనే మాటలోని 'వన' శబ్దానికి 'తోట, నీరు' అని శ్లిష్టార్థముంది. కాబట్టి 'యమకం' చమకింది.

హంసగమన - అంచల నడక కంటె అతిశయించిన నడక కలది. కాబట్టి హంసలకు నడకనేర్పడానికి వాటిని పోషించే రుక్మిణి మనఃక్షోభవల్ల పెంచకపోవడం లోకులకు విపరీత లక్షణంగా ద్యోతకమవుతున్నది. ప్రసాద గుణశోభితమైన ఈ మాట ఛేకం. 'లతల బోషింపదు లతికాలలిత దేహ' ఛేకమే. 'తొడవులు తొడవదు తొడవుతొడవు' అలంకారాలకే అలంకారంగా ఉన్నది రుక్మిణి. కృష్ణుని భోగానుభవానికి కొరగానిదని దేహానికి నగలను తొడగడం లేదు. రూపకాతిశయోక్త్యలంకారం. అర్థభేదమున్న పదాల అనేకావృత్తి కలిగిన యమకాలంకార, లాటానుప్రాసాలంకారాలకు ఘటకంగా ఉంది.

'తిలక మిడదు నుదుట దిలకినీతిలకంబు' - తిలక శబ్దంలో బొట్టు, శ్రేష్ఠమనే తాత్పర్య భేదముండడంవల్ల యమకం. పదావృత్తి చేత వృత్త్యను ప్రాసాలంకారం.

'కమల గృహముజొరదు కమలహస్త' - రుక్మిణి కమల హస్త. ఆమె చేతులు కమలాలలాగా ఎఱ్ఱగా, మృదువుగా, నున్నగా ఉన్నాయి. ఉపమాలంకారం, కమల

గృహము జొరదు - కమలాలకు ఇల్లైన సరస్సులోకి జలక్రీడకోసం ప్రవేశించదు అనే అర్థమూ ఉంది. కాని పునరుక్తి కారాదు కదా! 'కమలాశ్రీహరిప్రియా' (అమరం). లక్ష్మీదేవి మందిరానికి పూజకోసం పోవడం లేదు. అందమైన చేతులతో భగవతిని ఆరాధించడమే సార్థకత. కాని ఇప్పుడు దేవీ పూజ చేయడం కూడా మానివేసింది. ఛేకానుప్రాస. మూడవ పాదంలో వృత్త్యనుప్రాసం ఉంది. నిత్యానుష్ఠానం మీద దృష్టి లేక పోవడానికి 'గారవించి తన్ను గరుణగైకొన వనమాలి రాడు తగవు మాలి' అన్న భావనయే హేతువు. చివరి పాదంలోని యమకమే తమకాన్ని పెంచింది.

"అర్థాభిధానానుపయోగినామప్యను ప్రాసాదీనాం రసాదీన్ ప్రతివ్యంజకత్వం కేవల కావ్య శబ్దనినిష్ఠేనైవ తచ్చర్వణా దృశ్యతే" అని అభినవ గుప్త పాదులు చెప్పినరీతిగా, అప్రయత్నంగా కవికి సిద్ధించిన శబ్దాలంకారాలే ఆట వెలదితో కూడిన ~~ఈ~~ సీసపద్యంలో అర్థాలంకారాలకన్న కమనీయాలై, అయోగ విప్రలంభ శృంగార రస భావాలకు వ్యంజకాలుగా ఉన్నాయి.

వ : **మఱియును**

**మలగున్ మెల్లని గాలికిన్ బటు నటన్మత్త ద్విరేఫాళికిన్**
**దలగున్ గోయిల మ్రోతకై యలగు నుద్యత్కీర సంభాషలన్**
**గలగున్ వెన్నెల వేడిమిన్ మలగు మాకందాంకురచ్ఛాయకున్**
**దొలగున్ గొమ్మ మనోభవానల శిఖాదోధూయ మానాంగియై.** 39

అర్థం : కొమ్మ = రుక్మిణి; మనో-గియై! మనస్+భవ = మనస్సున జనించిన, మన్మథుడనే; అనలశిఖా = అగ్నియొక్క జ్వాలల చేత; దోధూయమాన = చలింపజేయబడుతున్న; అంగియై = దేహం కలదై; మెల్లని గాలికిన్ = పిల్లగాలికి; మలగున్ = చలించును. పటు-ఫాళికిన్; పటు = బలంతో; నటత్ = నాట్యంచేస్తున్న; మత్త = మదించిన; ద్విరేఫ = తుమ్మెదలయొక్క; ఆళికిన్ = పంక్తికి - సమూహానికి; తలగున్ = తొలగిపోవును. కోయిల మ్రోతకై = కోకిలధ్వనికి; అలగున్ = ఉలికి పడును. ఉద్యత్ - షలన్; ఉద్యత్ = పుట్టుతున్న; కీర = చిలుకలయొక్క; సంభాషలన్ = పలుకులచేత; కలగున్ = కలత పడును. వెన్నెల వేడిమిన్ = వెన్నెలకాక చేత; మలగున్ = తాపపడును. మాకందా - కున్; మాకంద = తియ్యమామిడి యొక్క; అంకుర = మొక్కల యొక్క; ఛాయకున్ = నీడకు; తొలగున్ = దూరంగా పోవును.

తా॥ రుక్మిణి మన్మథాగ్ని జ్వాలలకు తాళలేనిదై పిల్లగాలుల చలిస్తున్నది. తుమ్మెదల రొదల అదరుతున్నది. కోయిల కూతలకు ఉలికి పడుతున్నది. చిలుకపలుకులకు

బెదిరిపోతున్నది. వెన్నెల కాకకు మల్కమల పడుతున్నది. తియ్యమామిడి చెట్టు నీడకు దూరంగా తొలగిపోతున్నది.

వ్యాఖ్య : ప్రకృతి పెంచే ప్రేమజ్వరానికి రుక్మిణి తల్లడిల్లుతున్న వర్ణన.

ప్రేయసీ ప్రియులకు మనసులో కలిగే కామ వికారాదులను మన్మథావస్థ అంటారు. మన్మథుడు కామదేవుడు. అతడు మనోభవుడు. మనస్సులో పుట్టిన వాడని అర్థం. అతనిది చిలుకల రథం. అతని విల్లు చెఱకుగడ. ఆవింటినారి తుమ్మెదలబారు. అతని బాణాలు పువ్వులు. పువ్వులు కొమ్మయందేఉంటాయి. వసంతుడే అతని స్నేహితుడు. కాబట్టి, మందమారుతం - అంటే పిల్లతెమ్మెరలు, కోకిలలు, వెన్నెల, రసాల సాలములు అంటే తియ్యమామిడిచెట్లు మన్మథునికి సహకారులు. ప్రకృతిలోని మనోజ్ఞమైన వస్తువులే మనోభవుని పరివారం. ఇష్టమైన వస్తువులనే, మనస్సు ఆందోళన చెందినప్పుడు మాత్రం, ఇష్టపడక పోవడం లోక పరిపాటి. వాటిని సహించక దూరంగా ఉండడం కూడా ప్రకృతి సిద్ధమే.

మదనావస్థకు లోనైన రుక్మిణి 'కొమ్మ' అని పేర్కొనబడింది. విరహతాపమే మన్మథాగ్ని. కొమ్మ మదనాగ్ని యొక్క మంటలకు చిటపటలాడుతున్నది. పిల్లగాలులకు వణకుతున్నది. ద్విరేఫం అంటే రెండు 'ర' వర్ణకాలున్న పదం - భ్రమరం. ఝుంకారనాదంతో పాటు చరించేది తుమ్మెద. సీతావిరహస్వాంతు డైన రాముడు లక్ష్మణునితో తేనెవాసనలు గ్రమ్మే వనాలలో గాలిచే కదలింపబడిన ఈచెట్లు తుమ్మెదల రొదలచేత నినదిస్తున్నట్లున్నవి అన్నాడు.

"అమీ పవన నిక్షిప్తానినదంతీవ పాదపాః।
షట్పదైరనుకూ జంతోవనేషు మధుగంధిషు॥"

కాబట్టి ఝుంకారనాదం విరహోద్దీపకం. జుమ్మని మ్రోగుతూ ఇటు - అటు తిరిగే తుమ్మెదల రొదకు అదరుతున్నది. కోయిల కూతను వినగానే దాన్నిమనం కవ్వించి, మళ్ళీ మళ్ళీ కూయించి వినగోరుతుంటాం. కాని, రుక్మిణి విరహిణికాబట్టి, కోయిలకూతకు జంకుతున్నది. చిలుక పలుకులకు ఉలికి పడుతున్నది. వెన్నెల సెగకు వేగిపోతున్నది. లేత ఎరుపు చిగుళ్ళు, పచ్చని ఆకులు, కమ్మని పూలు, తియ్యని పండ్లతో నిండియుండే గున్నమామిడి చెట్టునీడకు ఓర్వక ఎడమవుతున్నది.

చల్లని పిల్లగాలి, జుమ్మని మ్రోయుతుమ్మెదల పంక్తి, కోకిల కలకూజితం, చిలుక పలుకు, వెన్నెల చలువ, మామిడినీడ వివిధ జనులకాహ్లాదాన్ని కలిగిస్తే, విరహులకు

మదనభావాలను ఉద్దీపింప జేస్తాయి. ప్రకృతం, రుక్మిణి మానసిక వ్యవస్థ వేదనాపూరితమైయున్నది. తద్ధర్మార్థక క్రియలతో, ద్విప్రాసగల ఈ పద్యం మత్తేభవిక్రీడిత వృత్తం.

**వ : ఇట్లు హరిరాకకెదురు చూచుచు, సకల ప్రయోజనంబులయందును విరక్తయై, మనోజానలంబునం బొగిలెడి మగువకు శుభంబు చెప్పు చందంబున వామోరులోచన భుజంబులదరె. అంత గృష్ణునియోగంబున బ్రాహ్మణుండు సనుదెంచిన, నతని ముఖ లక్షణంబుపలక్షించి, యాకలకంఠి మహోత్కంఠతోడనకుంఠితయై, మొగంబునంజిఱునగవు నిగుడ, నెదురుచని నిలువంబడిన, బ్రాహ్మణుండిట్లనియె.**

అర్థం : సకల ప్రయోజనంబులయందును = అన్ని పనులయందు కూడా; విరక్తయై = ఆసక్తి లేనిదై; మనోజ + అనలంబునన్ = మన్మథాగ్నియందు; పొగిలెడి = తపించునట్టి; మగువకు = స్త్రీకి-రుక్మిణికి; శుభంబు చెప్పు చందంబున = మంచి వార్త చెప్పే విధంగా; వామ+ఊరు, లోచన, భుజంబులు = ఎడమతొడ, ఎడమకన్ను, ఎడమ భుజము; అదరె = కదలెను. కృష్ణు నియోగంబున = కృష్ణుని అనుమతిచేత; సనుదెంచినన్ = వచ్చినందువల్ల; ముఖలక్షణంబు = ముఖచిహ్నం; ఉపలక్షించి = చూచి; ఆ కలకంఠి = అవ్యక్తమధురస్వరంగల కోకిలకంఠం వంటి కంఠం కలిగిన ఆ రుక్మిణీ దేవి; మహా+ఉత్కంఠతోడన్ = గొప్పవేడుకతో; అకుంఠితయై = మొక్కవోనిదై; వికాసంకలదై; నిగుడన్ = వ్యాపించగా;

తా॥ ఈ రీతిగా కృష్ణమూర్తి రాకకోసం ప్రతీక్షిస్తూ, పనులన్నీ మానుకొని మదన తాపంచేత తపించే రుక్మిణికి శుభసూచకాలో అన్నట్లు ఎడమతొడ, కన్ను, బుజాలదరినాయి. ఆసమయానికే కృష్ణుని సెలవు దీసుకొని వచ్చిన అగ్నిద్యోతనుని ముఖలక్షణాన్ని గమనించి, ఉత్సాహంతో చిన్నగా నవ్వుతూ, ఎదురుగా పోయి నిలిచింది. అప్పుడా విప్రుడు రుక్మిణీదేవితో, చెప్పబోయేరీతిగా పలికాడు.

వ్యాఖ్య : వామలోచనలకు వామోరులోచన భుజాలదరడం శుభసూచకం. స్త్రీలకు ఎడమభాగం, పురుషులకు కుడిభాగం అదరితే శుభ ఫలం వెంటనే కనబడుతుంది. కాబట్టి శుభశకునాలని పేరు.

"వామ ఊరుర్భుజోనేత్రమస్ఫురన్ ప్రియశంసినః" అని శ్రీవ్యాసమహర్షిసూక్తి. రామాయణం సుందరకాండ (39)వ సర్గలో సీతాదేవికి ఎడమకన్ను, ఎడమభుజం, ఎడమతొడ సంచలించిందని శ్రీవాల్మీకి మహర్షి చెబుతూ, **"శుభాంనిమిత్తాని శుభానిభేజిరే, నరంశ్రియా జుష్టమివో పజీవినః"** అన్నారు. రాజును ఆశ్రయించి

రాజభటులనే గౌరవాన్ని సంపాదించుకొనే విధంగా, (శుభశకునాలు) తమ ఉజ్జీవనార్థం సీతాదేవిని ఆశ్రయించి శుభశకునాలని పేరు పొందినవట. అట్లే (ప్రియశంసినః) సాక్షాత్తుగా లక్ష్మియైన రుక్మిణీదేవికి శుభాన్ని సూచించి ఆపేరును నిల్పుకోవడం 'శుభంబు చెప్పుచందంబున'' మాటచేగమనీయం.

**మెచ్చె భవద్గుణోన్నతి కమేయధనాదులనిచ్చె నాకు, దా**
**వచ్చె సుదర్శనాయుధుడు వాడెసురాసురులెల్లనడ్డమై**
**వచ్చిననైన రాక్షసవివాహమునన్ గొనిపోవునిన్ను నీ**
**సచ్చరితంబు భాగ్యమును సర్వము నేడు ఫలించెగన్యకా॥** 40

అర్థం : కన్యకా = ఓ రుక్మిణీ! సుదర్శన+ఆయుధుడు = సుదర్శనం అనే చక్రం ఆయుధంగా కల కృష్ణుడు; భవత్+గుణ+ఉన్నతికిన్= నీ గుణాలగొప్పతనానికి; మెచ్చెన్ = మెచ్చుకొన్నాడు. నాకున్; అమేయధన+ఆదులన్ = లెక్కపెట్టలేని ధనం, మొదలైనవాటిని; ఇచ్చెన్; తాన్ = తాను, వచ్చెన్ = (ఇక్కడికి) వచ్చాడు. వాడె = అతడే; సుర+అసురులు+ఎల్లన్ = దేవతలూ, దానవులూ, అందరు; అడ్డమై వచ్చిననైనను = విరోధించడానికి వచ్చినప్పటికీ; నిన్ను; రాక్షసవివాహమునన్ = రాక్షసవివాహ ప్రకారంగా; కొని పోవున్ = తీసుకొనిపోతాడు. నీ సత్+చరితంబు = నీమంచి నడవడి; భాగ్యమును = అదృష్టంకూడా; సర్వము = అంతా; నేడు; ఫలించెన్ = పండింది.

తా॥ ఓ కన్యకా! రుక్మిణీ! సుదర్శనాయుధుడైన కృష్ణభగవానుడు నీ గొప్పగుణాలను మెచ్చుకొన్నాడు. నాకు ధన ద్రవ్యరాసుల నిచ్చాడు. తానిక్కడికి వచ్చాడు. దేవదానవులందరూ కలిసి అడ్డుపడినా నిన్ను రాక్షస వివాహపద్ధతిలో తీసుకొని పోతాడు. నీ మంచి నడవడి, అదృష్టం, అంతా ఈ నాడు ఫలించింది.

వ్యాఖ్య : శ్రీకృష్ణుడు వచ్చాడని బ్రాహ్మణుడు రుక్మిణీదేవితో పలికిన పద్యం.

అగ్నిద్యోతనుడు వైదర్భిజీవితాన్ని నిర్భరంగా నిలిపే మాటలను పలికాడు. "అవసరపతితావాణీ గుణగణరహితాऽపి వహతి పరమోదమ్" అక్కరకు వచ్చే మాట అందంగా లేకున్నా, జనామోదాన్ని పొందుతుంది.

కృష్ణునికి పర్యాయంగా 'సుదర్శనాయుధుడు' అనే పదాన్ని పేర్కొన్నాడు. ఈ కల్యాణకథా శిల్పానికి ఇది ప్రాణం లాంటిది. శ్రియః పతికిసుదర్శనం ఆభరణంగానూ, ఆశ్రితజన రక్షణకు ఆయుధంగానూ ఉంటుంది.

"కింతత్ సుదర్శనంనామ కశ్చశబ్దార్థఉచ్యతే" - ఒకప్పుడు నారదుడు సుదర్శనమంటె ఏమి? ఆ శబ్దంయొక్క అర్థమేమి? అని పరమేశ్వరుణ్ని అడిగాడు. ఆయనబోధించిన విధమిలా ఉంది.

"తస్యస్యామితి సంకల్పోభావతో౾ భావతో౾ పివా
స్వాతంత్ర్యానుయోజ్యేన రూపేణ పరివర్తతే।
యత్తత్ప్రేక్షణ మిత్యుక్తం దర్శనం తత్ ప్రగీయతే।
వస్తుతః కాలతో దేశాత్ తస్యత్వవ్యాహతిర్హియా।
పూజాసాతుసుశబ్దార్థః తత్సుదర్శన మీర్యతే (అహిర్బుధ్న్యసంహిత)

'దర్శన' శబ్దానికి శ్రీమహావిష్ణువు యొక్క సంకల్ప రూపమైన ఈక్షణం, అని అర్థం. ఆవీక్షణమే చేతనా చేతన రూపంగా పరిణమించడానికి కారణమయింది. ఆదర్శనానికి విషయకాల దేశపరిమితులు లేవు, అనడమే 'సు' శబ్దంయొక్క అర్థం. అదేసుదర్శనం.

మనస్సే చక్రాయుధమని చెప్పింది విష్ణుపురాణం. మనస్సున పుట్టేది సంకల్పం. భగవానుని సంకల్పరూపమే సుదర్శన చక్రాయుధమని విశదమవుతున్నది.

"విశ్వం విశ్వంభరాఢ్యం రథవదధిపతేః లీలయా పాలయంతీ" (సుదర్శనశతకం) విశ్వంభరుని చేతిలోని సహస్రారశిఖాతి తీవ్రమైన సుదర్శనచక్రం, కాలచక్రాన్ని త్రిప్పుతూ మూడులోకాలను అజ్ఞానాంధకారాన్ని తరిమివేసి కాపాడుతుంది.

"కాలశక్కరత్తానుక్కే" అని ఆళ్వార్లశ్రీసూక్తి.

"పవిత్రమిత్యగ్నిః అగ్నిర్వైసహస్రారః, సహస్రారోనేమిః,
నేమినాతప్తతనూః, బ్రహ్మణఃసాయుజ్యం సలోక
తామాప్నోతి" - శ్రీసుదర్శన చక్రతప్తమైన దేహంగల

జీవుడు పరబ్రహ్మసాయుజ్యాన్ని పొందుతాడు. ఇలా, వేదశాస్త్రే తిహాసపురాణాలు సుదర్శన చక్రవైభవాన్ని ప్రశంసించాయి.

లీలామానుష విగ్రహుడైన కృష్ణభగవానుడు మాత్రమే సుదర్శనాద్యాయుధాలను ధరించిన చతుర్భుజుడై ఆవిర్భవించాడు. ద్వాపరయుగంలోనే రాక్షసులు క్షోణీశులుగా ఉద్భవించి భూభక్షకులయ్యారు. కాబట్టి, ద్వారకానాథుడు అనేక పర్యాయాలు సుదర్శన చక్రప్రయోగం తోనే భూభారాన్ని నివారించ వలసి వచ్చింది. ఈ రుక్మిణీ కల్యాణ ఘట్టంలోనూ కృష్ణుడు జగత్కల్యాణార్థమై 'వచ్చె సుదర్శనాయుధుడు' అన్నాడు అగ్నిద్యోతనుడు.

క్రియాసాపేక్షకలది జగత్తు. రామాయణంలో రామదూత 'దృష్టాసీతా' అని పలికినట్లు, అమ్మా! రుక్మిణి! 'మెచ్చె భగద్గుణోన్నతికి' అని మొదట సమాపక క్రియనే

ప్రయోగించి, ఆమె ఊపిరి బీల్చుకొనే విధంగా చిన్నచిన్న మాటలనే ముచ్చటగా పలికాడు. ఆ కృష్ణమూర్తి తనకు అనురూపమైన నీ స్వరూప రూప గుణవిభవైశ్వర్య శీలాద్యనేక కల్యాణగుణాల గణాన్ని మెచ్చుకొన్నాడు. అంతేకాదు; నీ సందేశాన్ని అందించిన నన్ను'బ్రాహ్మణోమమదేవతా' అన్నట్లు సత్కరించాడు. అమితమైన ధనాన్ని, రత్నహారాలను, సువర్ణ భూషణాలను, పట్టుబట్టలను నాకు బహుమానంగా ఇచ్చాడు. నిజంగా, కృష్ణపరంధాముని కృపకు పాత్రుడనయ్యానన్న సంతోషాన్ని ప్రకటించాడు విప్రుడు.

'నన్ను మెచ్చాడు, ధనాదులను నీ కిచ్చాడు. సందేశఫల మేమి తీసుకొని వచ్చావు?' అని రుక్మిణి అడుగక ముందే 'తావచ్చె సుదర్శనాయుధుడు' అన్నాడు విప్రుడు. "నేనొక్కడనే వచ్చానను కొంటున్నావా? కాదు; తానూ - కృష్ణుడుకూడా - సర్వసన్నద్ధుడై వచ్చాడు. దేవతలు, రాక్షసులు ఏకంగా ఎదురొడ్డినా వారిని అవక్రవిక్రమంతో పరాక్రమించే (సుదర్శన) చక్రాయుధుడూ నాతో కూడి విదర్భకువచ్చాడమ్మా! నిన్ను నీవు చెప్పినట్లే, తీసుకొని పోవడానికి సిద్ధంగా ఉన్నాడు. నీసచ్చరిత్ర, భాగ్యం, సర్వమీనాడు ఫలించిం"దని పలికాడు భూసురుడు, రుక్మిణిది సత్‌చరిత్ర. "సత్యేసాధౌ విద్యమానే ప్రశస్తే్యభ్యర్హితేచసత్" (నిఘంటువు) ప్రశస్తమైన నడవడికలది. కాబట్టి, "సతాంసద్భిఃసంగః కథమపిహి పుణ్యేనభవతి".

అన్నట్లు, సజ్జనులకు ఏవిధంగనో వారి సత్కర్మకలాపానుష్ఠానంవల్లనే సజ్జనులతో సహవాసం కలుగుతుంది.

"అతివీర్యవతీవభేషజే, బహురల్పీయసి దృశ్యతే గుణః"

ఔషధమాత్ర చిన్నదే అయినా, రోగాన్ని పోగొట్టే బలం కలిగియున్నట్లే, రుక్మిణి కన్యయైనా, వాఙ్మనఃకాయాలను సమర్పించి కృష్ణభగవానుణ్ని భర్తగా పొందే ఆత్మస్థైర్యం కలది.

"ఏకం సత్ విప్రా బహుధా వదంతి". ఒకే సత్తును వేదవిదులు అనేకంగా చెబుతారని శ్రుతి పలుకుతుంది. సత్త్వమయుడైన విష్ణువే కృష్ణుడు. ఆశ్రయించడానికి అవకాశమిచ్చే సౌలభ్యంఆయన కెంత కలదో, ఆశ్రయించినవారికి అన్ని ఫలాలనిచ్చే పరత్వమూ అంతే ఉంది.

"యేయథా మాంప్రపద్యంతే తాంస్తథైవభజామ్యహం" (భ.గీ.) తన కోరికను కృష్ణభగవానుడు నెరవేర్చగలిగే సచ్చరిత్ర, భాగ్యం కలది రుక్మిణీ దేవి. నేలవేల్పు "సర్వం

నేడు ఫలించెకన్యకా!'' అని మంగళాశాసనం చేయగానే, రుక్మిణీ దేవి ఆనందం అంబరాన్ని ముట్టింది. ఆ కన్నియ ఇక యదుభూషణుడు 'రుక్మిణీ ఘనకుచ ద్వంద్వైక భూషామణి'గా లబ్ధవర్ణుడవుతాడని సంబరపడింది. చకారద్విత్వప్రాసతో ఉత్సాహ జనక మైన వాక్యవిన్యాసంతో కథా శిల్పానికి జీవం పోసిన ఈ పద్యం వల్ల రుక్మిణీదేవి ఉత్పల మాలా భూషితయైనది.

వ : **అనిన వైదర్భియిట్లనియె.**

**జలజాతేక్షణుదోడి తెచ్చితివి నా సందేశమున్ జెప్పినన్**
**నిలువంబెట్టితి నీ కృపంబ్రతికిన్ నీయట్టి పుణ్యాత్మకుల్**
**కలరే దీనికి నీకు బ్రత్యుపకృతిన్ గావింపగానేర నం**
**జలిగా వించెద భూసురాన్వయమణీ! సద్బంధుచింతామణీ॥** **41**

అర్థం : భూసుర+అన్వయ మణీ = బ్రాహ్మణవంశశ్రేష్ఠుడా! సత్+బంధు చింతామణీ = సజ్జనులైన చుట్టాలలో చింతామణి వంటి వాడా! నా సందేశమున్ = నేను చెప్పి పంపిన వృత్తాంతాన్ని; చెప్పి; జలజాత+ఈక్షణున్ = కమలాల వంటి కన్నులు గల శ్రీకృష్ణుణ్ని; తోడి తెచ్చితివి = వెంటబెట్టుకొనివచ్చినావు; నన్ = నన్ను; నిలువన్+పెట్టితి = నిలిచేరీతిగా చేశావు. నీకృపన్ = నీదయతో; బ్రతికితిన్ = జీవించాను. నీయట్టి = నీ వంటి; పుణ్యాత్మకుల్ = పుణ్యాచిత్తులు; కలరే = ఉన్నారా? దీనికిన్ = ఈఉపకారానికి; ప్రతి+ఉపకృతిన్ = ప్రత్యుపకారాన్ని; కావింపగానేరను = చేయజాలను; నీకు; అంజలిన్ = నమస్కారం; కావించెదన్ = చేసెదను.

తా : యోగ్యులైన చుట్టాల కోరికలను చింతామణి లాగా నెరవేర్చే ఓ బ్రాహ్మణోత్తమా! నీవు కృష్ణునితో నా సందేశాన్ని చెప్పి ఆయనను తీసుకొని వచ్చి నన్ను కాపాడావు. నీ దయచే బ్రతికాను. నీ వంటి ధర్మాత్ములున్నారా? నీవు చేసిన ఈయుపకారానికి ప్రత్యుపకారం నేను చేయజాలను. నమస్కారంచేస్తాను.

వ్యాఖ్య : రుక్మిణీ దేవిచే అగ్నిద్యోతనునికి సవినయ కృతజ్ఞత ప్రకటితం.

అగ్నిద్యోతనుడు భూసురాన్వయమణి. సురలు - దేవతలు పూజనీయులు. వారు స్వర్గలోకంలో ఉంటారు. భూలోకంలో వేదశాస్త్రాలను అధ్యయనం చేసి, శబ్దబ్రహ్మోపాసనతో పరబ్రహ్మ సాక్షాత్కారాన్ని పొందే మహిమగలవారు భూసురులు. వీరు యోగ్యులకు జ్ఞానాన్ని బోధిస్తారు. సదాచారపరులు కాబట్టి లోకులను సుశిక్షితులను చేస్తారు. అధీతి బోధాచరణ ప్రచారణలచేత లోకశ్రేయస్కాములై

మనుజులను మనీషులు గా మలచి తరింపజేస్తారు. తత్ఫలితంగా, ఇట్టి వ్యక్తిత్వం కల్గిన బ్రాహ్మణులు భూలోక దేవతలు గా మాన్యులయ్యారు.

ఇలాంటి భూసురవంశంలో బ్రహ్మవిదుడై, మణిలాగా వెలుగుతూ సమాజంలో గొప్ప విలువగలవాడు అగ్నిద్యోతనుడు. 'మణి' శబ్దం శ్రేష్ఠవాచకం.

సద్బంధువులు అంటే, అక్కరకు వచ్చే చుట్టాలన్న మాట. "అస్తి బ్రహ్మేతి చేద్వేద, సంతమేనంతతో విదుః" అనే ఉపనిషద్వాక్య ప్రకారంగా, బ్రహ్మవిదులని భావం. వీరిలో శ్రేష్ఠుడు అగ్నిద్యోతనుడు. 'చింతామణి' శబ్దంకూడా శ్రేష్ఠవాచకమే. అయినా విశేషార్థమున్న శబ్దమది.

'మణి' పూజ్యమైనది. మణికి కోరికలుండవు. పూజించే వారికోరికలను దీరుస్తుంది.

"ఓమ్ నమ ఇత్యుపాసీత; నమ్యంత్యే_స్మైకామాః" (ఉపనిషత్)

ప్రణవోపాసనచేసే వారికి కోరికలన్నీ లొంగిపోతాయి. అంటే బ్రహోపాసకులైన మహానుభావులకు కోరికలు ఉండవు. భగవత్కామం తప్ప వేరే కామ్యాలుండవు. జగదుపకారులై, లోకుల కోరికలను మాత్రం పూర్తిజేస్తారు.

భగవత్కామం కల్గిన రుక్మిణీదేవి 'సద్బంధువు' అనవచ్చు. సద్బంధువైన రుక్మిణికోరికను 'చింతామణి'వలె పూర్తిగా నెరవేర్చినందువల్ల అగ్నిద్యోతనునికి ఆసంబోధన పదం అన్వర్థమయింది.

అగ్నిద్యోతనుడు ఇక్కడ గురుస్థానంలో ఉన్నాడు. గుర్వనుగ్రహంలేకుంటే దైవప్రాప్తిఅసాధ్యం. సరియైన జ్ఞానంకోసం 'సగురుమేవా భిగచ్ఛేత్" గురువు గారినే ఆశ్రయించాలి అని శ్రుతి చెబుతుంది. కేవలం బాహ్య వ్యాపారాలకు సంబంధించిన పశుపక్ష్యాదిశిక్షణనిచ్చే 'సర్కస్‌ఫీట్స్' నేర్పే-వారు పడే శ్రమకంటెను మానవుణ్ని మానవతతో ప్రవర్తించగలిగేవిధంగా శిక్షణనివ్వడంలో గురువులు - ఉపాధ్యాయులు పడే శ్రమచాలాగొప్పది. ఎందుకంటే, మానవునికిచ్చే శిక్షణలో బాహ్య ప్రవర్తనలతో పాటు వాని ఆత్మహితానికి ఆవశ్యకాలైన అభ్యంతరపు ప్రవృత్తులు కూడా అంతర్భవించి ఉంటాయి. కాబట్టి, అట్టి మహనీయులైన గురువులకు మాటలతో చెప్పరానంతటి మహత్త్వమున్నదని గుర్తింపవచ్చు.

ఇతరవిద్యల స్థితియే ఇలా ఉంటే, ఇక బ్రహ్మవిద్య - వేదాంతవిద్య ఎంత శ్రమసాధ్యమో గుర్తించాలి. అదికేవలం ఆచార్య కృపామాత్రాధీనమైయే ఉంటుంది.

ఎవరి అనువృత్తిని ఆపేక్షించని కృపామాత్రప్రసన్నులైన ఆచార్యులు - నారదులవారు ధ్రువ ప్రహ్లాద వాల్మీకి వ్యాసాదులకు చేసిన ఉపదేశం వారికి ఎంతటి సేవా భావాన్ని కూడా లభింపజేసిందో మనంగమనించగలం కదా!

విద్యలు నేర్పడమే కాదు, భగవంతుణ్నే చూపెట్టగలిగే మహనీయులు కూడా మనచరిత్ర పుటల్లో కనిపిస్తారు.

ఆచార్యవైభవాన్ని అద్దంపట్టి చూపెట్టడానికి రామాయణంలో ఒకశబరికథచాలు. భార్యా వియోగంతో బాధపడుతున్నా, శ్రీరామచంద్ర భగవానుడు శబరికి దర్శనమివ్వక తప్పింది కాదు. శబరిని దర్శించి, ఆవిడ ఆచార్యుల మహిమను ఆవిడనోటనేవిని మహానందంతో విరాజిల్లాడు. శబరిసన్నిధికి భగవానుణ్ని రప్పించగలిగింది మంత్రమా? మంత్రార్థవిజ్ఞానమా? కేవలం ఆవిడయందు ఆవిడ ఆచార్యులకు గల అభిమానమే యనక తప్పదు.

తన దగ్గరికి వచ్చిన భగవంతుణ్ని తనకుముక్తిని ప్రసాదింపుమని మాటవరుసకైనా శబరి అడుగలేదు. అంతే కాదు, నేను వెళుతున్నానని రామలక్ష్మణులను అడవిలోనే విడిచి పెట్టి తాను ముక్తికి వెళ్లింది. అందుకే, శ్రీవేదాంత దేశికులవారు "అవంధ్యమహిమమునిజన భజన ముషిత హృదయకలుషశబరీ మోక్ష సాక్షి భూత" (రఘువీరగద్య). శ్రీరామచంద్రస్వామిని శబరి మోక్షానికి సాక్షిభూతుడని వర్ణించారు.

తిరుమలేశుణ్ని పూర్వం ఆయామతావలంబులు తమకిష్టమైన దేవతగా పూజించే వారట. శ్రీమద్రామానుజాచార్యులవారు తిరుమలకు వేంచేసి, అక్కడి ధర్మాధికారులను, మహంతిని, సమావేశపరచి, ఆయాదేవతలు ధరించే త్రిశూలం, డమరుకం, పాశఖడ్గాది పరికరాలతో పాటు శంఖచక్రాలను కూడా గర్భగృహంలో పెట్టి ద్వారాలకు తాళాలువేసి ముద్ర వేయించారు. సూర్యోదయం వరకు ఆస్వామి తానే దేవతయైతే ఆ పరికరాలను ధరించి, మనకు తనను నిరూపించుకొంటాడన్నారు. అందరూ కూడి ప్రాతఃకాలాన దర్శించబోయారు. వారికి ఆస్వామి శంఖచక్రాలను ధరించి దర్శనమిచ్చాడు.

"రామానుజార్య యతిరాజనిరూపణేన
నాహంపరోజలధి జాదయితా దితీదమ్
ప్రాచీకటత్ స్వమ పితం" - నేను పశుపతిని కాదు,

శక్తినికూడా కాదు. నేను లక్ష్మీ పతికంటె వేరే దేవతామూర్తిని కాదని, యతిరాజులైన శ్రీమద్రామానుజులవారి నిరూపణవల్ల, నా స్వరూపాన్ని ప్రకటించడమయింది; అన్నాడట తిరుమలేశుడు. తన నిజరూపాన్ని అందరికి దర్శింపజేసిన మహనీయులని రామానుజులవారిని తనసన్నిధిలోనే వేంచేసి యుండాలని శ్రీవేంకటేశ్వరస్వామి వేడుకతో వారినక్కడనే నిల్పుకొన్నాడు. కాబట్టి, అన్నిచోట్ల రామానుజులవారు అంజలి ముద్రతో వేంచేసియున్నా, తిరుమలేశుని సన్నిధిలో మాత్రం జ్ఞానముద్రతో దర్శనమిస్తున్నారు కదా!

"యథా దేవే తథా గురౌ" గురువునూ, దైవాన్నీ ఇరువురు సమానులే అని, భక్తితో సేవించాలని శాస్త్రం బోధిస్తున్నది. "ఆచార్యాదిహదేవతాం సమధికామన్యాం నమన్యామహే" అంటూ, దేశికులవారు ఆచార్యుల కంటె గొప్పదైన దేవతయే లేదు పొమ్మని ఉపపాదించారు.

ఇంతటి మహిమాన్వితులైన ఆచార్యులు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారమంటూ ఏమీ ఉండదు కదా!

కాబట్టి రుక్మిణీదేవి, తనకోసం కృష్ణమూర్తిని పిల్చుకొని వచ్చిన ద్విజోత్తమునితో ఇలా కృతజ్ఞతను వెల్లడించుకొన్నది.

"నాసందేశాన్ని చెప్పి జలజాతేక్షణుదోడి తెచ్చితివి" అంటూ అలతి పదాలతో అనల్పభావాన్ని ప్రకటించింది. జలంలో పుట్టిన వస్తువులలో చరవస్తువైన చేపకూడా ఒకటి. చేపచూపు చురుకైనది. నీళ్ళల్లోనుంచి చెంగున మీదికి ఎగిరినప్పుడు ఇరుదరులయందున్న వస్తువులన్నీ చేపకంటిలో తళుక్కున మెరుస్తాయి. అది నీళ్ళల్లో గుడ్లనుపెడుతూ ఈదుకొంటూ కొంతదూరం పోయి వెనుకకు చూచే సరికి, గుడ్లన్నీ (చేప) పిల్లలై తిరుగుతుంటాయి. మీనం తన చూపుతోనే తన పిల్లలను పోషిస్తుందన్న మాట. కాబట్టి, మీనదృష్టివంటి దృష్టిగల శ్రీకృష్ణుణ్ని తెచ్చావుఅనే అర్థమూ ఉంది. తామర పూరేకులవలె విప్పారిన కన్నుల చేత, విశాల దృష్టితో, అందరిలోనూ ప్రత్యేకంగా నన్ను గమనించి కటాక్షించగలిగిన కృష్ణుణ్నితీసుకొనివచ్చి నాజీవితాన్ని నిలబెట్టావన్నది. నా బొందిలో ప్రాణాలను నిల్పిన నీకృపవల్ల నేను బ్రతికాను.

నీవంటి పుణ్యాత్మకులు లోకంలో ఏ కొందరో ఉంటారు. 'స్యాద్ధర్మమస్త్రియాంపుణ్యమ్' (అమరం) పుణ్యశబ్దానికి ధర్మమని అర్థం. "ఆత్మాయత్నోధృతిర్బుద్ధిః స్వభావో

బ్రహ్మావర్షమ్మచ'' (అమరం) హింసించేవారే ఎక్కువగా ఉన్న ఈ లోకంలో, బాధపడే వారిని నీలాగా బ్రతికించే 'ధర్మబుద్ధిగలజీవులు' ఉన్నారనడం సందేహమే. ఇంతటి మహోపకారం చేసిన నీకు అంజలి ఘటించడం తప్ప ప్రత్యుపకారమేమీ చేయలేని అసమర్థురాలను అని వినయంగా కృతజ్ఞతను ఆవిష్కరించింది.

"అంజలిః పరమాముద్రా క్షిప్రందేవప్రసాదినీ"

భగవదారాధనలో షోడశోపచారపూజచేసినా,

చివరకు నమస్కారం చేయడం వల్లనే దైవానుగ్రహాన్ని పొందగలగడం విధిగా ఉంది.

"తథైవ ముష్ణాత్యశుభాన్యశేషతః శుభాని పుష్ణాతి నజాతు హీయతే" (స్తోత్రరత్నం). ఒక్కసారి అంజలి ఘటిస్తే దాని ప్రభావం ఎప్పుడూ తగ్గదు. వ్యర్థంగా పోదు. అశుభాలను పూర్తిగా తొలగించడమే కాక శుభాలను పరంపరగా సమకూర్చేది అంజలి. కాబట్టి, రుక్మిణీదేవి అగ్నిద్యోతనుడనే ఆచార్యునికి, దేవునితో సమానంగా భావించి, నమస్కారం చేసింది. ఈమత్తేభ విక్రీడిత వృత్తంలో వాక్యాల విరుపులతోకూడిన పద్యగతి, భక్తి భావద్యోతకంగా ఉందికదా!

వ : **అని నమస్కరించె. అంతరామకృష్ణులు తమకూతు వివాహమునకు వచ్చుటవిని, తూర్యఘోషణంబులతో నెదుర్కొని విధ్యుక్తప్రకారంబున బూజించి మధుపర్కంబులిచ్చి, వివిధాంబరాభరణంబులు మొదలైన కానుకలొసంగి, భీష్మకుండు బంధుజనసేనా సమేతులైన వారలకుందూర్ణంబున సకలసంపత్పరి పూర్ణంబులైన నివేశంబులు గల్పించి విడియించె. ఇట్లు కూడిన రాజులకెల్లను వయోవీర్యబల విత్తంబులెట్లట్లు కోరిన పదార్థంబులెల్ల నిప్పించి, పూజించె. అంత విదర్భపురంబు ప్రజలు హరిరాక విని, వచ్చి చూచి, నేత్రాంజలుల దదీయవదన కమల మధుపానంబుసేయుచు.**

అర్థం : తూర్యఘోషణంబులతో = వాద్యధ్వనులతో; విధి+ఉక్త ప్రకారంబున = శాస్త్రమందుచెప్పబడినరీతిగా; మధుపర్కంబులు = తేనె, పాలు, పెరుగు, నేయి కలిపిన మధుర పదార్థాలను; వివిధ+అంబర+ఆభరణంబులు = నానావిధాలైన వస్త్రాలు, భూషణాలు; ఒసంగి = ఇచ్చి; బంధుజన, సేనాసమేతులైన = చుట్టాలతోను, సైన్యంతోను కూడుకొన్న; తూర్ణంబున = శీఘ్రంగా ; సకల సంపత్ పరిపూర్ణంబులైన = సర్వసంపదలచేనిండియున్న; నివేశంబులు = విడిది యిండ్లను; కల్పించి = కలుగజేసి; విడియించె = నివసింపజేసె. వయస్+వీర్య, బల,

విత్తంబులు = వయస్సు, శౌర్యం, బలం, ధనం; ఎట్లు = ఎంతెంతో; అట్ల = అంతంత; పదార్థం బులెల్లను = వస్తువుల నన్నిటిని; నేత్ర+అంజలులన్ = కన్నులు అనే దోసిళ్ళతో; తదీయ వదన కమలమధుపానంబు సేయుచు = ఆకృష్ణుని ముఖం అనే కమలం వల్ల కలిగిన మకరందాన్ని త్రాగుతూ.

తా॥ రుక్మిణీ దేవి అగ్నిద్యోతనునికి నమస్కారంచేసి పంపింది. అంతలో బలరామకృష్ణులు తన కుమార్తె వివాహానికి వచ్చినారన్న వార్తను విన్న భీష్మకమహారాజు మంగళ వాద్యధ్వనులతో వారికెదురేగి తీసుకొని వచ్చి మధుపర్కాలను అనేక వస్త్ర భూషణాదులను కానుకలిచ్చి వారి చుట్టాలు, సేనలు నివసించడానికి సకల సంపదలతో నిండిన విడిదియిండ్లల్లో విడియించాడు. ఇలాగా ఇంక వచ్చిన రాజు లందరికి వారి వైభవానికి తగినట్లు విడుదలను కావలసిన పదార్థాలను ఇప్పించి, వారిని గౌరవించాడు. ఆ సమయంలో నగరపౌరులు రుక్మిణి పెండ్లికి కృష్ణుడు వచ్చాడని విన్నారు. వెంటనే వారువచ్చి శ్రీకృష్ణుణ్ని కన్నారచూస్తూ తమలో తామిలా అనుకొన్నారు.

'నేత్రాంజలులు - వదనకమల' మన్నచోట రూపకాలంకారం.

**తగునీ చక్రి విదర్భరాజసుతకున్ దథ్యంబువైదర్భి యుం**
**దగు నీ చక్రికి నింతమంచిదగునే దాంపత్య మీ యిద్దరిం**
**దగులంగట్టిన బ్రహ్మనేర్పరిగదా దర్పాహతారాతి యై**
**మగడౌగావుత జక్రి యీరమణికిన్ మా పుణ్య మూలంబునన్॥ 42**

అర్థం : ఈ చక్రి = ఈ కృష్ణుడు; విదర్భరాజసుతకున్ = భీష్మకుని పుత్రికయైన రుక్మిణికి; తగును = తగినవాడు; తథ్యంబు = నిజం; వైదర్భియున్ = రుక్మిణికూడా; ఈ చక్రికిన్ = ఈ కృష్ణునికి; తగును; దాంపత్యము = ఆలుమగలకూడిక; ఇంత మంచిది; అగునే = అవునా; ఈ + ఇద్దఱిన్ = ఈ రుక్మిణీ కృష్ణులను; తగులన్ + కట్టిన = పరస్పర సంబంధం కూర్చినట్లైతే; బ్రహ్మ = స్రష్ట; నేర్పరిగదా = నిపుణుడనవచ్చుకదా! మా పుణ్యమూలంబునన్ = మా పుణ్యావశాన; చక్రి = కృష్ణుడు; దర్ప + ఆహత + అరాతియై = గర్వం - పరాక్రమం - చేత కొట్టబడిన శత్రువులు గలవాడై; ఈ రమణికిన్ = ఈ సుందరి - రుక్మిణి-కి; మగడు = పెనిమటి; ఔగావుతన్ = అవునుగాక.

తా॥ ఈ కృష్ణుడు ఆ రుక్మిణికి, ఆ రుక్మిణి ఈ కృష్ణునికి తగినట్లు ఉన్నారు. ఈ దాంపత్యమెంతబాగుంటుందో! ఈ యిద్దఱి అనుబంధం ఏర్పరచినట్లైతే ఆ బ్రహ్మ దేవుడు చతురుడనవచ్చుగదా! మా పూర్వపుణ్య విశేషం చేతనైనా ఈ చక్రి

పరాక్రమంతో పగవారిని తెగ టార్చి రుక్మిణీ దేవికి మగడవుగాక, అని పలికారు ప్రజలు.

వ్యాఖ్య : ప్రజావాణి రుక్మిణీ కృష్ణుల పరస్పరానురూప్యం చేత వారి దాంపత్యాన్ని ప్రతిపాదిస్తున్నది.

కుండిన పురజనులకు రాజభవనంలో రుక్మిణీదేవి పెండ్లికోసం జరుగుతున్న విషయమంతా తెలుసు. రుక్మిణికి కృష్ణుని యందే మనస్సు ఉన్నా, బంధువులు రుక్మిణిని కృష్ణునికి ఇచ్చి పెండ్లి చేయదలచినా, రుక్మి తన చెల్లెలును చైద్యునికే ఇచ్చి వివాహం జరుపడానికి నిశ్చయించాడని తెలుసు. పెండ్లి కొడుకును చూడడానికి ప్రజలు వస్తారు. నిజమే. పెండ్లి కొడుకై ఆర్భాటంగా వచ్చిన శిశుపాలుణ్ని చూడడానికి రాని జనం, పెండ్లిని చూడడానికి వచ్చిన హరిని జూడడానికెగబడి వచ్చిందనడంలో - కథా (రచన) సంవిధానంలోనే - సొగసుంది. "పిఱన్దవారుంవళర్న్దవారుమ్" అని ఆళ్వారు పలికినట్లు, కృష్ణుడు పుట్టినప్పుడు, పెరుగుతున్నప్పుడు జరిగిన జరుగుతున్న అతని అద్భుత లీలలను విన్నవారేకాని జనులు కృష్ణుణ్నిచూచిన వారుకారు. కాబట్టి, కృష్ణుని దివ్యమంగళ స్వరూపాన్ని చూడాలనే కుతూహలంతో జనులు వచ్చారు. కృష్ణుని ముఖపద్మమందలి తేనెను తమ నయనాంజలులతో ఆస్వాదించారు. "సదాపశ్యంతిసూరయః" నిత్యసూరులు వైకుంఠుణ్ని సర్వదా చూస్తుంటారని శ్రుతిపలికినట్లే సర్వజన చిత్తాకర్షకమైన కృష్ణుని రూపసౌందర్యాన్ని ప్రత్యక్షంగా చూచే భాగ్యం కలిగిన ఆ పురజనులకు "తన్నొప్పారిల్లప్పన్" (తి.వా) "న తత్సమశ్చాభ్యధికశ్చదృశ్యతే" (శ్వేతా.) అన్నట్లు, కృష్ణునితో సాటియైనవాడే కనబడడం లేదంటే, ఇక అతని కన్న మించిన వాడుంటాడా? అనిపించింది. కృష్ణుని ముఖమే హేయ ప్రతిభటత్వాన్ని ఆవిష్కరిస్తున్నది. ఆరుక్మిణికి ఈ కృష్ణుడే, ఈ కృష్ణునికి ఆ రుక్మిణియే ఆలుమగలుగా తగియున్నారనడం సత్యం. ఇంత ఆనురూప్యమైన దాంపత్యం లోకంలోనే అరుదు. అన్యోన్యానురూప్యాన్ని సృష్టించి వీరిద్దరిని అంటగట్టిన బ్రహ్మనేర్పరిగదా! అన్నారు. 'తగులం గట్టిన' అన్న పదం బ్రహ్మకు భూతకాల క్రియా విశేషణం. "పరోక్షేలిట్" అన్నట్లు, ఊహించడమే కాని బ్రహ్మవ్రాతనెవ్వరు చూడలేరుకదా! పెండ్లికాక ముందే ఇలాగా ఆశపడడానికి వారిద్దరి లోగల రూపసాదృశ్యమే హేతువు. 'తగులంగట్టినచో' (చేదర్థకంగా) చతురాననుడు చతురుడే అని భావించారు. నలుగురాడుమాటనాణ్యమై చెల్లును గదా! వారు 'కృష్ణు' డనక 'చక్రి' అన్నారు. కృష్ణుని

చేతి చక్రమే ఆయన రూపాన్ని ఆపాద మస్తకం జగ జగ మెరిపిస్తున్నది. కృష్ణుని దర్పానికి దర్పణంగా ఉంది. చక్రి రుక్మిణికి మగడు కావడానికి విరోధులతో పోరు జరుగకమానదనుకొన్నారు. "మా పుణ్యమూలాన చక్రి, ఎదిరించే వారిని అదరగొట్టి రుక్మిణీదేవికి భర్తగా భాసించా"లని ప్రజలు కోరుతున్నారు. కోరిక నెరవేరా లంటే పుణ్యం మూలంగా ఉండాలి. 'మూలం' అంటే కారణం, వేరు, నిధి అని నానార్థాలున్నాయి. అది లోపల ఉండడంవల్ల మీదికి కనబడదు. సంకల్ప తరువు ఫలించాలనుకుంటే పుణ్యమూలం దృఢంగా ఉండాలి. తాము చేసిన సత్కర్మకలాపమే పుణ్యం. రుక్మిణీ కృష్ణులు దంపతులుగా దీపించాలని పౌరులు తమ పుణ్యధనాన్ని 'శ్రీకృష్ణార్పణమస్తు' అని సమర్పిస్తున్నారు.

"త్యాగేనైకే అమృతత్వమానశుః" అన్నట్లు భగవత్ప్రీత్యర్థం ప్రజలు చేసిన ఈ త్యాగం వల్ల "ఇయంగేహేలక్ష్మీః, ఇయ మమృతవర్తిర్నయన యోః" అన్నట్లు రుక్మిణి కృష్ణుని ఇంటికేకాదు, కంటికీ దీపమవుతుంది కదా!

పౌరుల భావనా పారమ్యాన్ని మత్తే భవృత్తంగా ప్రకటించిన పద్యమిది.

**వ : అని పలికిరి.**

తా : ఆ సమయంబున.

**సన్నద్ధులై బహుశస్త్ర సమేతులై**
**బలసి చుట్టును వీరభటులు గొలువ**
**ముందఱనుపహారములు కానుకలు గాంచు**
**వర్గంబులై వార వనిత లేగ**
**బుష్పగంధాంబర భూషణకలితలై**
**పాడుచు భూసురభార్యలరుగ**
**బణవ మర్దల శంఖ పటహకాహళవేణు**
**భేరీ ధ్వనుల మిన్ను పిక్కటిలగ**
**దగిలి సఖులు గొల్వదల్లులు బాంధవ**
**సతులు దోడరాగ సవినయముగ**
**నగరు వెడలి నడచె నగజాతకునుమ్రొక్క**
**బాల చికుర విహిత ఫాలయగుచు** 43

అర్థం : వీర భటులు = శూరులైన సేవకులు; సన్నద్ధులై = సిద్ధ పడినవారై; బహుశస్త్ర సమేతులై = అనేకాయుధాలతో కూడుకొన్నవారై; చుట్టును = (రుక్మిణీదేవికి) అన్ని ప్రక్కలను బలసి = ఆవరించి; కొలువన్ = సేవింపగా, వారవనితలు = భోగపుస్త్రీలు; ముందఱన్ = ముందుభాగాన; ఉపహారములు = నైవేద్యపదార్థాలను; కానుకలు = వస్త్రాభరణ రూపాలైన కానుకలను; కొంచు = పట్టుకొంటూ; వర్గంబులై = గుంపులు గుంపులై; ఏగన్ = పోతుండగా; భూసుర భార్యలు = బ్రాహ్మణముత్తైదువులు; పుష్ప-తలై! పుష్ప = పూవులు; గంధ = చందనంమొదలైన సువాసన ద్రవ్యాలు; అంబర = వస్త్రాలు; భూషణ = నగలు, వీనితో, కలితలై = కూడుకొన్నవారై; పాడుచు = మంగళగీతాలను ఆలపిస్తూ; అరుగన్ = వెంటవస్తుండగా, మిన్ను = ఆకాశం; పణవ - ధ్వనులన్ పణవ = ఢక్కా, మర్దల = మృదంగం -డోలు; శంఖ = శంఖం; పటహ = తప్పెటలు, కాహళ = సన్నాయిలు, బాకాలు; వేణు = పిల్లనగ్రోవులు - మురళులు; భేరీ = నగారాలు - ఈ వాద్యాల యొక్క; ధ్వనులన్ = నినాదాలచేత; పిక్కటి లగన్ = నిండి క్రిక్కిరిసి పోగా; సఖులు = చెలికత్తెలు; తగిలి = వెంటనంటి; కొలువన్ = సేవిస్తుండగా; తల్లులు; బాంధవసతులు = చుట్టపు ముత్తైదువులు; తోడరాగన్ = వెంబడివస్తుండగా; బాల = కన్యయైన రుక్మిణి; నగజాతకును = పర్వతరాజపుత్రికయైన పార్వతీదేవికి; మ్రొక్కన్ = నమస్కరించడానికి; చికుర విహితఫాల + అగుచున్ = ముంగురులచే కప్పబడిన నుదురు కలది అవుతూ; నగరు = రాజభవనం నుంచి; వెడలి = బయల్దేరి; సవినయముగన్ = వినయంతో కూడుకొన్నట్లుగా; నడచెన్ = నడిచి వెళ్ళెను.

తా॥ వీరభటులు అనేకాయుధాలనుధరించి నలువంకల సేవిస్తుండగా, వేశ్యాస్త్రీలు నైవేద్యాలను కానుకలను పట్టుకొని ముందునడుస్తుండగా, బ్రాహ్మణ సువాసినులు పుష్పగంధవస్త్రా భరణాలతోకూడి మంగళగీతాలను పాడుతూ వెంబడించగా, ఢక్క, మృదంగం, తప్పెటలు, తుతారలు, వేణువులు, నగారాలు మొదలైన మంగళ వాద్య ధ్వనులచే ఆకాశం పిక్కటిల్లగా, చెలికత్తెలు వెంట నంటిరాగా, చుట్టపు పేరటాండ్రు తోడరాగా; రుక్మిణి, గౌరీదేవి పూజకోసం రాజ గృహంనుంచి బయల్దేరి, ముంగురులు నొసటి పైక్రమ్ముతుండగా అణకువతో అడుగులువేస్తూ పోయింది.

వ్యాఖ్య : రాచకన్నియ పెండ్లికి ముందు గౌరీ పూజకోసం అంతఃపురం నుంచి బయల్దేరి నగరం వెలుపలనున్న దేవీ మందిరానికి వెళ్ళుతున్న పాదయాత్రావైభవాన్ని పఠితల కన్నులకగుపడుతున్నట్లు మనోజ్ఞంగా వర్ణించడం వల్ల స్వభావోక్తి అలంకారం. వాద్యధ్వనులచే మిన్ను పిక్కటిల్లు చోట అతిశయోక్త్యలంకారమూ ఉంది. ఆటవెలది తోడి సీసపద్యంలో నగరు - నగజాత అనే వర్ణావృత్తి వల్ల, లాటానుప్రాస అనే శబ్దాలంకారం.

**వ : మఱియు, సూత, మాగధ, వంది, గాయక, పాఠక జనులంతంత నభినందించుచుంజనుదేర, మందగమనంబున ముకుంద చరణారవిందంబులు డెందంబునం దలంచుచు, నిందుధరసుందరీ మందిరంబుచేరి, సలిలధారా ధౌత చరణకరారవిందయై, వార్చి, శుచియై, గౌరీసమీపంబునకుం జనియె. అంతముత్తైదువులగు భూసురోత్తముల భార్యలు భవసహితయైన భవానికి మజ్జనంబు గావించి, గంధా క్షతంబు లిడి, వస్త్రమాల్యాది భూషణంబులనలంకరించి, ధూపదీపంబులొసంగి, నానా విధోపహారంబులు సమర్పించి, కానుకలిచ్చి, దీపమాలికల నివాళించి, రుక్మిణీదేవిని మ్రొక్కించిరి. అప్పుడు.**

అర్థం : ఇదిగాక; సూత - జనులు / సూత = పౌరాణికులు - కీర్తినివర్ణించేవారు; మాగధ = ప్రతాపాన్ని ప్రశంసించేవారు; వంది = స్తుతిపాఠకులు; గాయక = సంగీతం పాడేవారు; పాఠక = వంశావళిని చదివేవారు; జనులు = లోకులు; అంతంతన్ = అంతటంతదగ్గరగా చేరి; అభినందించుచున్ = పొగడుతూ; చనుదేరన్ = రాగా; మందగమనంబునన్ = మెల్లని నడకతో; ముకుంద చరణ+అరవిందంబులు = శ్రీకృష్ణుని పాదకమలాలను; డెందంబునన్ = మనస్సులో, తలంచుచున్ = ధ్యానిస్తూ; ఇందుధర సుందరీ మందిరంబు చేరి = చంద్రుణ్ని ధరించిన శివుని పత్నియైన పార్వతీ దేవి యొక్క ఆలయానికి పోయి; సలిల - అరవిందయై! సలిలధారా = ఉదకధారచే; ధౌత = కడుగబడిన, చరణ, కర+అరవిందయై = కమలాలవంటి కాళ్ళు చేతులుకలదై; వార్చి = ఆచమనంచేసి; శుచియై ; పరిశుద్ధురాలై; గౌరీసమీపంబునకున్ = గౌరీదేవి దగ్గరకు, చనియెన్ = పోయెను. అంతన్ = అప్పుడు; ముత్తైదువులగు = జీవద్భర్తృకలైన; భూసుర + ఉత్తముల భార్యలు = ఉత్తములైన బ్రాహ్మణుల పత్నులు; భవసహితయైన = పరమేశ్వరునితో కూడుకొన్న దైన; భవానికిన్ = పార్వతీదేవికి; మజ్జనంబున్ = అభిషేకం; కావించి = చేసి; గంధ, అక్షతంబులిడి; వస్త్ర, మాల్య+ఆది, భూషణంబులన్ = బట్టలను, పూలహారాలను, రత్నమాలలు మొదలైన నగలతో, అలంకరించి = భూషించి; ధూప, దీపంబులు; ఒసంగి = ఇచ్చి; నానావిధ + ఉపహారంబులు = పలురకాలైన ఫలాలను, షడ్రసోపేత పదార్థాలను నైవేద్యంగా; సమర్పించి; కానుకలిచ్చి; దీప మాలికల నివాళించి = దీపపంక్తులతో హారతులిచ్చి; రుక్మిణీ దేవిని మ్రొక్కించిరి.

తా॥ రుక్మిణీ దేవి గౌరీదేవ్యాలయానికి మెల్లగా నడుచుకొంటూ పోతున్నప్పుడు సూత మాగధాది స్తుతి పాఠకులైన జనులు ఆమెను ప్రశంసిస్తూ వెంట నడిచారు. రుక్మిణి తనమనస్సులో భుక్తిని ముక్తిని ప్రసాదించే శ్రీకృష్ణుణ్ని ధ్యానిస్తూ, మౌనంగా చంద్రశేఖరుని ధర్మపత్ని యైన పార్వతీదేవి మందిరానికి చేరుకొన్నది. అక్కడ మొదట

నీళ్ళతో కాళ్ళు చేతులను కడుక్కొని, ఆచమనంచేసి, దైహికంగా మానసికంగా పరిశుద్ధురాలయింది. పార్వతీదేవి సన్నిధిలో బ్రాహ్మణ ముత్తైదువులు పరమేశ్వరునితో కూడియున్న పార్వతీ దేవికి అభిషేకం చేయించారు. గంధం, అక్షింతలను సమర్పించారు. వస్త్ర పుష్పమాల్యాది భూషణాలతో దేవిని అలంకరించారు. ధూపదీప నైవేద్యాలను, కానుకలను సమర్పించారు. (రథంలాగా అంతస్థులను నిర్మించిన చెమ్మెలతో) దీపపంక్తులచేత ఆరతులిచ్చి రుక్మిణీ దేవిని మ్రొక్కించారు. (తాత్పర్యం స్పష్టం) ఈ వచనంలో అనేక శబ్దాలంకారాలున్నాయి. 'భవానీ' శబ్దంలోనే భవ సహితయైన అనే పుంయోగలక్షణం నిబద్ధమయింది. అయినా, 'భవసహితయైన భవాని' అనడంవల్ల సాహిత్య లాభం. అంటే "సామిసామేను చేగొన్న చాన" అనే భర్తృభార్యా సంబంధ విశేష రూపాన్ని ద్యోతకం చేయడమే. ఇది దాంపత్య సౌభాగ్యం కోసం పురాణ దంపతులను పూజించే సత్సథాచారాన్ని తెల్పుతున్నది.

అప్పుడు; రుక్మిణీదేవి -

**నమ్మితి నామనంబున సనాతనులైన యుమామహేశులన్**
**మిమ్ము బురాణదంపతులమేలు భజింతుగదమ్మ! మేటి పె**
**ద్దమ్మ! దయాంబురాశివిగదమ్మ! హరింబతి సేయుమమ్మ! నిన్**
**నమ్మిన వారికెన్నటికి నాశములేదుగదమ్మ! యీశ్వరీ! 44**

అర్థం : ఈశ్వరీ = ఓ గౌరీదేవీ! సనాతనులైన = శాశ్వతులైన; ఉమా మహేశులన్ = ఉమా మహేశులు అనే; పురాణ దంపతులన్ = బహుకాలంనాటి వారైననూ నిత్య నూతన దంపతులుగా ఉన్న; మిమ్ము = మీ జంటను; నా మనంబున = నా మనస్సులో; నమ్మితిన్ = నమ్మియున్నాను; మేలు = ప్రేయః శ్రేయస్సులను; భజింతుగదమ్మ = కోరిసేవిస్తున్నాను కదా జననీ! మేటి పెద్దమ్మ = పూజ్యులకే పూజ్యురాలవైన ఓ పెద్దతల్లీ! దయా + అంబురాశివిగదమ్మ = దయాసముద్రవుకదా తల్లీ! హరిన్ = లోకాలను హరించే శ్రీకృష్ణుణ్ని; పతి సేయుము, అమ్మ = భర్త గా చేయవమ్మా! నిన్ = నిన్ను; నమ్మినవారికి = నిన్ను విశ్వసించినవారికి; ఎన్నటికి = ఎప్పుడు కూడా, నాశము లేదు గదమ్మ = చెరుపులేదు కదా తల్లీ!

తా॥ ఓ ఈశ్వరీ! శాశ్వతంగా నిలిచియున్న ఉమామహేశులనే ప్రసిద్ధనామంతో ప్రాచీనులైనా నిత్యనూతన దంపతులుగా శోభిస్తున్న మీయిద్దరిని నామనస్సులో నమ్ముకొని యున్నాను. నేను మేలుగోరిసేవిస్తున్నాను. పూజనీయులైన తల్లులకు పూజనీయవైన పెద్ద తల్లివికదా! నీవు దయాసముద్రురాలవు. నిన్ను నమ్మిన వారేనాడూ

చెడిపోరుగదమ్మా! నీవు కృపతో కృష్ణుణ్ని నాకుపెనిమిటిగా అనుగ్రహించుమని రుక్మిణి ప్రార్థించింది.

వ్యాఖ్య : రుక్మిణి ఆర్తితో పార్వతీదేవిని ప్రార్థించిన వైఖరి ఇది. పార్వతీదేవి విశ్వేశ్వరి. చరాచర ప్రపంచాన్ని పాలించే మహాశక్తి. "త్రిగుణాత్మకమైయనిశము, జగములు కల్పింప బెంప సమయింపంగా, దగు మూలప్రకృతియేనే యగుదుజుమీ సత్యముగ మహాగుణశాలీ" - అనే అభియుక్తోక్తిచే, అంబికాదేవి సృష్టిస్థితిలయకారిణి.

పూర్వం దాక్షాయణి దక్షయజ్ఞంలో యోగాగ్నిదగ్ధయై, మళ్లీ పర్వతరాజైన హిమవంతునికి మేనకయందు జనించి ఉమాదేవిగా వ్యవహరింపబడింది. శివదేవుణ్ని భర్తగా వరించింది. దేవేంద్రుని ప్రేరణ వల్ల కామదేవుడు సమాధిస్థుడైయున్న, త్రిలోచనుని మీద పుష్పబాణాలను ప్రయోగించినందువల్ల, ఆయన తన ఫాలాగ్నినేత్రం తెరచి కామదేవుణ్ని బుగ్గిచేశాడు. రతీదేవి మగని బూడిద జూచివిల పించింది. ఉమాదేవి పంచాగ్నుల మధ్య నిలిచి తపోధనులు ప్రశంసించినంత ఘోర తపస్సు చేసింది. తపస్సు సిద్ధించి, హఠాత్తుగా శివుడు సాక్షాత్కరించగా "శైలాధిరాజతనయానయయౌనతస్థౌ" పార్వతీదేవి ముందుకు గానీ, వెనుకకు గానీ అడుగువేయలేని స్థితిలో ఉండిందని కాళిదాసు వర్ణించాడు. శివుడు మహాదేవుడు. నాకేశాదిసర్వలోకేశులచే పూజింప బడే మహేశుడు పార్వతిని వైభవంగా పరిణయంచేసుకొన్నాడు. ఉమామహేశులు తమ కోసం బుగ్గియైన కామదేవుణ్ని తమ వివాహోత్సవంలో మళ్ళీ అనంగునిగా జీవింపజేశారు. పార్వతీదేవికి పరమేశ్వరుడు తన శరీరంలో సగం స్థానం కల్పించి అర్ధనారీశ్వరుడయ్యాడు. లక్ష్మీశ, వాణీశ శచీశాది సుమనసులు సనాతనులైన ఉమామహేశులకు అభినందనచందన మందారాల నందించారు.

"త్వమేకోద్వైత్వ మాపన్నః శివశక్తి ప్రభేదతః
త్వం పుంప్రకృతి రూపేణ బ్రహ్మాండ మసృజః పురా॥"

(కాశీఖండం) శివ శక్తి భేదం వల్ల నీ రూపాన్ని ద్విధా మలచుకొన్నావు. నీవు ఒక్కడవే అయినా ప్రకృతి పురుషరూపంచేత పూర్వం బ్రహ్మాండాన్ని సృజించావు. అని స్తుతింపబడినవాడు మహేశుడు. ఇక పార్వతి మూలపుటమ్మయేకదా! "గౌరీ పద్మాశచీమేధాసావిత్రీ విజయాజయా" ఇత్యాది షోడశమాతృకలకూ, బ్రాహ్మ్యది సప్తమాతృకలలోనూ అగ్రస్థానంలో నిలిచింది. అంతేకాదు, ముగ్గురమ్మల

మూలపుటమ్మ. కాబట్టి, హైమవతి మేటిపెద్దమ్మ గదా! ఎనలేని దయా మయికాబట్టి, ఉమాదేవిప్రేమకు మహేశుడు వశుడు కావాలని ఆమెను నమ్మి యత్నించిన కమ్మవిల్కానికి నాశమే లేదుగదా!

రుక్మిణీదేవి ఈ పురాణదంపతులను నమ్మి మేలునుకోరి సేవించింది. ఈ మహేశుడు ఒకప్పుడు సతీదేవితో చెప్పిన మాట ఇలా ఉంది.

"సత్త్వం విశుద్ధం వసుదేవశబ్దితం
యదీయతే తత్ర పుమానపావృతః।
సత్త్వేచతస్మిన్ భగవాన్ వాసుదేవో
హ్యధోక్షజో మేనమసావిధీయతే"॥ (భాగ-4-3-23)

'వసుదేవ' శబ్దానికి పుణ్యకర్మల చేత ప్రకాశించే శుద్ధ సత్త్వగుణం గల 'అంతఃకరణ' మని అర్థం. అక్కడ స్పష్టంగా - ఆవరణం లేకుండా ప్రకాశించే వాడు వాసుదేవుడు. అంతఃకరణమందున్నవాసుదేవునికి నిత్యం నమస్కరిస్తూ నేను ఉపాసిస్తుంటాను. అన్నాడు. ఇదే ఈ శ్లోకార్థం.

వారికి ఉపాస్యుడు, కాబట్టి, రుక్మిణీ దేవి ముఖ్యంగా పరమేశ్వరిని "తనకు హరిని పతి సేయుమమ్మ!" అని "నిన్ను నమ్మి చేసే ఈ నా ప్రార్థన వ్యర్థం కాదుగదమ్మ!" అని వేడుకొన్నది.

మరొక విషయం. సంబోధన పదాలుగల, చిన్నచిన్న మాటలతో, కంఠంలో గద్గదస్వరం ధ్వనించే ఆర్తితో, ప్రాకృతస్త్రీలాగా, రమాభగవత్యంశసంభవయైన రుక్మిణి పార్వతీదేవిని ప్రార్థించడం సముచితమా? అని భావించరాదు.

భగవంతుణ్ని అనుసరించే వ్రతం - నియమంగల భగవతి కూడా మానవిగానే అవతరించిందికదా!

'యద్యదాచరతిశ్రేష్ఠః తత్తదేవేతరోజనః" అన్నట్లు లోకానుగ్రహశీలత్వం వల్ల, అలాగా రుక్మిణిదేవి ప్రార్థించడం సముచితమే, అనుకోవాలి.

ప్రార్థనకోసం ఉత్పలమాలావృత్తం సుసజ్జితం.

**వ : అని గౌరీదేవికి మ్రొక్కి పతులతోడం గూడిన బ్రాహ్మణ భార్యలకు లవణాపూపంబులను, దాంబూల కంఠసూత్రంబులును, ఫలంబులు, నిక్షుదండంబులు నిచ్చి రుక్మిణీ దేవి వారల బూజించిన.**

తా॥ అలాగా, రుక్మిణీదేవి గౌరీదేవిని ప్రార్థించి, నమస్కరించి, బ్రాహ్మణ దంపతులకు ఉప్పువేసిచేసిన అప్పలను, ఆకువక్కలను, మెడనూళ్ళను, ఫలాలను, చెరుకు గడలను ఇచ్చి, వారిని పూజించింది.

వ్యాఖ్య : పెండ్లి కూతురు బ్రాహ్మణదంపతులను పూజించడం శిష్టాచారం.

పెండ్లికూతురు దేవిని పూజించినట్లే, వృద్ధదంపతులకు వస్త్ర భూషణాదులనిచ్చి, మాంగల్య వృద్ధికోసం పూజించే ఆచారం పరంపరగా సంక్రమించింది. సామాన్యులు కూడా, సువాసినులకు కనీసం ఐదుగురికి, పస్పుచీరలు పెట్టి గంధ పుష్పఫలాలతో పాటు దక్షిణ సమర్పించి గౌరవించడం పరిపాటి.

**వారునుత్సహించి వలనొప్పదీవించి**
**సేస లిడిరి యువతి శిరము నందు**
**సేస లెల్ల దాల్చి శివ వల్లభకు మ్రొక్కి**
**మౌననియతి మాని మగువ వెడలె. 45**

అర్థం : వారును = బ్రాహ్మణదంపతులుకూడా; ఉత్సహించి = సంతోషించి; వలను = బాగు; ఒప్ప = ఉండునట్లుగా; దీవించి = ఆశీర్వదించి; యువతి శిరమునందు = రుక్మిణితలమీద; సేసలు = అక్షతలను; ఇడిరి = ఉంచిరి; మగువ = రుక్మిణి; సేసలు + ఎల్లన్ = అక్షతలనన్నిటిని; తాల్చి = ధరించి; శివ వల్లభకున్ = గౌరీదేవికి; మ్రొక్కి; మౌన నియతిన్ = మాట లాడని నియమాన్ని; మాని = విడిచి; వెడలెన్ = దేవ్యాలయంనుంచి బయల్దేరింది.

తా॥ ఆ బ్రాహ్మణ దంపతులు, రుక్మిణీదేవి తమను పూజింపగనే, సంతోషించిన వారై "మనో వాంఛాఫలసిద్ధిరస్తు" అని చక్కగా దీవించి రుక్మిణి తలపైన అక్షతలనుంచారు. రుక్మిణి వాటిని తలదాల్చి, గౌరీదేవికి మ్రొక్కి, మౌనవ్రతాన్ని విడిచి, ఆలయం నుంచి బయల్దేరింది.

వ్యాఖ్య : భగవదారాధన పూర్తి అయ్యేంత వరకు మౌనాన్ని పాటించడం విధి విహితం.

మనస్సు భగవవంతుని యందేమగ్నమై యుండాలి. ఇతర విషయాలను ఆలోచించనీయకూడదు. మనస్సు తలచేది ఏదైనా అది మాటల్లో బయటపడుతుంది.

"యద్ధి మనసాధ్యాయతి తద్వాచావదతి" (శ్రుతి) అందుకే వాఙ్నియమంపాటించాలి. పూజావిధానంలోని మంత్రాలను కూడా నోటితో అనుసంధించక మనస్సుతోనే స్మరిస్తూ ఆరాధించాలి. నోటితుంపరలు - (బ్రహ్మబిందువులు) బయట

పడకుండా మూతిని మూసుకొనే రీతిగా తలకు వస్త్రాన్ని బంధించి ఆర్చకులు ఆరాధనను సమర్పిస్తుంటారు. ఆత్మసమర్పణకు మౌనదీక్ష అత్యవసరమని అభియుక్తోక్తి. పద్యం ఆటవెలది.

వ. **ఇట్లు మేఘమధ్యంబు వెలువడి విలసించు క్రొక్కారు మెఱుంగు తెఱంగున, మృగధరమండలంబు నిర్గమించి చరించు మృగంబు చందంబున, గమల భవ నర్తకుండెత్తిన జవనిక మఱుగుదెరలిపొడ సూపిన మోహినీ దేవత కైవడి, దేవదానవ సంఘాత కరతల సవ్యాపసవ్య సమాకృష్యమాణ పన్నగేంద్ర పాశ పరివలయిత పర్యాయపరిభ్రాంత మందరాచల మంథాన మథ్యమాన ఘూర్ణిత ఘుమఘుమాయిత మహార్ణవ మధ్యంబుననుండి చనుదెంచు నిందిరాసుందరీ వైభవంబున, బహువిధప్రభాభాసమానయై, యిందు ధర సుందరీ మందిరంబు వెడలి; మానసకాసార హేమకమల కానన విహర మాణ మత్త మరాళంబు భంగి, మంద గమనంబున గనక కలశయుగళ సంకాశకర్కశ పయోధరభార పరికంప్యమానమధ్యయై, రత్నముద్రికాలంకృతంబైన కెంగేల నొక్క సఖీలాలమంబుకైదండగొని, రత్నవివహసమంచిత కాంచన కర్ణపత్రమయూఖంబులు గండ భాగంబుల నర్తనంబులు సలుప, నరవింద పరిమళకుతూహలావతీర్ణ మత్తమధుకరంబుల మాడ్కి నరాళంబు లైన కుంతల జాలంబులు ముఖమండలంబున గ్రందు కొన, సుందర మందహాసరోచులు దిశలందుబాల చంద్రికాసౌందర్యంబు నావహింప, అధరబింబ ఫలారుణమరీచి మాలికలు రదనకుందకుట్మలం బుల కనురాగంబు సంపాదింప, మనోజాతకేతన సన్నిభంబైన పయ్యెదకొంగుదూగ, సువర్ణమేఖలా ఘటిత మణికిరణ పటలంబు లకాల శక్రచాప జనకంబులై మెఱయ, జెఱకువిలుతుం డొఱవెఱికి, వాడియిడి. ఝళిపించిన దగద్ధగాయమానంబులగు బాణంబుల పగిది, సురుచిరవిలోచన నికరంబులు రాజవీరుల హృదయంబులు భేదింప, శింజానమంజు మంజీర నినదంబులు చెవులపండువులు సేయ, బాదసంచారంబున హరిరాక కెదురు సూచుచు, వీర మోహినియై చనుదెంచుచున్న సమయంబున.**

అర్థం : ఇట్లు = ఈ విధంగా; మేఘ మధ్యంబు = మబ్బునడుమ నుంచి; వెలువడి = బయటకు వచ్చి; విలసించు = ప్రకాశించే; క్రొక్కారు మెఱుంగు తెఱంగునన్ = వర్షాకాలపు మెఱుపువలె; 2. మృగధర, మండలంబు = చంద్ర మండలంనుంచి; నిర్గమించి = ఇవతలకు

వచ్చి; చరించు = తిరుగునట్టి; మృగంబు చందంబున = లేడివలె; 3. కమల భవ, నర్తకుండు = బ్రహ్మ అనే నటుడు; ఎత్తిన = పైకి లేవదీసిన; జవనిక = తెరయొక్క; మఱుగున్ = చాటు నుంచి; తెరలి = బయటపడి; పొడ సూపిన = కనబడిన; మోహినీ దేవత కైవడి = (లోకాన్ని) మోహింపజేసేదేవత వలె; 4. దేవ దానవ సంఘాత = దేవతల, రాక్షసుల సమూహంయొక్క; కరతల = అరచేతులతో; సవ్య = ఎడమకు; అపసవ్య = కుడికి; సమాకృష్యమాణ = లాగబడుతున్న; పన్నగ+ఇంద్ర = సర్పరాజైన వాసుకి అనే; పాశ = త్రాడుచేత; పరివలయిత = చుట్టబడి; పర్యాయ = వరుసగా; పరిభ్రాంత = తిరుగుతున్న; మందర+అచల = మందరపర్వతం అనే; మంథాన = కవ్వంచేత; మథ్యమాన = త్రచ్చబడుతున్నదై; ఘూర్ణిత = సుడులు తిరుగబడి; ఘుమఘుమాయిత = ఘుమఘుమధ్వనిచేసే; మహా+అర్ణవ, మధ్యంబున నుండి = గొప్పసముద్రం నడుమ నుంచి; చనుదెంచు = వెలికివచ్చునట్టి; ఇందిరాసుందరీ వైభవంబునన్ = లక్ష్మీదేవి విభవంలాంటి విభవంచేత; బహువిధ ప్రభా భాసమానయై = నానావిధకాంతులచేత ప్రకాశిస్తున్నదై; ఇందుధర సుందరీ, మందిరంబు = చంద్రశేఖరుని పత్నియైన గౌరీదేవి ఆలయం నుంచి; వెడలి = వెలుపలికి వచ్చి.

వ్యాఖ్య : వ్యాస భాగవతంలో

"మౌనవ్రత మథ త్యక్త్వా నిశ్చక్రామాంబికాగృహాత్!
ప్రగృహ్యాపాణినాభృత్యాం రత్నముద్రో పశోభితామ్॥"

రుక్మిణీ దేవి మౌనవ్రతాన్ని విడిచి, రత్నముద్రలచే అలంకరింపబడిన చెలికత్తెను తన చేతితో పట్టుకొని అంబికాలయంనుంచి బయల్దేరిందని మాత్రమే ఉంది.

భక్త కవిపోతన భవానీ మందిరం నుంచి రుక్మిణీ దేవి బయల్వెడలిన భంగిమను ఈపెద్ద వచనరచనలో మొదట నాలుగు ఉపమాలంకారవాక్యాలతో సరసంగా వర్ణించాడు. వాటిలో మొదటిది.

మేఘమధ్యంనుంచి పొటమరించితళుక్కున వెలిగిన వర్షాకాలపు మెఱుపు లాగా గౌరీమందిరంనుంచి వెలుపలికి వచ్చింది రుక్మిణి. గౌరీమందిరం మేఘ వర్ణంగా ఉంది. మందిరంలో నుంచి బయటకు వచ్చే రుక్మిణి మెఱుపు లాగా మెరసింది. మెఱుపు ఒక దుర్నిరీక్ష్యమైన కాంతిపుంజం. చూచేవారికళ్ళు మూసుకపోతాయికదా! రుక్మిణి ఆకృతి చూడశక్యంగాని తటిల్లతగా ఉంది. ఈ వాక్కు శ్రుతి శిరస్సులో విలసించింది. "నీలతోయదమధ్యస్థావిద్యుల్లేఖేవ భాస్వరా". ఆలంకారికమైన ప్రాబల్యాను ప్రతిబింబించే ఉక్తి వైచిత్రిని ప్రదర్శించిన పోతన, మహాకవి యనక చెల్లదు.

"శబ్దార్థోక్తిషు యః పశ్యేదిహకించన నూతనమ్!
ఉల్లిఖేత్ కించన ప్రాచ్యం మన్యతాం సమహాకవిః॥

శబ్దంలోను, అర్థంలోను, మాటలోను నూతన విషయాన్ని చూడగల్గి, ఏదైనా ప్రాచీన విషయాన్నిచిత్రించగలిగే వ్యక్తి మహాకవిగా భావింపబడుతాడని లాక్షణికులన్నారు.

2. చంద్రుడు మృగాంకుడనీ, శశధరుడనీ నిఘంటువులు పేర్కొన్నాయి. అంటే తెల్లని చంద్రబింబంలోని నలుపు మచ్చను 'లేడి' అనీ, కుందేలు అనీ, రాట్నంతో దారం తీస్తున్న అవ్వ, అనీ కొందరు అంటే, నేడు వైజ్ఞానికులు కొండలోయలంటున్నారు. ఈమహాకవి మృగధరుడని వాకొన్నాడు. రుక్మిణి చంద్రమండలంనుంచి వెలికి వచ్చి సంచరించే లేడి వలె కవికి గోచరించింది.

శ్రీదేవిని "హరిణీం" అనీ "చంద్రాంహిరణ్మయీాంలక్ష్మీం" అనీ శ్రుతికాంత స్తుతిస్తుంది కదా!

3. బ్రహ్మ దేవుడనే నటుడు లేవనెత్తిన తెరచాటు నుంచి బయటకు వచ్చి కనబడిన మోహిని వలె రుక్మిణి రాణిస్తున్నది. 'కమలభవనర్తకుండు' అన్నది రూపకం. 'మోహినీ దేవతకైవడి' అనేది ఉపమాలంకారం.

మాయయే జవనిక - తెర. జగమే నాటకరంగం. కమలభవుడే నర్తకుడు. నర్తకుడే తెర ఎత్తాలి. నర్తకుని అబ్బయే నాటక సూత్రధారి. తెరమఱుగున ఉన్నది మోహినీ దేవత. అందుకే "మమ మాయా దురత్యయా" - నామాయదాటశక్యం కానిది, అంటూనే ఆనాటక సూత్రధారిని 'నీవు తప్ప మాకు వేరేశరణం లేదు' అని ప్రపత్తి చేసినవారు మాయనుదాటుతారు, (భ.గీ) అన్నాడు గీతాచార్యుడు. శ్రీమద్యామునమునులు లక్ష్మీదేవిని "యవనికా మాయా జగన్మోహినీ" అని స్తుతించారు.

4. సురాసురులు 'వాసుకి' సర్పరాజును త్రాడుగా చుట్టి సవ్యాపసవ్యంగా త్రిప్పుతున్న 'మందరాద్రి' అనే కవ్వంచేత చిలుక (త్రచ్చ)బడి సుడులు తిరుగుతూ, ఘుమఘుమ ధ్వనిగల మహార్ణవంలో నుంచి వెల్వడిన లక్ష్మీదేవి లాగా, నానావిధభూషణ కాంతులచే భాసిస్తూ రుక్మిణి, గౌరీ దేవి ఆలయం నుంచి బయటకు వచ్చింది.

రుక్మిణి దేవి, వేదాంత శాస్త్రేతిహాసాదులచే ప్రతిపాద్యయైన లక్ష్మీదేవి యే అని, ఈ వాక్యాలలో ధ్వనింప చేశాడు మహాకవి.

అర్థం : మాన - భంగి! మానసకాసార = బ్రహ్మ మానస సరస్సులో ఉన్న; హేమ కమల = బంగారు తామరల యొక్క, కానన = వనంలో; విహరమాణ = విహరిస్తున్న; మత్త

మరాళంబుభంగి = మదించిన హంస వలె; మందగమనంబు నన్ = తిన్నని నడకతో; కనక - మధ్యయై! కనక కలశయుగళ = బంగారుకడవల జంటతో; సంకాశ = సరిపోయినట్టి; కర్కశ = కఠినమైన; పయోధర = చన్నుల యొక్క; భార = బరువుచేత; పరికంప్యమాన = చాలా చలిస్తున్న - వణకుతున్న; మధ్యయై = నడుముకలదై; రత్నముద్రికా+అలంకృతం బైన = మణులచే పొదుగబడిన ఉంగరాలచే భూషింపబడిన; కెంగేలన్ = ఎఱ్ఱని చేతితో, ఒక్క సఖీలలామంబు = ఒక మంచి చెలికత్తె యొక్క; కై దండన్ కొని = చేయూతను తీసుకొని; రత్ననివహ - ఖంబులు! రత్ననివహ = రత్న సమూహంతో, సమంచిత = ఒప్పియున్న; కాంచన కర్ణపత్ర = బంగారు చెవికమ్మల; మయూఖంబులు = కాంతులు; గండ భాగంబులన్ = చెక్కిళ్ళ యందు; నర్తనంబులు సలుపన్ = నాట్యాలు చేయగా; అరవింద - బుల మాడ్కి। అరవింద పరిమళ కుతూహల = కమలాల వాసనయందలి వేడుకచేత; అవతీర్ణ = దిగిన; మత్త మధుకరంబుల మాడ్కిన్ = మదించిన తుమ్మెదలవలె; అరాళంబులైన = వంకరైన; కుంతల జాలంబులు = ముంగురులగుంపులు; ముఖ మండలంబునన్ = గుండ్రని ముఖమందు; క్రందుకొనన్ = సందడింపగా; సుందర మందహాసరోచులు = అందమైన చిఱునవ్వుకాంతులు; దిశలందు = దిక్కులందు; బాల చంద్రికా సౌందర్యంబును = లేతవెన్నెల అందాన్ని; ఆవహింపన్ = కలుగజేయగా; అధర - మాలికలు। అధర బింబఫల = క్రింది పెదవి అనే దొండపండు యొక్క; అరుణ మరీచి మాలికలు =ఎఱ్ఱని కాంతి (కిరణ)పంక్తులు; రదన కుంద కుట్మలంబులకు = దంతాలు అనే మల్లె మొగ్గలకు; అనురాగంబు = అనురక్తిని - ఎఱ్ఱదనాన్ని; సంపాదింపన్ = పుట్టింపగా; మనోజాత కేతన సన్నిభంబైన = మన్మథుని టెక్కెం (జండా) తో పోలియున్న; పయ్యెద కొంగున్ = పైటచెంగు; తూగన్ = వ్రేలాడగా; సువర్ణ - లంబులు సువర్ణమేఖలా = బంగారుమొలనూలుతో - ఒడ్డాణమందు; ఘటిత = కూర్చబడిన; మణికిరణ పటలంబులు = రత్నకాంతుల సమూహాలు; అకాల శక్రచాపజనకంబులై = కాలంగానికాలాన ఇంద్రధనుస్సును పుట్టించేవియై; మెఱయన్ = ప్రకాశింపగా; చెఱకు విలుతుండు = మన్మథుడు ; ఒర+పెరికి = గవిసెనలోనుంచి లాగి; వాడి+ఇడి = పదునుపెట్టి; ఝుళిపించిన = ఆడించగా, ధగద్ధగా యమానంబులగు = ధగధగమెఱుస్తున్న; బాణంబుల పగిది = బాణాలవలె; సురుచిర విలోచన నికరంబులు = ప్రకాశించే చూపుల సమూహాలు; రాజవీరుల హృదయంబులు = శూరులైన రాజుల మనస్సులను; భేదింప = పగులజేయగా; శింజాన = బులు/ శింజాన = (భూషణాల) ధ్వనిగల; మంజు = మనోజ్ఞమైన; మంజీర = కాలియందెల; నినదంబులు = రవళులు; చెవుల పండువులు సేయన్ = శ్రవణానందాన్ని కలిగింపగా; పాదసంచారంబునన్ = కాలినడకచేత; హరిరాకకు = కృష్ణుని రాకకై; ఎదురు సూచుచు = ప్రతీక్షిస్తూ; వీరమోహినియై = వీరులను మోహింపజేస్తున్నదై; చనుదెంచు చున్న సమయంబున = వస్తున్నప్పుడు.

తా : రుక్మిణి, దేవి మందిరం నుంచి వెలికివచ్చి, మానస సరస్సులోని బంగారు కమలాల వనంలో విహరిస్తూ, (తామరతూండ్లను తిని) మదించిన హంసలాగా మెల్లని

నడకతో, బంగారు కుండల జంటను పోలిన చన్నుల బరువుచేత వణుకు తున్న నడుముకలదై, రత్నాలనుదాపిన బంగారపుటుంగరాలచే అలంకరింపబడిన తనచేతికి ఒక చెలికత్తె చేతిని చేయూతగా గ్రహించి, రత్నఖచితాలైన బంగారు చెవికమ్మల తళుకులు చెక్కిళ్ళ యందు ప్రసరింపగా, పద్మ పరిమళాలవేడుకతో దిగివచ్చిన మదించిన తుమ్మెదవలె. గుండ్రని మొగంపైన ఆవరించిన ముంగురులతో, అందమైన చిరునగవుకాంతులు లేత వెన్నెల అందాన్ని చిందింపగా; దొండపండు లాంటి ఎఱ్ఱని పెదవి కాంతి మల్లె మొగ్గలలాంటి దంతాల పంక్తికి రక్తిమను కలిగింపగా, మన్మథ పతాకమో అన్నట్లు పైటకొంగు వ్రేలాడుతుండగా బంగారపుటొడ్డాణమందు తాపిన మణులకాంతులు అకాలంలో కలిగిన ఇంద్ర ధనస్సు లాగా వెలుగగా, మన్మథుడు ఒర నుంచి పెరికి పదునుపెట్టి ఝళిపించినప్పుడు ధగధగమెరుస్తున్న బాణాల వలె ప్రకాశించే చూపులకాంతులు రాజవీరుల హృదయాలను వ్రయ్యలు చేయగా, గలగల మ్రోగుతున్న కాలియందెల రవళులు వీనుల విందు చేయగా, కాలినడకతో కృష్ణమూర్తి రాక కోసం ఎదురుచూస్తూ, వీరమోహినియై రుక్మిణీ దేవి వస్తుండగా.

వ్యాఖ్య : మందిరం నుంచి మరలి వస్తున్న రుక్మిణీదేవి వీరమోహినిగా గోచరిస్తున్నవర్ణన :

రూపకోపమాలంకారాలతోనూ, అరుదుగా ఉత్ప్రేక్షాలంకారంతోనూ, విశేషంగా వృత్త్యనుప్రాసమనే శబ్దాలంకారంతోనూ మనోజ్ఞంగా సాగింది ఈ వచనం. మొదట రుక్మిణీ దేవి అవ్యక్తంగా భాసించి, క్రమంగా వ్యక్తరూపయై, చూపరుల యెదలను కదిలిస్తూ, కృష్ణమూర్తి వస్తాడనే ఆశతో మెల్లగా నడుస్తూ వస్తున్న సమయమది.

**అలినీలాలక బూర్ణచంద్రముఖినే ణాక్షిం బ్రవాళాధరన్**
**గలకంఠిన్ నవపల్లవాంఘ్రి యుగళన్ గంధేభకుంభస్తనిన్**
**బులినశ్రోణి ని భేంద్రయాన నరుణాంభోజాతహస్తన్ మహో**
**త్పలగంధిన్ మృగరాజమధ్యగని విభ్రాంతాత్ములైరందఱున్** 46

అర్థం : అందఱున్ = అక్కడున్నవారందఱు; అలినీల+అలకన్ = తుమ్మెదల వంటి నల్లని ముంగురులు గలది; పూర్ణ చంద్రముఖిన్ = నిండు చంద్రునివంటి మొగం కలది; ఏణ+అక్షిన్ = లేడికన్నులవంటి కన్నులు కలది; ప్రవాళ + అధరన్ = పగడం/ చిగురు వంటి ఎఱ్ఱని పెదవికలది; కలకంఠిన్ = అవ్యక్తమధురమైన కోకిల కంఠస్వరంవంటి కంఠస్వరం కలది; నవపల్లవ

+ అంఘ్రి యుగళన్ = క్రొత్త (లేత) చిగురు వంటి మృదువైన, ఎఱ్ఱని పాదద్వయంకలది; గంధ+ఇభ, కుంభస్తనిన్ = మదపుటేనుగు యొక్క కుంభా(తలదిమ్మె)ల వంటి చన్నులు కలది; పులిన, శ్రోణిన్ = ఇసుకతిన్నెల వంటి పిఱుదులు కలది; మృగరాజ మధ్యన్ = సింహంయొక్క నడుములాంటి నడుము కలదియైన రుక్మిణిని; కని = చూచి; విభ్రాంత+ఆత్ములు+అయిరి = చలించిన మనస్సు కలవారయ్యారు.

తా॥ తుమ్మెదల వంటి ముంగురులు, చంద్ర బింబంలాంటి ముఖము, లేడికన్నుల వంటి కన్నులు, పగడం/చిగురు వంటి క్రిందిపెదవి, కోకిల కంఠం వంటి కంఠం, లేత చిరుగుటాకులలాంటి రెండు పాదాలు, మదగజకుంభాలలాంటి చన్నులు, ఇసుక తిన్నెలలాంటి పిరుదులు, గజేంద్ర గమనం లాంటి గమనం, కెందామరలలాంటి చేతులు, కమల గంధంలాంటి దేహగంధం, సింహం నడుమువంటి నడుమూ కలిగిన రుక్మిణిని అక్కడున్న రాజులందఱు జూచి చపలచిత్తులయ్యారు.

వ్యాఖ్య : నవవధువు యొక్క సావయవ వర్ణన.

అక్కడున్న వారందఱు పెండ్లి కూతురును చూస్తున్నారు. ఉన్నవారు వీరులైన రాజులేకదా! ఆ వీరులను మోహింప జేసే రుక్మిణీ దేవి యొక్క అంగ ప్రత్యంగసౌందర్యాన్ని చిత్రించిన కవి వాగ్విలాసమిది. ప్రేక్షకుల దృష్టి మొదట ఉత్తమాంగం మీదనే ప్రసరిస్తుంది.

రుక్మిణీ దేవి ముంగురులు నల్లని తుమ్మెదల్లాగా ఫాలభాగం మీద నర్తిస్తున్నాయి. ముఖం చూస్తే షోడశకళాపూర్ణమైన చంద్రబింబంలాగా తెల్లగా, చల్లగా చూచినా కొద్దీ చూడాలనే బుద్ధిని ప్రేరేపిస్తూ ఆహ్లాదకరం గా ఉంది.

అనికదా నానుడి. కన్నులు సాధు జంతువైన లెడెయొక్క కన్నుల్లాగా ఆకర్షణీయంగా ఉన్నాయి. అధర మా ప్రవాళంలాగా లేత ఎఱుపు వన్నెతో ముచ్చటగా ఉంది.

'ప్రవాళ' శబ్దానికి 'చిగురుటాకు' అనే అర్థం కూడా ఉంది. చిగురు మృదువుగా, అరుణ వర్ణంగానే ఉంటుంది. అధరాన్ని (క్రిందిపెదవిని) జుంటిమోవి అనీ తేనెపెఱ అనీ మధురంగా వర్ణిస్తారు కూడా. చాలావరకు కవులు మోవిని రాగవర్ణశోభితమైన పగడంతోనే పోలుస్తారు. పంటితోనొక్కితే చిగురుచినిగి పోతుంది, వాడి పోతుందని, పగడంతో పోల్చడమే సముచితం కదా!

కంఠస్వరం అవ్యక్తమధురంగా పంచమస్వరాన్ని ఆలాపించే కోకిల కంఠస్వరం లాంటిది. విన్నాకొద్దీ ఇంక వినాలనిపిస్తుంది. కామోద్దీపకంగా ఉంటుంది. ఒక

ఉత్తమాంగంలోనే అనేకావయవాలశోభ విభ్రాంతాత్ములను చేస్తుంది. ఇక ఉత్తమాంగానికి ఆధారమైన కరచరణాద్యవయవాల శోభకు చిత్తం చెదరకుండ మారకుంటుందా? పూర్వకాయాన్ని నిలిపేవి పాదాలు కాబట్టి, ఈ భాగంలో మొదట, అడుగులు చిగురుటాకులవలె మెత్తగా, ఎఱ్ఱగా ఉండి, పుడమిమీద అడుగుపెడితే కందిపోయే రీతిగా సుకుమారంగా ఉన్నాయట. చిగురు టాకులు రెండు దళంగా ఉంటాయి. రుక్మిణి నవపల్లవాంఘ్రి యుగళగా వర్ణింపబడింది. చన్నులు గంధేభకుంభాలలాగా ఉబ్బెత్తుగా ఉన్నాయి. వ్యాస భాగవతం 'వ్యంజత్స్తనీం'- యౌవనప్రాదుర్భావ సూచక స్తనాలుకలదని స్వభావోక్తిగా వర్ణించింది. ఈ పద్యంలో అతిశయోక్తిగా ఉంది. కుచ వర్ణన తర్వాత జఘన వర్ణన పృష్ఠ భాగంలో ప్రాధాన్యాన్ని సంతరించుకోవడం స్పష్టమే. పిఱుదులు, నీటి పాయతగ్గగా ఏర్పడిన ఇసుక దిబ్బల లాగా, కేళీవిలాసాని కనువుగా ఉన్నాయి. గజేంద్ర గమనం లాంటి గమనంకలది, రాచబిడ్డ కాబట్టి రుక్మిణి ధీరగామిని. చేతులు లేత ఎరుపుతో రాణించే తామర పూవులలాగా నున్నగా, మెత్తగా రాగరంజితంగా ఉన్నాయి.

'ఉత్పలం' అంటె 'కలువ' 'మహోత్పలం' అంటే కమలమే. దేహంసాంతం కమలగంధం లాగా సువాసన లీనుతూ కమనీయంగా ఉంది.

ఆడవారికి గానీ మగవారికిగానీ నడుము సన్నగా ఉండడం సౌందర్య పోషకం. ముఖ్యంగా మగువలకు నడుము 'మేరుమందర సమానంగా' అంటే, లావుగా ఉంటే, వికారాన్ని సూచిస్తుంది.

సాధారణంగా ఇంతులకు నడుములు లేవనే కవులు వర్ణిస్తుంటారు.

"లేమి యనుమాట యెచ్చోట లేనెలేదు, మచ్చెకంటుల తను మధ్యములగాక" అని ఒకకవి వర్ణించాడు. పల్లె పాటలలో 'కందిరీగనడుముదాన' అనే మాట వినబడుతుంది. శారీరకంగా నడుము సన్నగా ఉండడమే ఆరోగ్యకరం. రుక్మిణీదేవి నడుము సింహంనడుములాగా, తిరుగడానికి, వంగడానికి, వాలడానికి, లేవడానికి చుఱుకుగా పనిచేయడానికి అనువుగా ఉంది.

ముఖం చంద్రబింబంతోనూ, ముంగురులు తుమ్మెదలతోనూ, మోవి ప్రవాళంతోను పోల్చి చెప్పడం కవి సంప్రదాయం. అలినీలాలక, పూర్ణచంద్రముఖి, ఏణాక్షిఇత్యాది ప్రయోగాలు కూడా ప్రసిద్ధమైనవి. రుక్మిణీదేవి శరీరావయవాలలో ఏ ఒక్క అవయవాన్ని చూచినా మోహజనకమే. ఇక ఆమె సర్వాంగ సౌందర్యాన్ని ఒక సమాహార స్త్రీ రూపంగా దర్శించేవారు విభ్రాంతా త్ములవడంలో ఆశ్చర్యమేముంది?

ఈ మత్తేభవృత్త పద్యంలో రుక్మిణికి పంౘ్రెండు విశేషణాలను ప్రయోగించి, ఆమెను 'ద్వాదశాత్మిక' యైన లక్ష్మీదేవిగా ధ్వనింప జేయడం మహాకవిలక్షణం.

**వ : మఱియు, నయ్యింతి దరహాస లజ్జావలోకనంబుల జిత్తంబులేమఱి, ధైర్యంబులు దిగనాడి, గాంభీర్యంబులు విడిచి, గౌరవంబులు మఱచి, చేష్టలు మాని, యెఱుకలుడిగి, యాయుధంబులు దిగవైచి, గజతురగ రథారోహణంబులు సేయనేరక, రాజులెల్లరు నేలకుఁ(వ్రాలిరి. ఆయేణీలోచన తన వామకర నఖంబుల నలకంబులు దలగంౘ్రోయుచు, నుత్తరీయంబు చక్కనొత్తుచు, గడకంటి చూపులంగ్రమంబున నారాజలోకంబునాలోకింపుచు.**

అర్థం : మఱియు = ఇంక; ఆ+ఇంతి = ఆవిడ రుక్మిణి యొక్క దరహాస, లజ్జా+ అవలోకనంబులన్ = చిరునవ్వుతో, సిగ్గుతోకూడిన చూపులచే; చిత్తంబులు = మనస్సులు; ఏమఱి = పరాకుపడి; ధైర్యంబులు = తాలుములు; దిగనాడి; విడిచి; గాంభీర్యంబులు = పెద్దఱికాలు; విడిచి = వదలి; గౌరవంబులు = గొప్ప తనాలు; మఱచి = విస్మరించి; చేష్టలు = కాళ్లు చేతులకదలికలు; మాని = లేనివారై; ఎఱుకలు = జ్ఞానాలు; ఉడిగి = పోయి; ఆయుధంబులు = రక్షించే పరికరాలను; దిగవైచి = జాఱవిడిచి; గజ తురగ రథ+ఆరోహణంబులు = ఏనుగులను, గుఱ్ఱాలను, అరదాలను, ఎక్కడం, చేయనేరక = చేయలేక; రాజులు; ఎల్లరు = అందఱు; నేలకు వ్రాలిరి = భూమి మీద పడిపోయారు. ఆ+ఏణీలోచన = లేడికళ్ళలాంటికళ్ళు గల రుక్మిణీదేవి; తన వామకర నఖంబులన్ = తన ఎడమచేతిగోళ్ళతో; అలకంబులు = ముంగురులను; తలగన్ త్రోయుచు = ఎగద్రోస్తూ, ఉత్తరీయంబు = పైటను; చక్కన్ ఒత్తుచున్ = సవరించుకొంటూ, కడకంటి చూపులన్ = ఓరచూపులతో; క్రమంబునన్ = వరుసగా; ఆరాజలోకంబున్ = ఆరాజసమూహాన్ని; ఆలోకింపుచు = చూస్తూ.

తా : ఆ రుక్మిణి యొక్క చిరునవ్వు, సిగ్గు గల చూపులచే ఆ రాజు లందఱు చిత్తస్వాస్థ్యం లేని వారై, తెలివిని గోల్పోయి, చేష్టలను మాని, ఆయుధాలను విడిచి, గజాశ్వరథాదివాహనాలను ఎక్కలేక పరవశులై నేలకొరిగారు. ఆ రుక్మిణి తన ఎడమ చేతిగోళ్ళతో ముఖంమీద పడుతున్న ముంగురులనెగద్రోస్తూ, పైటకొంగు సవరించుకొంటూ క్రమంగా రాజసమూహాన్ని చూస్తూ - (ముందుపద్యంతో సమన్వయం)

వ్యాఖ్య : రుక్మిణీ దేవిని జూచి కలతపడినరాజు లందఱిని రుక్మిణి చిన్నగా నవ్వుతూ, సిగ్గుపడుతూ చూడగానే తెలివి మాలిన రాజులందఱు వివశులై నేలకొరిగారు. తనకిష్టుడైన కృష్ణుడు కూడా ఆరాజు సమూహంలోనే ఉంటాడని,

చూపులకు అడ్డుగా మొగం మీద పడే ముంగురులనెగ(ద్రోస్తూ, జారుతున్న పైటకొంగును సవరిస్తూ, మళ్ళీ వరుసగా రాజలోకాన్ని చూస్తుంది. శిరోజాల, ఉరోజాల (ప్రాబల్యం మనోజవిజయ హేతువు. సౌందర్య (వతుల)కు ముంగురులను ఎడమచేతిగోళ్ళతో పైకి ఎగ(ద్రోయడమూ, పైటనుసవరించుకొంటూ దృష్టిని సారించడం స్వాభావికం. ఆచేష్టలు చూపరులకు ఆకర్షణకంగా ఉంటాయి కదా!

**కనియెన్ రుక్మిణి చం(ద్రమండల ముఖున్**
**గంఠీరవేం(ద్రావల**
**గ్ను నవాంభోజదళాక్షు జారుతరవ**
**క్షున్ మేఘసంకాశ దే**
**హునగారాతి గజేం(ద్ర హస్తనిభ బా**
**హుం జ(క్రి బీతాంబరున్**
**ఘనభూషాన్వితు గంబుకంఠు విజయో**
**త్కంఠున్ జగన్మోహనున్॥** 47

అర్థం : రుక్మిణి = రుక్మిణీదేవి; చం(ద్రమండలముఖున్ = చం(ద్రబింబం వంటి ముఖం కల్గినవాడు; కంఠీరవ+ఇం(ద్ర+అవలగ్నున్ = (శ్రేష్ఠమైన సింహం యొక్క నడుము వంటినడుముకలవాడు; నవ+అంభోజ దళ+అక్షున్ = అప్పుడే వికసించిన తామర రేకులలాంటి కన్నులు కలవాడును; చారుతరవక్షున్ = చాలా అందమైన ఱొమ్ముగలవాడును; మేఘసంకాశదేహున్ = నల్లమబ్బును పోలిన దేహ వర్ణం కలవాడును, నగారాతి - బాహున్ = నగ = పర్వతాలకు, ఆరాతి = శ(త్రువైన, ఇం(ద్రుని యొక్క; గజ+ఇం(ద్ర = (శ్రేష్ఠమైన ఏనుగు - ఐరావతం యొక్క; హస్త = తొండంతో; నిభ = సమానమైన, బాహున్ = భుజాలు కలవాడును; చ(క్రిన్ = చ(క్రంకలవాడును; పీత+అంబరున్ = పసుపువన్నెగల పట్టువస్త్రం కలవాడును; ఘనభూష+అన్వితున్ = గొప్ప ఆభరణాలతోకూడిన వాడును; కంబుకంఠున్ = శంఖంలాంటి మెడగలవాడును; విజయ+ఉత్కంఠున్ = జయమందు వేడుక గలవాడును; జగత్+మోహనున్ = లోకాలను మోహింపజేసే వాడైన కృష్ణుణ్ని; కనియెన్ = చూచెను.

తా : రుక్మిణీ దేవి, చం(ద్రబింబం లాంటి ముఖమూ, మేటి సింగం యొక్క నడుములాంటి నడుమూ, సద్యోవికసిత పద్మప(త్రాలలాంటి కన్నులూ, మిక్కిలి సుందరమైన వక్షఃస్థలమూ, మేఘశ్యామదేహమూ, ఐరావతమనే ఏనుగు తొండం లాంటి బాహువులు కలిగి, చ(క్రాన్ని ధరించిన, పసుపుపచ్చని పట్టుదోతిని కట్టుకొని యున్న, గొప్ప ఆభరణాలతో శోభిస్తున్న శంఖంలాంటి గుం(డ్రని, నిగనిగలాడే మెడగలిగి, విజయోత్సాహంకలిగియున్న జగన్మోహనుడైన కృష్ణమూర్తిని చూచింది.

వ్యాఖ్య : నూతన వరుని సావయవ వర్ణన.

ప్రప్రథమంగా రుక్మిణి కృష్ణమూర్తిని చూచిన తీరును ప్రదర్శించిన సహజ కవి కేసరి వాగ్విభూతి ఇది.

రాజలోకాన్ని ఆలోకిస్తున్న రుక్మిణికి లోకోత్తరుడైన కృష్ణుని ఆకృతి మనోనయనానందకరంగా కనబడింది. పూర్వం పెద్దలచేత విన్న ప్రియుని లక్షణాలన్నీ వధువు యొక్క సద్యఃస్ఫూర్తి వల్ల కృష్ణమూర్తియందు ఏకీభవించాయి. "యథా ప్రహ్లాదనాత్‌చంద్రః" అన్నట్లు లోకానికి ఆహ్లాదాన్ని సమకూర్చే చంద్రమండలంలాగా కళలు దేలుతున్న కృష్ణుని ముఖమండలాన్ని రుక్మిణి కన్నుల పండుగుగా సేవించింది. పౌరులు రుక్మిణీ కృష్ణుల అనురూప్యాన్నిబట్టి వారి దాంపత్యాన్ని ప్రతిపాదించినట్లే వారి సాష్టావాయవవిశిష్టమైన రూపసాదృశ్యం 'అలినీలాలక - 'కనియెన్ రుక్మిణి' - అనే రెండు పద్యాల రచనసౌందర్యంలో స్ఫురించక మానదు.

రుక్మిణి పూర్ణచంద్రముఖి, కృష్ణుడు చంద్రమండలముఖుడు. వధువు ఏణాక్షి. వరుడు నవాంభోజదళాక్షుడు. ఆమె కలకంఠి. ఆయన కంబుకంఠుడు. పెండ్లికూతురు గంధేభకుంభస్తని అయితే, పెండ్లికొడుకు కాకున్నా (రుక్మిణి దృష్టిలో) చాలా అందమైన, విశాలమైన మహోరస్కుడు. ఆవిడ మృగరాజమధ్య, అతడు కంఠీరవేంద్రావలగ్నుడు. కన్య నీరమోహిని, కాంతుడు జగన్మోహనుడే.

రెండు పద్యాలలోనూ వృత్త సామ్యం, విశేషణపదాల సంఖ్యాసామ్యం, రుక్మిణి కృష్ణుల పరస్పర సాదృశ్యాన్ని దృఢపరుస్తున్నది. నగారాతి గజేంద్ర హస్తనిభబాహుడైన చక్రి, అరుణాంభోజాతహస్తయైన రుక్మిణిని పరిగ్రహించి, తీసుకొని పోయే విజయోత్కంఠుడుగా కనబడడం విశేషంగా శిల్పరామణీయకాన్ని స్ఫురింపజేస్తున్నది.

విశేషణ పద సంఖ్యనుబట్టి కృష్ణుడు 'ద్వాదశాత్ము'డని ధ్వనిస్తున్నది. అంటే, సూర్యమండల మధ్య వర్తియైన నారాయణుడని వ్యక్తమవుతున్నది. 'భాస్కరేణ ప్రభాయథా" అన్నట్లు రుక్మిణి 'ద్వాదశాత్మిక' గాగోచరిస్తున్నది. ఈ సాదృశ్యం నాన్యతో దర్శనీయం. కథాకథన శిల్పం అనితరసాధ్యమైన ఘన వాగ్భూషాన్వితం. ప్రతిపదంలో 'ఉపమా' వాక్పాకం చవులూరిస్తున్నది. 'దళాక్షు, చారుతర వక్షు' - అలాగా 'కంబుకంఠుడు. విజయొత్కంఠుడుగా కనిపించే వృత్త్యనుప్రాస, ఉల్లాసాన్ని పల్లవింపజేస్తున్నది. ముఖ్యంగా ఇభేంద్ర యాన 'మత్తేభవృత్తా'న్నే స్వచ్ఛందంగా అనన్య భోగ్యంగానూ గమనించడం 'ఆకారత్రయ సంపత్తి' ని ఆవిష్కరిస్తున్నది.

**వ : కని తదీయ రూప వయోలావణ్య వైభవ గాంభీర్య చాతుర్య తేజో విశేషంబులకు సంతసించి, మనోభవ శరాక్రాంతయై, రథారోహణంబు గోరుచున్న వరారోహంజూచి, పరిపంథి రాజలోకంబులు సూచుచుండ, మందగమనంబున గంధ సింధురంబు లీల జనుదెంచి, ఫేరవంబుల నడిమిభాగంబుగొనిచను కంఠీరవంబుకైవడి, నిఖిల భూపాలగణంబుల గణింపక, తృణీకరించి, రాజకన్యకం దెచ్చి, హరితన రథంబు మీదనిడుకొని, భూనభోంతరాళంబులు నిండ, శంఖంబు పూరించుచు, బలభద్రుండు తోడనడవ, యాదవ వాహినీ పరివృతుండై, ద్వారకా నగరమార్గంబు వట్టిచనియె. అంత జరాసంధవశులైన రాజులందఱు హరి పరాక్రమంబు విని సహింపనోపక.**

అర్థం : రుక్మిణి, కని = శ్రీకృష్ణమూర్తిని చూచి; తదీయ - విశేషంబులకు/ తదీయ = అతనివైన, రూప = చక్కదనం, వయః = ప్రాయం, లావణ్య = దేహకాంతి, వైభవ = ఐశ్వర్యం, గాంభీర్య = గంభీరత్వం, చాతుర్య = నేర్పు, తేజః = తేజస్సు వీటియొక్క; విశేషంబులకు = అతిశయాలకు; సంతసించి; మనోభవ శర + ఆక్రాంతయై = మన్మథుని బాణాలచే ఆక్రమింపబడినదై; రథ+ఆరోహణంబున్ = రథమెక్కడాన్ని; కోరుచున్న = అపేక్షిస్తున్న; వరారోహన్ = శ్రేష్ఠమైన పిఱుదులుగల రుక్మిణీ దేవిని; చూచి; హరి = కృష్ణుడు; పరిపంథిరాజలోకంబులు = శత్రురాజుల సమూహాలు; చూచుచుండన్ = చూస్తుండగా; మందగమనంబునన్ = మెల్లని నడకతో; గంధసింధురంబు లీలన్ = మదపుటేనుగు లాగా; చనుదెంచి = వచ్చి; ఫేరవంబుల నడిమిభాగంబున్ = నక్కల నడుమ ఉన్న మాంసఖండాన్ని; కొని చను = తీసుకొని పోయే; కంఠీరవంబు కైవడి = సింహంవలె; నిఖిలభూపాలగణంబులన్ = సకలరాజ సమూహాలను; గణింపక = లెక్కించక; తృణీకరించి = గడ్డిపోచనుగా తలచి; లక్ష్యపెట్టక; రాజకన్యకన్ = రాచకూతురైన రుక్మిణిని; తెచ్చి; తన రథంబుమీదన్+ఇడుకొని = తన తేరుమీద ఎక్కించుకొని; భూనభస్+అంతరాళంబులు నిండన్ = భూమి, ఆకాశ మధ్య ప్రదేశాలునిండేరీతిగా; శంఖంబు = పాంచజన్యమనే శంఖాన్ని; పూరించుచు = (గాలిని) నింపుతు - ఊదుతూ; బలభద్రుండు = బలరాముడు; తోడ నడవన్ = వెంటరాగా; యాదవ వాహినీ పరివృతుండై = యాదవ సేన చేత చుట్టు సేవింపబడిన వాడై; ద్వారకా నగర మార్గంబు+పట్టి = కుశస్థలీ నగరపు దారిని బట్టి; చనియెన్ = పోయెను. అంతన్ = అప్పుడు; జరాసంధవశులైన = జరాసంధునికిలోబడిన ; రాజులందఱు; హరి పరాక్రమంబువిని = కృష్ణుని శౌర్యవృత్తాంతాన్ని విని; సహింపన్+ఓపక = ఓర్వజాలక.

తా : రుక్మిణీ దేవి శ్రీకృష్ణమూర్తిని చూచింది. అతని రూపం, వయస్సు, అందం, ఐశ్వర్యం, గాంభీర్యం, చాతుర్యం, తేజస్సు, మొదలుగా గల వీటిమేలిమికి సంతోషించింది. మదన వేదన పొంది రథం మీద కెక్కాలనే ఆశపడుతున్నది. ఆమె స్థితిని చూచిన కృష్ణుడు శత్రురాజులందఱు చూస్తుండగా మదగజంలాగా మెల్లగా నడచి వచ్చాడు. నక్కలు తినడానికని తెచ్చి తమ నడుమ పెట్టుకొన్న మాంసపు ముద్దను తీసుకొనిపోయే సింహంవలె, రాజులందఱిని లక్ష్యపెట్టకుండా కృష్ణుడు రుక్మిణిని ఎత్తుకొని పోయి తన రథంమీద నెక్కించుకొన్నాడు. పాంచజన్యమనే తన శంఖాన్ని పూరించాడు. బలరాముడు వెంట రాగా, యాదవసైన్యం తన చుట్టూ సేవిస్తూ వస్తుండగా, ద్వారకాపట్టణ మార్గాన్ని బట్టి పోయాడు. అప్పుడు జరాసంధుని అధీనంలో ఉన్న రాజులందఱు కృష్ణుని వీరచరిత్రను విన్నారు. వారు కృష్ణుడు రుక్మిణిని ఎత్తుకొని పోవడాన్ని ఓర్వలేని వారయ్యారు.

(తాత్పర్యం స్పష్టం)

**ఘనసింహంబులకీర్తి నీచమృగముల్ గైకొన్న చందంబునన్**
**మన కీర్తుల్ గొని బాలదోడ్కొనుచు నున్మాదంబుతో గోపకుల్**
**సనుచున్నారదె శౌర్యమెన్నటికి మీశస్త్రాస్త్రముల్ గాల్పనే**
**తను మధ్యన్ విడిపింపమేని నగరే ధాత్రీజనుల్ గ్రంతలన్** 48

అర్థం : ఘన సింహంబుల కీర్తి = గొప్ప సింహాల యొక్క కీర్తిని; నీచమృగముల్ = క్షుద్రజంతువులు - జింకలు; నక్కలు; కైకొన్న చందంబునన్ = తీసుకొన్న విధంగా, మనకీర్తుల్ మనయశస్సులను; కొని = అపహరించుకొని; బాలన్ = కన్యను; తోడ్కొనుచున్ = వెంటదీసుకొంటూ; ఉన్మాదంబుతో = గొప్పగర్వంతో; గోపకులు = గొల్లవారు; అదె = అడుగో; చనుచున్నారు = పోతున్నారు; శౌర్యము = మీ శూరత్వం; ఎన్నటికిన్ = ఎప్పటికి; మీ శస్త్ర+అస్త్రముల్ = మీ ఆయుధాలు; కాల్పనే = అగ్గిలో తగులబెట్టడానికేనా? తను మధ్యన్ = సూక్ష్మమైన నడుముగల పడుచును; విడిపింపమేని = వదలింపకుంటే; ధాత్రీజనుల్ = భూమియందలి ప్రజలు; క్రంతలన్ = సందుగొందుల్లో జేరి; నగరే = నవ్వుకోరా?

తా : గొప్ప సింహాల కీర్తిని అల్పమృగాలు అపహరించు కొనిపోయినట్లు, గొల్లవారు మన పేరు ప్రతిష్ఠలను అపహరించుకొని పడుచును ఎత్తుకొనిపోతున్నారు. అదిగోచూడండి. మీ శూరత్వం ఇక ఎప్పుడు ఉపయోగపడుతుంది? మీ శస్త్రాస్త్రాలు మంటలో తగులబెట్టనా? ఈ పడుచును మనం విడిపించకపోతే ప్రజలు సందు గొందుల్లో జేరి ఎగతాళి జేయరా?

వ్యాఖ్య : తత్తర పడుతున్న రాజులు ఒకరికొకరు అనుకొంటున్న పొడుపుమాటలు. గొల్లవారు కుడియెడమలు తెలియని వారు. వారు నీచమృగాలవంటివారు. యాదవ సమూహం నక్కలమందయే అని కృష్ణుని విరోధుల భావన. జరాసంధాది రాజులు అభిమానధనులు. పరాక్రమంలో సింహాలలాంటివారు. సింహాల పేరుప్రతిష్ఠలను నక్కలు అపహరించినట్లే, మనం చూస్తూండగనే మన మధ్యనుంచి పెండ్లి పడుచును గొల్లలెత్తుకొని పోతున్నారు. ఇంక చూస్తున్నారేమి? మన శౌర్యాన్ని ఇప్పుడు గాక ఎప్పుడు చూపించేది? మన కీర్తి కొల్లగొట్టబడింది. ఎంత పరాభవమిది. (మూల గ్రంథంలోనూ ఇట్లే "గోపైర్వృతం కేసరిణాంవృకైరివ" అని ఉంది) మీకు, మాకు ఉన్న ఈ శస్త్రాలూ, అస్త్రాలూ మంటల్లో తగలేయడానికేనా అని ఆక్రోశంతో ఒకరినొకరు ఎచ్చరించుకొంటున్నారు. శస్త్రాలు, అస్త్రాలు అన్నా, ఆయుధాలే. కాని, అస్త్రాల ప్రయోగ, ఉపసంహారాలు మంత్రాను సంధానంపైన ఆధారపడి ఉంటాయి. ప్రయోగింపబడిన అస్త్రాలు తమ పనిని పూర్తిచేసుకొన్న తర్వాత తిరిగి ప్రయోక్తను చేరుకొంటాయి.

ఏ ఒక్కరికీ ఎదిరించే ధైర్యం లేక, రాజులందఱు కలిసి పోరాడాలనీ కూడపలుక్కొన్నారు. ఇప్పుడీ పడుచును పోతే పోనిమ్మని విడిచి పెడితే - యాదవుల చెఱనుంచి విడిపించకపోతే - ఈ రాజులందఱు ఇంతచేతగాని వారుకదా! అంటూ సందుగొందుల్లో ఉన్న సామాన్యజనులు కూడా గుంపుగా కూడినవ్వక పోతారా? అని, రోషం గుండెల్లో గూడుకట్టుకొనే రీతిగా పలికారు.

"ఘనసంహంబులకీర్తి నీచమృగముల్ గైకొన్న చందంబునన్" అనే ఉపమాలంకారం, రాజుల దురహంకారాన్ని ప్రకటిస్తున్నది. మత్తేభవృత్త పద్యం.

**వ : అని యొండొరుల దెల్పుకొని, రోషంబులు హృదయంబుల నిల్పుకొని, సంరంభించి, తనుత్రాణంబుల వహియించి, ధనురాది సాధనంబులు ధరియించి, పంతంబు లాడి, తమ తమ చతురంగ బలంబులంగూడి, జరాసంధాదులు యదువీరుల వెంటనంట దాకి నిలునిలుండని ధిక్కరించి పలికి, యుక్కుమిగిలి, మహీధరం బులమీద సలిలధారలు గురియు ధారాధరంబుల చందంబున, బాణవర్షంబులు గురిసిన, యాదవసేన లంగల దండనాథులు కోదండంబులెక్కిడి, గుణంబులు మ్రోయించి, నిలువంబడిరి. అప్పుడు**

అర్థం : ఒండొరులన్ = ఒకరినొకరిని; తెల్పుకొని = ఎచ్చరించుకొని, రోషంబులు = కోపంబులు; హృదయంబులన్ = మనస్సులందు; నిల్పుకొని = ఉంచుకొని; సంరంభించి = ఆటోపించి; తను త్రాణంబులు = శరీరాన్ని రక్షించే కవచాలను; వహించి = ధరించి, ధనుః+ ఆది సాధనంబులు = విండ్లు మొదలైన పోటుముట్లు; ధరియించి = పట్టుకొని; పంతంబులు + ఆడి = ప్రతినలు పలికి; తమ తమ చతుః+అంగంబులన్ కూడి = వారి వారి నాలుగు అంగాలు గల సేనల తోకూడుకొని; జరాసంధ+ఆదులు =జరాసంధుడు మొదలైనవారు; యదువీరుల వెంటన్ = యాదవ యోధులవెంబడి; అంటన్+తాకి = కదియబోయి; నిలునిలుము+అని; ధిక్కరించి = గద్దించి, పలికి; ఉక్కుమిగిలి = బలంకలుగ జేసుకొని; మహీధరంబుల మీదన్ = పర్వతాలపైన; సలిలధారలు = నీటిధారలను; కురియు = వర్షించు; ధారాధరంబుల = మేఘాల; చందంబునన్ = విధంగా; యాదవ సేనలం + కల = యాదవసైన్యంలో ఉన్న; దండ నాయకులు = సేనాధిపతులు; కోదండంబులు = ధనుస్సులను; ఎక్కిడి = ఎక్కుపెట్టి; గుణంబులు = అల్లెత్రాళ్ళను; మ్రోయించిరి = టంకారం చేసిరి. అప్పుడు = ఆ సమయాన.

తా : అని ఒకరి భావాలను మరొకరికి తెల్పుకొని జరాసంధుడు మొదలైన రాజులు కోపాటోపాలతో కవచాలను తొడుగుకొని, విల్లమ్ములు మొదలైన పోటు ముట్లను పట్టుకొని బింకాలాడుతూ చతురంగ బలాలతోకూడి యాదవ సేనలను వెంబడించారు. నిలువుమని గద్దించి పలికారు. బలాన్ని పెంచుకొని గుట్టలమీద మేఘాలు వానలను కురిపించినట్లు రాజులు యాదవులమీద బాణాల (వానల)ను కురిపించారు. (ఈ ఉపమాలంకారవాక్యం వల్ల యాదవులమీద ప్రభావమేమీ చూపజాలలేదని స్ఫురిస్తుంది.) యదుసైన్యంలోని దండనాయకులు కూడా ధనస్సులను ఎక్కుపెట్టారు. నారీటంకారధ్వనులను చేశారు. అప్పుడు (తాత్పర్యం స్పష్టం)

**అరి బలభటసాయకముల**
**హరి బలములు గప్పబడిన నడలెడి భీతిన్**
**హరి మధ్య సిగ్గుతోడను**
**హరివదనము జూచె చకితహరిణేక్షణయై॥** 49

అర్థం : అరి-ములన్! అరి = శత్రువులయొక్క; బల = సేనలయందలి; భట = యోధుల యొక్క; సాయకములన్ = బాణాలచేత; హరిబలములు = కృష్ణుని సేనలు; కప్పబడినన్ = క్రమ్మబడగా; అడరెడి భీతిన్ = అతిశయించిన భయం చేత; హరిమధ్య = సింహంలాంటి నడుముగల రుక్మిణీదేవి; సిగ్గుతోడను = లజ్జతో; చకిత హరిణ+ఈక్షణ యై = భయపడిన జింకయొక్క చూపులవంటి చూపులుకలదై; హరివదనమున్ = కృష్ణుని ముఖాన్ని; చూచెన్ = చూచెను.

తా : శత్రు సేనలు బాణాలను ప్రయోగించి కృష్ణునిసేనలను ఆక్రమించాయి. రుక్మిణీదేవి సిగ్గుపడుతూనే, భయంతో బెదరిన లేడిచూపుల లాంటి చూపులు చేత శ్రీకృష్ణుని ముఖాన్ని చూచింది.

వ్యాఖ్య : రుక్మిణీదేవి లజ్జాభయాలు పెనుగొనగా, కృష్ణుని ముఖం చూచింది.

తనకారణంగా శత్రుసైన్యం కృష్ణుని సైన్యాన్ని బాణవర్షం కురిపిస్తూ ఆక్రమించడం వల్ల ఏమి ప్రమాదం సంభవిస్తుందో అని రుక్మిణిదేవి భయపడింది. లోకంలో అర్థం వల్లనో, ఆడవారి వల్లనో తఱచుగా యుద్ధాలు సంభవిస్తుంటాయి. తన ప్రణయం ప్రళయానికి దారి తీసెకదా! అని ఎడదలో బెడదతో అదరిపోతున్నది. కరగ్రహణమేకాని ఇంతవరకు కృష్ణుడు పలుకలేదు. కులుకలేదు అని ఉలుకుతున్న ఆవిడకు తన స్వామితో ఏమి పలుకాలో తోచడం లేదు. చిన్నగా కలికి పలుకరించాలనుకుంటే సిగ్గు తలెత్తనీయడం లేదు. తనను లేవనెత్తుకొని పొమ్మని చెప్పిన లేమ, తత్పలమీవిధంగా పరిణమించినందువల్ల సిగ్గుతో ముందుకు నెగ్గలేక పోతున్నది. పైగా ఈ నవోఢ హరిమధ్య; సింగం నడుములాంటి సన్నని నడుము కలది కాబట్టి, లజ్జాభయాలతో శరీరం నకనకలాడుతుంటే, చూపులు లేడిచూపులయ్యాయి.

లేళ్లుఅమాయిక మృగాలు. సామాన్యంగా ప్రాకృతిక దృశ్యాలను ఇటూ - అటూ చూస్తూ నిలబడిన వాటిని వేటగాళ్ళు బంధించడానికో, వధించడానికో ప్రయత్నిస్తారు. కాబట్టి, ఎప్పుడేమి హాని సంభవిస్తుందో అని లేళ్ళ కళ్ళు బెదరి బెదరి చూస్తుంటాయి. అనుమానం కలిగిందంటే వాటికి పిక్కబలం ఎక్కువగా ఉంది కదా! అదిస్రష్ట చేసిన సృష్టిరహస్యం.

ఇప్పుడు రుక్మిణి ఏమీ పలుకలేక, ఉలికి పడుతూ హరిణేక్షణ యై కృష్ణుని ముఖం వంక జూచింది. ద్విప్రాసతోకూడిన కందపద్యమిది.

**వ : అని ఇట్లు చూచిన. (ఈ విధంగా చూచినరుక్మిణీ దేవితో -)**

**వచ్చెదరదె యదు వీరులు**
**వ్రచ్చెదరరిసేనలెల్ల వైరులు పెలుచన్**
**నొచ్చెదరును విచ్చెదరును**
**జచ్చెదరును నేడు చూడు జలజాతాక్షీ॥** **50**

అర్థం : జలజాతాక్షీ = కమలాలవంటి కన్నుల గల ఓ రుక్మిణీ! యదువీరులు = యాదవయోధులు; అదె = అదిగో; వచ్చెదరు = వస్తారు. అరిసేనల+ఎల్లన్ = పగవారిసేనలనూ,

అందఱిని; వ్రచ్చెదరు = వ్రయ్యలు చేస్తారు; నేడు = ఈ వేళ; వైరులు = పగవారు; పెలుచన్ = అత్యంతం; నొచ్చెదరును = బాధపడుతారు. విచ్చెదరును = విడిపోతారు కూడా; చచ్చెదరును = చస్తారు కూడా; చూడు = చూస్తుండుమని కృష్ణుడు ఊరడించాడు.

తా : ఓ పద్మాక్షీ! అదిగో యాదవయోధులువచ్చి శత్రువులను ఎదిరిస్తారు. ఇప్పుడు నీవు చూస్తూ ఉండు. నీకన్నుల ముందరనే పగవారందఱు నొచ్చి పోతారు. తొలగిపోతారు, చచ్చిపోతారు కూడా అని శ్రీకృష్ణుడు రుక్మిణితో అన్నాడు.

వ్యాఖ్య : శ్రీకృష్ణుడు మొట్టమొదట రుక్మిణితో పలుకుతున్న మాటలు ఓ పద్మాక్షీ! విశాలమైన కన్నులు కలిగి అన్నీ చూడగలిగిన సామర్థ్యం కలిగిన దానా! నీ వెందుకు భయపడుతుంటావు? మనకేమి హానిజరగదు. శత్రుసేనలు మనసేనలను ముట్టడించగా, మన యాదవసైన్యం మాత్రం ఊరక చేతులుముడుచుకొని చూస్తుంటుందా? అదిగో! మను యాదవసేనానులు యుద్ధానికి సన్నద్ధమై నారీటంకారధ్వనులు చేస్తూ వస్తున్నారు. పోరులోపగవారిని నుఱుమాడి, పీచమడంచి, చంపుతారు. నీవు చూస్తుండగా శత్రువులలో కొందఱు గాయపడి బాధపడుతారు. కొందఱు తొలగి పోతారు. కొందఱు చస్తారు కూడా; అని వీరోచితమైన మాటలతో శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవిని ఓదార్చాడు. తనను వలచిన వనితను వీరోచిత వాగ్విన్యాసంతో మొట్టమొదట నిశ్చింతగా ఉండే విధంగా శ్రీకృష్ణుడు ఓదార్చడం మహాపురుష లక్షణంగా గోచరిస్తున్నది కదా! చకార ద్విత్వంతో త్రిప్రాసగల ఈకందపద్యం శత్రువీరులను చెదరగొట్టే లక్షణాన్నే అధికంగా గోచరింపచేస్తూ స్వభావోక్తియేగాని అతిశయోక్తి కాదని ప్రకటిస్తున్నది. ఇది కృష్ణమూర్తి ప్రప్రథమంగా రుక్మిణికి అభయ మిచ్చినవిధం.

**వ : అని రుక్మిణీ దేవిని హరియూరడించె. అంత బలభద్ర ప్రముఖులైన యదువీరులు ప్రళయవేళ మిన్నునంబన్నిన బలుపిడుగుల నడరించి పెను మొగుళ్ళ వడవున, జరాసంధాది పరిపంథి రాజ చక్రంబు మీదన వక్రపరాక్రమంబున శిఖిశిఖాసంకాశ నిశిత శిలీముఖ నారాచభల్ల ప్రముఖంబు లైన బహువిధ బాణ పరంపరలు గురియ, నదియును విదళిత మత్తమాతంగంబును, విచ్ఛిన్న తురంగంబును, విభిన్న రథవరూథంబును, వినిహత పదాతి యూథంబును, విఖండిత వాహవారణ రథారోహమస్తకంబును, విశకలిత వక్షో మధ్య కర్ణకంఠ కపోల హస్తంబును, విస్ఫోటిత కపాలంబును,**

**వికీర్ణకేశజాలంబును, విపాటిత చరణజాను సంఘంబును, విదళితదంత సంఘంబును, విఘటిత వీరమంజీర కేయూరంబును, విభ్రష్టకుండల కిరీట హారంబును, విశ్రుత వీరాలాపంబును, విదార్యమాణ గదా కుంత తోమర పరశు పట్టసప్రాస కరవాలశూల చక్ర చాపంబును, వినిపాతిత కేతన చామరచ్ఛత్రంబును, విలూన తనుత్రాణంబును, వికీర్య మాణ ఘోటకసంఘ రింఖా సముద్ధూత ధరణీ పరాగంబును, వినష్ట రథవేగంబును, వినివారిత సూత మాగధ వంది వాదంబును, వికుంఠిత హయహేషాపటహభాంకార, కరటి ఘటా ఘీంకార, రథనేమి ఘటాత్కార, తురగ నాభిఘంటాఘణ ఘణాత్కార, వీర హుంకార, భూషణ ఝణఝణాత్కార, నిస్సాణ ధణ ధణాత్కార, మణి నూపుర క్రేంకార, కింకిణీ గణకిణాత్కార, శింజినీ టంకార, భట పరస్పర ధిక్కారనాదంబును, వినిర్భిద్యమాన రాజసమూహంబును, విద్యమానరక్త ప్రవాహంబును, విశ్రూయమాన భూతభేతాళ కలకలంబును, విజృంభమాణ ఫేరవకాక కంకాది సంకులంబును, ప్రచలిత కబంధంబును, ప్రభూత పలల గంధంబును, ప్రదీపిత మేదో మాంసరుధిర ఖాదంబును, ప్రవర్తితడాకినీ ప్రమోదంబునునై యుండె. అప్పుడు.**

అర్థం : అని = పైన చెప్పినరీతిగా, హరి = కృష్ణుడు రుక్మిణీ దేవిని; ఊరడించె = ఓదార్చెను; అంత = ఆసమయంలోనే; బలభద్రప్రముఖులైన = బలరాముడు మొదలైన; యదువీరులు = యాదవయోధులు; ప్రళయవేళన్ = ప్రళయకాలంలో; మిన్నునన్ = ఆకాశమందు; పన్నిన = వ్యూహంగాఏర్పడిన; బలుపిడుగులన్ = బలవంతమయిన పిడుగులను; అడరించి = వ్యాపింపజేసి; పెనుమొగుళ్ళ వడువునన్ = గొప్పమేఘాలవలె; జరాసంధ+ఆది = జరాసంధుడు మొదలుగాగల; పరిపంథి రాజ చక్రంబు మీదన్ = శత్రురాజసమూహంమీద; అవక్రపరాక్రమంబునన్ = నేరుగా బలపరాక్రమాలతో; శిఖిశిఖా - ప్రముఖంబులు/ శిఖి = అగ్నియొక్క; శిఖాసంకాశ = మంటలతో సమానమైన; నిశిత = వాడియైన; శిలీముఖ = ఎట్టులవంటి మొనలుగలిగిన బాణాలూ; నారాచ = సలాకలలాంటి బాణాలు; భల్ల = బల్లాలు; ప్రముఖంబులైన; మొదలైన; బహువిధబాణ పరంపరలు = నానా విధాలైన బాణాలశ్రేణి; కురియన్ = (వానగా) కురియగా; అదియును = ఆశత్రుసేనకూడా; విదళిత -బును/ విదళిత = నఱకబడిన; మత్తమాతంగంబును = మదించిన ఏనుగులు కలదై; విచ్ఛిన్న తురంగంబును = ఛేదింపబడిన గుఱ్ఱాలుకలదై; విభిన్న-బును/ విభిన్న = బాగా ఛేదింపబడిన; రథవరూథంబును = రథాల పైకప్పుకలదై; వినిహత-బును/ వినిహత = విశేషంబుగా చంపబడిన; పదాతియూథంబును = కాలుబలాలగుంపుగలదై; విఖండిత

- కంబును/ విఖండిత = ముక్కలుగా చేయబడిన, వాహ = గుఱ్ఱాలను, వారణ గజాలను; రథ = తేరులను; ఆరోహ = ఎక్కిన యోధుల యొక్క; మస్తకంబును = తలలుకలదై, విశకలిత-హస్తంబును/ విశకలిత = తునుకలుగా జేయబడిన; వక్షః = రొమ్ములు; మధ్య = నడుములు; కర్ణ = చెవులు; కంఠ = మెడలు; కపోల = చెక్కిళ్ళు; హస్తంబును = చేతులుగలదై; విస్ఫోటిత కపాలంబును = పగులగొట్టబడిన తలపుఱ్ఱెలు గలదై; వికీర్ణ కేశజాలంబును = విరియ జేయబడిన వెంట్రుకల సముదాయం కలదై; విపాటిత - ఘంబును/ విపాటిత = విరుగగొట్టబడిన; చరణ = పాదాలు, జాను = మోకాళ్ళు; జంఘంబును = పిక్కలు కలదై; విదళిత దంత సంఘంబును; రాలగొట్టబడిన నోటి పండ్లు గలదై; విఘటిత - రంబును/ విఘటిత = వదలగొట్ట బడిన; వీర మంజీర = వీరులకు బిరుదుగా తొడుగబడిన కాళ్ళ కడియాలు; కేయూరంబును = దండకడియాలు కలదై; విభ్రష్టకుండల కిరీట హారంబును = జాఱిపోయిన కర్ణాభరణాలూ, కిరీటమూ, ముత్యాల్యహారాలు కలదై; విశ్రుత వీర + ఆలాపంబున = వినబడిన యోధుల బింకపు మాటలు కలదై; విదార్య -బును/ విదార్యమాణ = చెక్కలుగా చీల్చబడిన; గదా = గదలు; కుంత = ఈటెలు; తోమర = చిల్లకోలలు; పరశు = గండ్రగొడ్డండ్లు; పట్టస = నిలువుగానుండే పట్టాకత్తులు; ప్రాస = బల్లాలు; కరవాల = ఖడ్గాలు; శూల = త్రిశూలాలు; చక్ర = చక్రాలు; చాపంబును = ధనుస్సులుగలదై; వినిపాతితకేతన చామరచ్ఛత్రంబును = పడగొట్టబడిన ధ్వజమూ, వింజామరాలూ, ఛత్రాలూ కలదై; విలూన తను త్రాణంబును = చినుగగొట్టబడిన కవచాలు కలదై; వికీర్య - బును /వికీర్యమాణ = చెదరుతున్న; ఘోటకసంఘ = గుఱ్ఱాల మందయొక్క; రింఖా = గిట్టలత్రొక్కిళ్ళచేత; సం+ఉద్ధూత = బాగా రేగ గొట్టబడిన; ధరణీ పరాగంబును = నేలయందలి దుమ్ము గలదై; వినష్ట రథవేగంబును = చెడగొట్టబడిన తేరుల వేగంగలదై; వినివారిత - దంబును/ వినివారిత = నివారింపబడిన, సూత = కీర్తి ప్రశంసకుల; మాగధ = ప్రతాపప్రశంసకుల; వంది = స్తుతిపాఠకుల; వాదంబును = స్తుతి పాఠం కలదై; వికుంఠిత = నాదంబును/ వికుంఠిత = ఆపబడిన; హయ హేషా = గుఱ్ఱాలసకిలింతలు; పటహ = తప్పెటలు; భాంకార = భాం అనే ధ్వనులు; కరటి ఘటా = ఏనుగుల గుంపుల యొక్క, ఘీంకార = ఘీంకారధ్వనులు; రథనేమి = రథచక్రాల కడకమ్ముల యొక్క; ఫటాత్కార = పటపటధ్వనులు; తురగ - త్కార/ తురగ నాభి = గుఱ్ఱాల బొడ్డుకు సమానంగా వ్రేలాడుతున్న, ఘంటా = గంటల ఘణ ఘణా త్కార = గణగణధ్వనులు; వీరహుంకార = వీరుల హుంకారాలు; భూషణ = ఆభరణాల, ఝణఝణత్కార = ఝణఝణధ్వనులు; నిస్సాణ ధణ ధణా త్కార = ఢంకాల ధణధణలు; మణి నూపుర = రత్నాలను పొదిగిన కాలియందెల; క్రేంకార = క్రేంకారాలు; కింకిణీ గణ, కిణాత్కార = చిరుగజ్జెల గుంపుల కిణకిణ ధ్వనులు; శింజినీటంకార = వింటినారుల టాంకారాలు; భట = యోధుల యొక్క; పరస్పర = ఒండొరుల; ధిక్కార నాదంబును = గద్దింపుల సవ్వడులు కలదై;

వినిర్భిద్యమాన రాజసమూహంబును = భేదింపబడిన రాజుల గుంపుగలదై; విద్య మానరక్త ప్రవాహంబును = తెలియ బడుతున్న నెత్తుటి వెల్లువలు కలదై; వి(శూయమాణ భూత భేతాళ కలకలంబును = వినబడుతున్న భూతాల, భేతాళుల కలకలధ్వనులు కలదై, విజృంభ - లంబును/ విజృంభమాణ = రేగుతున్న, ఫేరవ = నక్కలు; కాక = కాకులు, కంక = గద్దలు; (రాబందులు) ఆది = మొదలైన వాటి చేత; సంకులంబును = దట్టంగా చుట్టుకొన బడినదై, ప్రచలిత కబంధంబును = కదలబడిన (తలలేని) మొండెముల కలదై; ప్రభూత పలల గంధంబును = పుట్టిన మాంసవాసన కలదై, ప్రదీపిత - ఖాదనంబును / ప్రదీపిత = ప్రకాశింప జేయబడిన, మేదః = మెదడుయొక్క, మాంస = మాంసంయొక్క ఖాదనంబును = భక్షణ కలదై; ప్రవర్తిత- బునునై/ ప్రవర్తిత = సంచరింపబడిన, డాకినీ = డాకిని అనే పిశాచాల యొక్క, ప్రమోదంబునునై = సంతోషం కలదై; ఉండెను. అప్పుడు = ఆ సమయాన.

తా॥ ఆ విధంగా శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవిని ఊరడించాడు. అంతలోనే బలరామాది యాదవ యోధులు ప్రళయ కాలాన ఆకసమంతా వ్యాపించి పిడుగులను రాల్చే మేఘాల వలె జరాసంధాది శత్రురాజులనుముట్టడించారు. బాణాగ్ని జ్వాలలను కురిపించారు. రథగజతురగ పదాతి బలసేనలను తల - మొల తెలియరానట్లు నరికివేశారు. వాహనాలు తునాతునుకలయ్యాయి. ఆయుధాలు విరిగిపోయాయి. యుద్ధ వాద్యాలు ఆగిపోయాయి. శత్రురాజులు భేదింప బడినారు. భూషణ ధ్వనులు సన్నగిల్లాయి. నెత్తురు ఏరులైపారింది. నక్కలు, కాకులు, రాబందులు (బోరువలు) మాంసం తిని, రక్తం త్రాగి చెలరేగినాయి. భూతభేతాళుల కలకల ధ్వనులతో మెదడు మాంసాలను తినే డాకిని అనే ఆడుపిశాచాలకు రణరంగం సంతోషం కలిగిస్తున్నది.

ఆ సమయంలో -

**మగిడి చలించి పాఱుచును మాగధముఖ్యులు గూడి యొక్కచో**
**వగచుచు నాలిగోల్పడిన వాని క్రియన్ గడువెచ్చనూర్చుచున్**
**మొగమున దప్పిదేర దమముందట బొక్కుచునున్న చైద్యుతో**
**పగతుర చేతిలో బడక ప్రాణముతోడుతనున్నవాడవే॥** 51

అర్థం : మాగధ ముఖ్యులు = జరా సంధుడు మొదలైనవారు; మగిడి = వెనుకకు తిరిగి; చలించి = భయపడి; పాఱుచును = పరుగెత్తిపోతూ; ఒక్కచో = ఒకచోట; కూడి = చేరి; వగచుచున్ = దుఃఖిస్తూ; ఆలిన్ = భార్యను; కోల్పడినవాని క్రియన్ = పోగొట్టుకొన్నవానిలాగా; కడున్ = మిక్కిలి; వెచ్చన్+ఊర్చుచున్ = వేడి నిట్టూర్పులు విడుస్తూ; మొగమునన్ = ముఖమందు; దప్పిదేరన్ = శ్రమకనబడుతుండగా; తమ ముందటన్ = తమ యెదుట;

పొక్కుచున్+ఉన్న = తాపపడుతున్న; చైద్యుతోన్ = శిశుపాలునితో; పగతురచేతిలోన్+పడక = శత్రువులచేతికి చిక్కక; ప్రాణముతోడుతన్ = ప్రాణంతో; ఉన్నవాడవే = ఉన్నావా?

తా : జరాసంధుడు మొదలైన రాజులందఱు కృష్ణునిసైనికుల దెబ్బకు ఓర్వలేక వెనుకకు తిరిగి భయపడి పాఱిపోతున్నారు. అప్పుడు ఒక్కచోట దుఃఖిస్తూ తమ ముందఱ, పెండ్లాన్ని పోగొట్టుకొన్న వానివలె మొగం పాలిపోయి నిట్టూర్పులు విడుస్తూ తపించిపోతున్న శిశుపాలుణ్ని వారు చూచారు. ఓ శిశుపాలా! నీవు పగవారిచేతిలో చిక్కుకొని ప్రాణాలను పోగొట్టుకోక క్షేమంగా ఉన్నావా? అని అడిగారు. "ఆలిగోల్పడినవానిక్రియన్" అనేది ఉపమాలంకారం. చంపకమాలావృత్త పద్యం. తాత్పర్యం స్పష్టం.

**బ్రతుక వచ్చు నొడల బ్రాణంబు లుండిన**
**బ్రతుకు గలిగెనేని భార్యగలదు**
**బ్రతికి తీవు భార్య పట్టుదైవమెఱుంగు**
**వగవ వలదు చైద్య! వలదు వలదు** 52

అర్థం : చైద్య = ఓ శిశుపాలా! ఒడలన్ = దేహంలో; ప్రాణంబులు = ప్రాణాలు; ఉండినన్ = ఉన్నట్లైతే; బ్రతుక వచ్చున్ = జీవింపవచ్చు; బ్రతుకుగలిగెనేని = జీవించి ఉంటే; భార్యగలదు = పెండ్లాం దొరకగలదు. ఈవు = నీవు; బ్రతికితి = జీవించావు. భార్యపట్టు = పెండ్లాన్ని పట్టు కోవడం; దైవం = దేవుడు; ఎఱుంగున్ = తెలియతగింది. వగవ వలదు వలదు వలదు = ముమ్మాటికి నీవు చింత పడవద్దు.

తా॥ ఓ శిశుపాలుడా! శరీరంలో ప్రాణాలుంటే జీవింపవచ్చు. జీవించియుంటే భార్య లభిస్తుంది. నీవు బ్రతికావు. పెండ్లాం పట్టుబడకపోయె కదా! అనడం దైవికం. నీవు దైన్యంగా విచారపడడం కూడదని జరాసంధాదిరాజులు ఊరడించారు.

వ్యాఖ్య : రాజులు చైద్యుణ్ని ఊరడించే ఆటవెలది పద్యం.

రుక్మిణీదేవిని పెండ్లాడుతానని పెండ్లి కొడుకై ఆర్భాటంగా వచ్చిన శిశుపాలుడు, అతనికి తోడుగా వచ్చిన జరాసంధాది భూపతులు యుద్ధంలో శ్రీకృష్ణమూర్తిని గెలువలేక, భయపడి పలాయనమయ్యారు. శిశుపాలుడు కావలసిన పెండ్లాన్ని పోగొట్టుకొంటినికదా! అని ఒకచోట మొగమెత్తుకోలేక తాపపడుతుంటే, జరాసంధాదులు 'పెండ్లాంకోసం నీ లాంటి వారు దుఃఖపడకూడ'దన్నారు. నీవు పగవాళ్ళ చేతికి చిక్కక బ్రతికి పోయావు. క్షేమంగా ఉన్నావు కదా!

"జీవన్ భద్రాణి పశ్యతి" అన్నట్లు బ్రతికియుంటే ఎన్ని శుభాలనైనా పొందవచ్చు. "దేశే దేశేకళత్రాణి" అన్న రీతిగా, ఎక్కడనైనా భార్య దొరకక పోదు. 'భార్య' అనుబంధం ఆ దేవునికే తెలుస్తుంది. మనమనుకుంటే లభించేది కాదు. "Marriages are made in Heaven!" అనే నానుడి ప్రసిద్ధం కదా!

"యత్సత్త్వేయత్సత్త్వం యదభావే యదభావః" తాను ఉంటే అన్నీ ఉన్నట్లే, తాను లేకుంటే ఏదీ లేదు", అని శ్రుతి పలుకుతుంది. కాబట్టి, ఏరకంగా చూచినా, చైద్యుడు దుఃఖపడడం తగదు తగదు తగదన్నారు.

'బ్రతుకు' పదాన్ని పాదత్రయాదిలోత్రిప్రాసగా ప్రయోగించి, తురీయ పాదంలో వగవవలదు వలదు వలదు' అని విచారపడడం ముమ్మాఱునిషేధింపబడింది.

వ : **వినుము. దేహధారి స్వతంత్రుడు గాడు. జంత్రగాని చేతి జంత్రపుబొమ్మకైవడి నీశ్వర తంత్ర పరాధీనుడై, సుఖదుఃఖంబులందు నర్తనంబులు సలుపు. తొల్లినేను మధురాపురంబు మీద బదియేడు మాఱులు పరాక్రమంబునన్ విడిసి, చక్రిచేతనిర్మూలిత బలచక్రుండనై, కామపాలుచేతం బట్టువడి, యీ కృష్ణుండు కరుణతో విడిపించిన వచ్చి, క్రమ్మఱనిరువది మూడక్షౌహిణులం గూడుకొని, పదునెనిమిదవ మాఱుదాడిచేసి, శత్రువులందోలి, విజయంబుజేకొంటిని. జయా పజయంబులందు హర్షశోకంబులనెన్నండును జెంద. నేటిదినంబున నీకృష్ణునికెదిరిపోర మనరాజలోకంబు లెల్ల నుగ్రాక్షుంగూడు కొని, యెదిరి పోరిన నోడు. ఇంతియకాక దైవయుక్తంబైన కాలంబునంజేసి, లోకంబులు పరిభ్రమించుచునుండు. అదియునుంగాక.**

అర్థం : దేహధారి = శరీరాన్ని ధరించిన జీవుడు; స్వతంత్రుడు గాడు = తనకు కావలసిన పనులను తానే నెరవేర్చుకోజాలినవాడు కాడు. జంత్రగాని చేతి జంత్రపు బొమ్మకైవడిన్ = సూత్రధారి చేతిలో ఉండే కీలుబొమ్మ వలె; ఈశ్వర తంత్ర పరాధీనుండై; నియామకుడైన భగవానుని నటనకులోబడిన వాడై; సుఖదుఃఖంబులందు; నర్తనలు సలుపున్ = నటనలుచేస్తుంటాడు. తొల్లి = పూర్వం; నేను; మధురాపురంబుమీద = మధురానగరంమీద; పదియేడు (17) మారులు; పరాక్రమం బునన్ విడిసి = ఆక్రమించి; చక్రిచేత = చక్రాయుధుడైన శ్రీకృష్ణుని చేత; నిర్మూలిత బలచక్రుండనై = నిర్మూలింపబడిన - నాశనం చేయబడిన - సేనా సమూహం కలవాడనై; కామపాలుచేతన్ = బలరాముని చేతిలో; పట్టుపడి = చిక్కుకొని; ఈ కృష్ణుండు; కరుణతో = దయచేత; విడిపించిన వచ్చి; క్రమ్మఱన్ = మళ్ళీ; ఇరువది మూడు =

(23) అక్షౌహిణుల సేనతో కూడుకొని; పదునెనిమిదవ మాఱు 18వ సారి; దాడిచేసి = దండెత్తి పోయి; శత్రువులన్ తోలి = పగవారైన బలరామకృష్ణులను తరిమి; విజయంబు చేకొంటిని = గెలుపును పొందితిని. జయ+అపజయంబులందు = గెలుపు నందు, ఓటమినందు; హర్షశోకంబులన్ = సంతోషదుఃఖాలను; ఎన్నండును+చెంద = ఏనాడూ, ఎప్పుడూ పొందను, నేటిదినంబున = ఈనాడు, ఈ కృష్ణునికి; ఎదిరిపోరన్ = ఎదిరించి యుద్ధంచేస్తే; మన రాజలోకంబు లెల్లన్ = మనరాజసమూహమంతా; ఉగ్ర+అక్షున్ = నుదుట అగ్నినేత్రంకల రుద్రుణ్ని; కూడుకొని, ఎదిరి పోరన్ = ఎదురునిల్చి యుద్ధం చేసినా; ఓడున్ = ఓడిపోతుంది. ఇంతి యకాక = ఇంతేకాదు, ఇంకను; దైవయుక్తంబైన కాలంబునన్+చేసి = దైవంతో కూడిన కాలంచేత; లోకంబులు = లోకాలూ, లోకులూ; పరిభ్రమించుచున్ + ఉండున్ = త్రిప్పబడుతూ ఉండును.

అదియునున్+కాక = అదిమాత్రమే కాక.

తా : శిశుపాలా! జీవుడెప్పుడుస్వతంత్రుడు కాడు. పరమాత్మునికి పరతంత్రుడు. స్వయంగా ఏకార్యమూచేయడానికి కర్తకాదు. సూత్రధారి చేతజిక్కిన సూత్రపుబొమ్మ (తోలుబొమ్మ) ఆడుతున్నట్లు ఈశ్వరతంత్రానికి లోబడినవాడై నటిస్తుంటాడు.

"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశ్మే ర్జున తిష్ఠతి। భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥"

(భ.గీత) ఓ అర్జునా! ప్రాణులందరి యెదలో పరమాత్ముడున్నాడు. తన సంకల్పశక్తిచేత బస్సులో ఎక్కిన ప్రాణులను, వారి కర్మ అనే టిక్కెట్టును బట్టి ఆదూరాన్ని చేరునంత కాలం భగవానుడు డ్రైవరు - సారథిలాగా త్రిప్పుతుంటాడు. అని శ్లోకార్థం.

జరాసంధుడు శిశుపాలునికి తన చరిత్రను పారతంత్ర్యానికి తార్కాణంగా చెప్పాడు. జరాసంధుడు మగధదేశాధిపతి. తాను మధురాపట్టణాన్ని 17 సార్లు ముట్టడించాడు. కృష్ణునిచేత జరాసంధుని సైన్యమంతా నిర్మూలింపబడింది. బలరాముని చేతికి చిక్కిన జరాసంధుణ్ని శ్రీకృష్ణుడు దయతో విడిపించాడు. మళ్ళీ 23 అక్షౌహిణుల సేనను కూడగట్టుకొని 18వ సారి దండెత్తి పోయి బలరామకృష్ణులను తటిమివేసి జరాసంధుడు జయించాడు. తాను గెల్చినా సంతోషించేవాడు కాడట. ఓడినా విచారపడేవాడుకాదని చెప్పి ఊరడింపదలచాడు. అయినా నేటి స్థితిని బట్టి ఆలోచిస్తే, రాజు లందరం కలిసి అగ్ని కన్నుగల ముక్కంటిని ముందుపెట్టుకొని, ఈకృష్ణుణ్ని ఎదిరించి యుద్ధం చేసినా, ఓడిపోతామే గాని గెలువలేము. కాలందైవంతో

కూడి ఉంటుంది. ఆకాలం లోకాలను త్రిప్పుతూ ఉంటుందన్నాడు. (తాత్పర్యం స్పష్టం)

**తమకుంగాలము మంచిదైన మనలంద్రైలోక్య విఖ్యాత వి**
**క్రములంగెల్చిరి యాదవుల్ హరిభుజాగర్వంబునన్ నేడు, కా**
**లము మేలైచనుదెంచెనేని మనమున్‌లక్షించి విద్వేషులన్**
**సమరక్షోణిజయింత మింత పనికై శంకింపనీ కేటికిన్॥ 53**

అర్థం : యాదవుల్ = గొల్లవారు; తమకున్; కాలము; మంచి దైనన్ = అనుకూలమైనదికాగా; నేడు = ఈనాడు; హరిభుజాగర్వంబునన్ = కృష్ణుని బాహుబలంచేత; త్రైలోక్య విఖ్యాత విక్రములన్ = మూడులోకాలందు ప్రసిద్ధికెక్కిన పరాక్రమవంతులమైన; మనలన్; గెల్చిరి = ఓడించారు; మనమున్ = మనంకూడా; కాలము మేలై చనుదెంచెనేని = కాలం అను కూలించి వచ్చినట్లైతే; లక్షించి = (ఆకాలాన్ని) గుర్తించి; విద్వేషులన్ = పగవారిని; సమరక్షోణిన్ = యుద్ధభూమి యందు; జయింతము = గెలుతాం; ఇంత పనికై = ఈ చిన్న ఓటమికోసం; శంకింప నీకు ఏటికిన్ = నీకు సందేహించడ మెందుకు?

తా : యాదవులకు కాలం అనుకూలంగా ఉండడం వల్ల వారు మూడులోకాల్లో ప్రఖ్యాతి జెందిన పరాక్రమంగల మనలను కృష్ణుని భుజ బలంచేత గెలిచారు. మనకు కూడా అనుకూలంగా వచ్చేకాలాన్ని గుర్తించి, రణరంగంలో శత్రువులను జయిద్దాం. ఇంత చిన్న ఓటమి మాత్రానికే నీవు సంకోచపడకూడదు అని జరాసంధాదిరాజులు పలికారు.

వ్యాఖ్య : జయాపజయాలకు మూలకారణం కాలమే.

కాలమే దైవం - "కాలఃకలయతా మహమ్" (భ.గీ.)

దైవమంటే అదృష్టమనీ అర్థముంది. "దైవం దిష్టం భాగధేయం." "కాలో దిష్టః" ఉభయత్ర అమరం. అదృష్టంలాగా, రేపు ఏమి జరుగుతుందో కనబడదు. తెలియదు కదా! అందుకే 'గతకాలముమేలు వచ్చుకాలముకంటెన్' అన్నాడు కదా నన్నయభట్టు. కాలం "చక్రనేమిక్రమేణ" చక్రం యొక్క (పరిధి) కమ్మివలె ఎప్పుడూ తిరుగుతునే ఉంటుంది. రేయింబవళ్ళు, చీకటి వెలుగులు కష్టసుఖాలు, ఒకటి తర్వాత మరొకటి రావడానికి కారణం కాలచక్రభ్రమణమే కదా! "కాలోహిదురతిక్రమః" అన్నట్లు కాలప్రవాహానికి ఎదురీద రాదు. కాలానుగుణంగా ప్రవర్తించడమే శ్రేయస్కరం. ఆపత్కాలంలో క్రుంగక సంపత్కాలంలో పొంగక, ప్రశాంత చిత్తులై వర్తించడం మేలు.

తన బలాన్ని సింహబలంతో పోల్చుకొనే జరాసంధుడు, తాను ఓడిపోతే కాలం ప్రతికూలంగానూ, గెలిస్తే అనుకూలంగానూ ఉందని, తన అనుభవాన్ని బట్టి కాల ప్రభావాన్ని గూర్చి పలికిన మాటలు యథార్థంగా సత్యమైనవే. అయినా, దురహంకారులైన వీరపురుషులు, 'అందితే జుట్టు, అందకుంటే కాళ్ళు' పట్టుకొనే అవకాశవాదులని లోకం వాకొనకమానదు. దీన్నే 'రాజనీతి' అంటారు విజ్ఞులు.

వ : **అని యిట్లు జరాసంధుండును, అతని యొద్దిరాజులును, శిశుపాలుని పరితాపంబునివారించి, తమ తమభూములకుం జనిరి. శిశుపాలుండు ననుచరసేనాసమేతుండై తన నగరంబునకుంజనియె. నంత రుక్మియను వాడు కృష్ణుండు రాక్షస వివాహంబునం దన చెలియలింగొనిపోవుటకు సహింపక, యేకాక్షౌహిణీ బలంబుతోడ సమరసన్నాహంబునం గృష్ణుని వెనుదగిలి పోవుచు, దన సారథితో నిట్లనియె.**

అర్థం : జరాసంధుడు మరియు అతని, యొద్ది = వద్దనున్న - అనుసరించియున్న; రాజులును; శివుపాలుని = చైద్యుని; పరితాపంబు = సంతాపాన్ని; నివారించి = పోగొట్టి; తమతమ, భూములకున్ = దేశాలకు; చనిరి = పోయిరి; శిశుపాలుడును; అనుచర సేనా సమేతుండై = తనననుసరించిన సేనలతో కూడినవాడై; తన, నగరంబునకున్ = పట్టణానికి; చనియెన్ = పోయెను. అంతన్ = ఆ తర్వాత; రుక్మియనువాడు; రాక్షసవివాహంబునన్; తన, చెలియలిన్ = చెల్లెలైన రుక్మిణిని; కృష్ణుండు; కొని పోవుటకు; సహింపక = ఓర్వలేక; ఏక+అక్షౌహిణీ, బలంబుతోడన్ = సేనతో; సమరసన్నాహంబునన్ = యుద్ధప్రయత్నంతో; కృష్ణుని; వెనుదగిలి = వెంబడించి; పోవుచు, తన సారథితోన్, ఇట్లనియె.

తా : ఈ రీతిగా జరాసంధుడు, అతని తోడిరాజులందఱు ఖిన్నుడైన శిశుపాలుని సంతాపాన్ని తొలగించి, ఓదార్చి తమదేశాలకు పోయారు. శిశుపాలుడు కూడా తన సైన్యంతో పాటు చేది దేశానికి వెళ్లాడు. తర్వాత రుక్మి తన చెల్లెలిని రాక్షసవివాహంగా ఎత్తుకొని పోయాడనే రోషంతో కృష్ణుని మీదికి ఒక్క అక్షౌహిణీ సేనతో కూడి దాడి వెడలి తన సారథితో ఇలా అన్నాడు.

**బల్లిదు నన్ను భీష్మజనపాలకుమారుని జిన్నజేసినా**
**చెల్లెలి రుక్మిణింగొనుచు జిక్కని నిక్కపు బంటువోలె నీ**
**గొల్లడు వోయెడిన్ రథము గూడగ దోలుము తేజి తోల్లసత్**
**భల్ల పరంపరన్ మదము బాపెద జూపెద నా ప్రతాపమున్** 54

అర్థం : బల్లిదున్ = బలవంతుడైన; భీష్మజనపాలకుమారుని = భీష్మకమహారాజకుమారుడైన; నన్ను; చిన్నజేసి = తక్కువ వానిగా చేసి; అవమానపరచి; నా చెల్లెలి రుక్మిణిన్ = నాకు చెల్లెలైన రుక్మిణిని; కొనుచున్ = తీసుకొంటూ; చిక్కని = బలంగల; నిక్కపు బంటువోలెన్ = సహజశూరుని వలె; ఈ గొల్లడు పోయెడిన్ = ఈ గొల్లవాడుపోతున్నాడు; రథమున్ = తేరున్; కూడగన్ తోలుము = (అతణ్ని) కలుసుకొనే రీతిగా నడిపించు. తేజిత - పరన్/ తేజిత = పదును పెట్టడంచేత; ఉల్లసత్ = ప్రకాశిస్తున్న; భల్ల పరంపరన్ = ఈటెలలాంటిబాణాల సమూహంతో; మదమున్ = (అతని) కొవ్వును; పాపెదన్ = పోగొడ్తాను. నా ప్రతాపమున్ = నా పరాక్రమాన్ని; చూపెదన్ = కనబరుస్తాను.

తా॥ బలవంతుడనై యువరాజునైన నన్ను అవమానించి నా చెల్లెలైన రుక్మిణిని ఈగొల్లవాడు తీసుకొని పోతున్నాడు. అతణ్ని చేరేవిధంగా రథాన్ని వేగంగా నడుపు. ఇతరులకు సహింపరాని నా ప్రతాపాన్ని జూపి అతని గర్వాన్ని పోగొడ్తాను.

వ : **అని యిట్లు రుక్మిహరి కొలంది యెఱుంగక సారథి నదలించి, రథము గూడదోలించి, గోపాలక! వెన్నగ్రుచ్చ! నిమిషమాత్రంబు నిలునిలుమని తిరస్కరించి, బలువింటనారి సైరించి, మూడు వాడితూపుల హరి నొప్పించి, యిట్లనియె.**

అర్థం : అనిఇట్లు రుక్మి, హరి కొలంది = కృష్ణుని సామర్థ్యాన్ని; ఎఱుంగక = తెలియక; సారథిన్; అదలించి; రథమున్; కూడన్ తోలించి = (కృష్ణుణ్ని) కదియ నడిపింపజేసి; గోపాలక = ఆవులమందను కాసేవాడా! వెన్నగ్రుచ్చ = ఓ వెన్న దొంగా! నిమిషమాత్రంబు నిలునిలుము; అని; తిరస్కరించి = ధిక్కరించి; బలువింటన్ = బలమైనధనుస్సునందు; నారి సైరించి = అల్లె త్రాడును ఎక్కుపెట్టి; మూడు వాడి తూపులన్ + వాడియైన మూడు బాణాలుచేత; హరిని; నొప్పించి = నొవ్వజేసి; ఇట్లనియె -

తా॥ అని యిట్లు రుక్మి కృష్ణుని బలశౌర్యాదులను తెలియక సారథిని పురికొల్పి, రథాన్ని కృష్ణుని దగ్గరికి చేమనట్లు తోలించాడు. ఓ పసులకాపరి! ఓ వెన్నదొంగ! కాసేపు నిలువుమని చులకనగా మాటలాడుతూ, వింటిపై నారినెక్కించి, వాడి యైన మూడుబాణాలతో కృష్ణమూర్తిని నొప్పించి ఇలాగా పలికాడు.

**మాసరివాడవా మా పాపగొనిపోవ**
**నేపాటి గలవాడ వేది వంశ**
**మెందు జన్మించితి వెక్కడ బెరిగితి**
**వెయ్యది నడవడి యెవ్వడెఱుగు**

**మానహీనుడ వీవు మర్యాద లెఱుగవు**
**మాయ గైకొని గాని మలయరావు**
**నిజరూపమున శత్రునివహంబుపై బోవు**
**వసుధేశుడవుగావు వావి లేదు**
**కొమ్మనిమ్ము నీవు గుణరహితుండవు**
**విడువు విడువవేని విలయకాల**
**శిఖిశిఖాసమాన శిత శిలీముఖముల**
**గర్వమెల్లగొందు గలహమందు** 55

అర్థం : మాపాపన్ = మారాచబిడ్డను; కొనిపోవన్ = ఎత్తుకొనిపోవడానికి; మాసరివాడవా = మాతోసమానుడవా? ఏపాటి గలవాడవు = ఏ ధర్మం కలవాడవు? ఏది వంశము = నీ వంశమేది? ఎందు జన్మించితివి = ఎక్కడపుట్టి నావు? ఎక్కడ పెరిగితివి = నీవెక్కడ పెరిగినావు? ఎయ్యది నడవడి = నీ ప్రవర్తన ఎట్టిది? ఎవ్వడెఱుగు = ఎవనికి తెలుసు? ఈవు = నీవు; మానహీనుడవు = గౌరవంలేని వాడవు; మర్యాదయును లేదు = మంచి చెడ్డ అనే ఒకక్రమం నీయందు లేదు; మాయన్ కైకొని కాని = మాయను పొందియేకాని; మలయన్ రావు = సంచరింపరావు; నిజరూపమున = స్వస్వరూపంతో; శత్రునివహంబు పైన్ = పగతురగుంపుమీదికి; పోవు; వసుధా+ఈశుడవు కావు = రాజువు కావు; వావి లేదు = వరుసలేదు; నీవు; గుణరహితుండవు = మంచిగుణాలు లేనివాడవు. కొమ్మన్ ఇమ్ము = రుక్మిణిని ఇమ్ము; విడువు = వదలిపెట్టు; విడువవేని = వదలక పోతే; విలయ - ములన్ / విలయకాల = ప్రళయకాలమందలి; శిఖిశిఖా = అగ్నిజ్వాలలతో; సమాన = సమానమైన; శిత = తీక్షణంగల; శిలీముఖములన్ = ఉక్కుములుకులుగల బాణాలచేత; కలహమందున్ = యుద్ధమందు; గర్వము+ఎల్లన్ = నీ అహంకారమంతా; కొందున్ = తీసుకొందును - అణచివేస్తాను.

తా : ఓ గొల్లవాడా! మా పాపనెత్తుకొని పోవడానికి నీవు మాతో సమానుడవుకావు. ఏ ధర్మమూ, సామర్థ్యమూ నీకులేదు. ఎక్కడ పుట్టి పెరిగావో, నీ వృత్తియేదో, నీకులగోత్రాలు కూడా ఎవరికి తెలుసు? నీకు మానమర్యాదలే లేవు. ఎక్కడైనా మాయతోనే గాని నీ నిజరూపంతో శత్రువులనెదుర్కొనలేవు. నీవు రాజువూకావు. నీకు వావి వరసలూ లేవు. కాబట్టి, మా చెల్లెలిని విడిచి, మాకిచ్చివేయు. విడిచి పెట్టకపోతివా ప్రళయకాలాగ్ని జ్వాలల లాగా తపింప జేసే ఉక్కుములుకులు గల బాణాలనుప్రయోగించి యుద్ధంలో నీగర్వాన్ని అణచివేస్తాను.

వ్యాఖ్య : ఈ పద్యంలో రుక్మి, కృష్ణమూర్తిని నిందించినట్లున్నా, స్తుతి కూడా ధ్వనిస్తున్నది.

**మాసరివాడవా?**

**నింద** : మేము కిరీటధారులం "నావిష్ణుః పృథివీపతిః" అనే ప్రమాణంచేత విష్ణువుయొక్క అంశచే పుట్టి రాజ్యపాల నాధికారం కలవాళ్లం. గొప్పవంశమందు జన్మించి సభ్యత, సంస్కారం, సద్గుణాలు కలిగిన మాతో నీవు సమానుడవుకావు. నీవు గొల్లవాడవు.

"వివాహశ్చవివాదశ్చ సమయోరేవ శోభతే"

"వియ్యమునకు, నెయ్యమునకు, కయ్యమునకు ఈడుజోడు కావలె సుమతీ" అని నీతికారులు చెప్పినారుకదా! ఎన్ని విధాల జూచినా నీవు మాతో సమాన స్థాయి కలవాడవు కానేకావు.

**స్తుతి** : కృష్ణా! "నతత్సమశ్చాభ్యధి కశ్చదృశ్యతే" నీతో సమానుడే లేడు. అధికుడు అసలేఅగుపడడు. నవనీతం - తొమ్మిది తీరుల యత్నిస్తే వచ్చే వెన్నను మ్రింగిన మెత్తని మనస్సు కలవాడవు నీవు.

"మమైవాంశోజీవలోకః" (భ.గీ) అన్నట్లు మేము నీ అంశజులం.

"గోపాల ఇతికృష్ణ! త్వాం ప్రచురక్షీరవాంఛయా।

శ్రితో మాతృస్తనక్షీర మప్యలభ్యం త్వయాకృతమ్॥"

గోపాలా! అధికంగా ఆవుపాలు దొరుకుతాయని నిన్ను ఆశ్రయించిన వానికి తల్లిపాలు కూడా దొరకకుండా చేసేవాడవు. మేము అల్పప్రయోజనాన్ని ఆశించినా, అనల్పమైన మోక్షఫలాన్ని ప్రసాదించే వాత్సల్యంగల నీవు మాకుసరివాడవెలా అవుతావు?

**ఏ పాటిగలవాడవు?**

**నింద** : బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రులనే చతుర్వర్ణాల ఆచారాలలోనూ, బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ సన్యాసాలనేనాలు గా శ్రమ ధర్మాలలోనూ ఏ ఆచారం, ఏ ధర్మం కలవాడవు? ఏ విధమైన ధర్మాచరణ సామర్థ్యం లేని వాడవు.

**స్తుతి** : "న చక్షు రశ్రోత్ర మపాణి పాదమ్" అనే శ్రుతి ప్రకారం, అనేక ఇంద్రియాల వృత్తులలో నీవు ఏ వృత్తి కూడా లేనివాడవు.

**ఏదివంశము?**

**నింద** : నీకు జాతికుల గోత్రాలు లేవు.

**స్తుతి** : "ఏకోదేవో బహుధానివిష్టః" - "అజాయ మానో బహుధా విజాయతే" అనే శ్రుతలరీత్యా, స్థావర జంగమ ప్రాణుల రూపంతో నీవే ఉన్నావు. కాబట్టి, నిన్ను ఏజాతివాడవనీ, నీది ఏ వంశమని నిశ్చయింప వచ్చు?

**ఎందుజన్మించితివి? ఎక్కడ పెరిగితివి?**

**నింద** : పుట్టి పెరిగిందెక్కడో ఏవరికీ తెలియని అనామకుడవు.

**స్తుతి** : "న జాయతేమ్రియతేవా కదాచిత్" అన్నట్లు పుట్టు గిట్టుకలు లేనివాడవు. కాబట్టి, నీవు ఇక్కడ పుట్టావు, అక్కడ పెరిగావు అని ఎలా చెప్పేది?

**ఎయ్యది నడవడి?**

**నింద** : నీకే మైన మంచి ప్రవర్తన ఉన్నదా? లేదుకదా!

**స్తుతి** : "స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణం

అస్నావిరం శుద్ధ మపాపవిద్ధమ్" అని సనాతనులు నీది 'అకాయం అంటే, పుణ్యాపాపసంచయం చేయని శరీరమన్నారు. అవ్రణం - వ్రణాలు లేని, అస్నావిరం - నాడీ బంధనంలేని; అపాపవిద్ధం - దివ్యమంగళ విగ్రహం కలవాడవన్నారు.

"తతః స్వయంభూర్భగవాన్" - స్వయంభువుడు, అంటే ("పరమాత్మాస్వయం భవతి, స్వేచ్ఛయా శరీరం పరిగ్రహం కరోతి. నత్వితర జీవవత్కర్మాయత్తదేహః తథాచ శ్రుతిః. స ఏకధాభవతి, ద్విధాభవతి") జీవుల వలె కర్మల వల్ల కలిగిన దేహం కాదు, భగవానుడు తన ఇచ్ఛచేతనే శరీరాన్ని పరిగ్రహిస్తాడు - అని మనుస్మృతి టీకాకారుడు - కుల్లూకభట్టు అన్నాడు. కాబట్టి, నీవు పాప పుణ్యాల నడవడిలేని వాడవు కదా!

**ఎవ్వడెఱుగు?**

**నింద** : నీవు ఎవ్వని కైనా తెలిసినవాడవా?

**స్తుతి** : "సదసచ్చాహ మర్జున." అనడం వల్ల, సదసద్రూపుడవైన నిన్నెవడు తెలుసుకోగలడు? నిన్ను నీవే ఎఱుగుదువుకాని ఇతరులెఱుగరు కదా!

**మానహీనుడవు** : గౌరవాభిమానాలు లేనివాడవని నిందావాక్యం. ప్రత్యక్షాది ప్రమాణాలకు మించినవాడవని స్తుతివాక్యం.

**మర్యాదయును లేదు** : చిన్నపెద్ద అనే క్రమం నీయందులేనేలేదు అని నిందించడం. "సర్వభూతాంతరాత్మా" చిన్నపెద్ద అనే మర్యాద - హద్దు - లేక నీవు సర్వవ్యాపకుడవని స్తుతించడం.

**మాయనైకొని కాని మలయరావు** :

నీవు మాయవేషాలతోనే సంచరిస్తుంటావు అని తెగడినమాట.

నీవు మాయతోగూడి స్థూల సూక్ష్మకారణ శరీరాలు, విశ్వతైజసప్రాజ్ఞ నామాలు మొదలైన వ్యవస్థను పొందే వాడవు అని పొగడిన మాట.

**నిజరూపమున శత్రునివహంబుపై బోవు : -**

**నింద :** స్వస్వరూపంతో శత్రువుల మీదికి పోలేవు. నీది అంతా కాపట్యమే.

**స్తుతి :** 'నమేద్వేష్యో౽స్తి నప్రియః'' నీకు శత్రువులు గానీ మిత్రులుగానీ లేరు. "భక్తానాం త్వంప్రకాశసే" భక్తులకు ఇష్టమైన రూపంతో వెలుగుతుంటావు.

నీ భక్తులను బాధించే వారే నీకు విరోధులు-

"క్రీడార్థం సృష్టిరిత్యన్యే, భోగార్థమితిచాపరే।

దైవ స్యైషః స్వభావో౽య మాప్తకామస్తుకాస్పృహా"॥

ఈ సృష్టి వికాస విన్యాసాలన్నీ నీ వినోద విలాసాల కోసమే కదా! కాబట్టి లోకకంటకులను కంటిగించు కొంటావు. వారితో పోరాడడానికి నీ నిజరూపంతోకాక మత్స్య కూర్మ వరాహ నరసింహాది రూపాలను ధరించే శత్రువులను నిరసిస్తావు.

**వసుధేశుడవు కావు :**

**నింద :** నీవు రాజువు కావు. యయాతి శాపం వల్ల యదువంశీయులకు రాజ్యపాలన లేకుండా పోయింది కదా!

**స్తుతి :** "రాజాధిరాజాయప్రసహ్యాసాహిణే నమః" (శ్రుతి)

"రాజాప్రకృతి రంజనాత్" ప్రకృతి - ప్రజారంజకుడైన వాడు రాజు. ఆ ప్రజాపతులను రంజింపజేసే రాజాధిరాజువే నీవు. కాబట్టి రాజసామాన్యుడవుకావు. విశ్వాధీశుడవే సుమా!

**వావిలేదు :**

**నింద :** నీకు చుట్టమనీ లేదు, దానికి తగిన సాంఘికమైన చట్టాన్నే నీవు పాటించవు. జారుడవు - నీకు వావివరుసలు లేవు. స్వేచ్ఛగా ప్రవర్తిస్తుంటావు.

**స్తుతి :** "పితాపుత్రేణ పితృమాన్ యోనియోనౌ" అని శ్రుతిపలికినట్లు జగత్పితయైన నీవు జనపతులనే తండ్రులుగా చేసి పుత్రడవయ్యేవరుసనీది." స్త్రీ ప్రాయ మితరంజగత్" అనే న్యాయంతో నీవొక్కడవే పురుషోత్తముడవు. గొల్ల పడుచుల అంతరంగం తెలిసి మగపోడిమిని జూపడమూ, కొందరికి బిడ్డగా, ప్రియునిగా, భర్తగా వర్తించడమూ, ఆలోచిస్తే, నీవు మధురభక్తికి ఇష్టపడిన మాధవుడవు. పట్టుమని పదేండ్లైనా లేని బాలుడవైన నీవు గోపికలతో మదన క్రీడలు సలుపడం లోకవిరుద్ధమేకదా! నీకు 'నైవశాస్త్రం నచక్రమః' అన్నట్లు ఒక శాస్త్రక్రమం, గిరిగీత ఏదీలేదు. వైకుంఠంలోని దేవేరులు నీ అందాన్ని చూడగోరి, తమ స్వాతంత్ర్యకారణంగా

బ్రాహ్మణ బాలకులను పాంచభౌతిక శరీరంతోనే పరమపదానికి తీసుకొని పోతే, నీవు వారిని పునరావృత్తిలేని ఆ లోకం నుంచి తెచ్చి తండ్రికిచ్చిన పద్ధతిని "పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే" అనీ "వైదికన్ పిళ్ళై గళై ఉదలొడుమ్‌కొణ్డుకొడుత్తవన్" అనీ ఉభయ వేదాంతాలూ కీర్తించాయి.

అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం చేత ఉత్తర గర్భంలోని శిశువు కాలిన కట్టెలాగా జన్మించింది. అప్పుడు

"యదిమే బ్రహ్మచర్యం స్యాత్ సత్యంచ మయితిష్ఠతి।

అవ్యాహతం మమైశ్వర్యం తేన జీవతుబాలకః॥" శ్రీకృష్ణుడు 'అస్ఖలిత బ్రహ్మచారినే అయితే, ఈ బాలుడు బ్రతుకుగాక' అని ప్రతిజ్ఞ చేసి,

"పాదేన కమలాభేన బ్రహ్మరుద్రార్చితేన చ।

పస్పర్శ పుండరీకాక్ష ఆపాదతలమస్తకమ్॥"

తనపాదపద్మంచేత ఆ శిశువును కాళ్ళనుంచి తలదాకా తాకాడు. వెంటనే శిశువు బ్రతికిపరీక్షిత్తనేపేరుతో ప్రసిద్ధిని పొందడం వల్ల కృష్ణుని అఘటితఘటనాసామర్థ్యం ప్రదర్శింపబడింది కదా! కాబట్టి, ఆర్తత్రాణపరాయణుడైన కృష్ణమూర్తికి ఏ శాస్త్రమూ, చట్టమూ అడ్డుతగులదు.

**నీవు గుణరహితుండవు:**

**నింద:** నీవు గుణహీనుడవు. మంచి గుణాలే నీకు లేవు.

**స్తుతి:** "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అనే ఉపనిషద్వాక్య రీతిగా, నీవు నిర్గుణుడవు. నీకున్నవన్నీ కల్యాణగుణాలే. హేయగుణాలు లేవు. నిర్గుణ పదానికి ఏ గుణమూ లేదని అర్థం కాదు. ప్రకృతికి చెందిన సత్త్వ రజస్తమోగుణాలకూ., దానికి అనుబద్ధాలైన కామక్రోధాదులకు వశుడు కానివాడని అర్థం. కాబట్టి, గుణత్రయాతీతుడని భావం.

"సర్వవేదాంతసారంహి శ్రీభాగవతమిష్యతే" శ్రీధరస్వామి వ్యాఖ్యానారంభంలో వేదాంతసారమే శ్రీ భాగవత గ్రంథమన్నారు.

అన్నట్లు, పోతనమహాకవి, ఎగతాళి చేసే పద్యంలోనూ నిగమాంత ఫణితిని రుక్మినోట పలికించాడు. 'యద్దేవా'లలోనూ శ్రుతి శిరః ప్రసిద్ధ భూషణాలు, అనురణించే పద్య శిల్పం రమణీయం కదా!

ఈ సీసపద్యం చివర ఆటవెలది, వృత్త్యను ప్రాసగా, నృత్యం చేయడమూ గమనీయం.

వ : **అని పలికిన, నగధరుండు నగి, యొక్క బాణం బున వాని కోదండంబు ఖండించి, యాఱుశరంబుల శరీరంబు దూఱనేసి, యెనిమిది విశిఖంబుల రథ్యంబుల గూల్చి రెండమ్ముల సారథిం జంపి, మూడు వాడి తూపులం గేతనం బుద్రుంచి, మఱియు నొక్క విల్లందినంద్రుంచి, వెండియు నొక్క ధనువు పట్టిన విదళించి, క్రమంబున పరిఘపట్టిస శూల చర్మాసి శక్తి తోమరంబులు ధరియించినం దునుకలు వేసి, క్రమ్మఱ నాయుధంబులెన్ని యెత్తిన నన్నియు శకలంబులు గావించి, అంతటం దనివి సనక వాడు రథంబు డిగ్గి, ఖడ్గహస్తుండై, దవానలంబుపై బడు మిడుతచందంబునం గదిసిన ఖడ్గకవచంబులు చూర్ణంబులు చేసి, మెఱుంగులు చెదర నడిదంబు వెఱికి ఝళిపించి, వాని శిరంబు దెగవ్రేయు దునని, గమకించి, నడుచుచున్న, నడ్డంబు వచ్చి, రుక్మిణీ దేవి హరి చరణారవిందంబులు పట్టుకొని, యిట్లనియె.**

అర్థం : నగధరుండు = గిరిధారియైన శ్రీకృష్ణుడు; నగి = నవ్వి; కోదండంబు = ధనుస్సును; ఖండించి = నఱికి; దూఱన్+ఏసి = బాణాలను చొచ్చుకొని పోవునట్లు ప్రయోగించి; విశిఖంబులన్ = బాణాలచేత; రథ్యంబులన్ = రథాన్ని లాగే గుఱ్ఱాలను; కూల్చి = పడగొట్టి; అమ్ములన్ = బాణాలచేత; సారథిన్+చంపి = రథచోదకుణ్ణి వధించి; తూపులన్ = బాణాలతో; కేతనంబున్+త్రుంచి = ధ్వజపతాకాన్ని ముక్కలు చేసి; విల్లు+అందినన్ = ధనుస్సును పట్టుకోగానే; విదళించి = నఱికి, పరిఘ = ఇనుపకట్లగుదియ; పట్టిస = ఈటెలాంటి ఆయుధం; శూల = బల్లెం; చర్మ = డాలు; అసి = ఖడ్గం; తోమరంబు = చిల్లకోల; క్రమ్మఱన్ = మళ్ళీ; శకలంబులు గావించి = ముక్కలు చేసి; తనవి సనక = తృప్తిపడక; రథంబు డిగ్గి = తేరుదిగి; దవ+అనలం = దావాగ్ని - కార్చిచ్చు; పైబడు = మీద పడునట్టి; మిడుతచందంబునన్ = శలభమనే పురుగువలె; కదిసిన = చేరరాగా; ఖడ్గకవచంబులు = కత్తిని, మేజోడును; చూర్ణంబులు చేసి = పొడిపొడిగా చేసి; మెఱుగులు చెదరన్ = కాంతులు వ్యాపించగా; అడిదంబు+పెఱికి = కత్తిని ఒరనుంచి తీసి; వ్రేయుదున్+అని = తలను నఱుకుతానని; గమకించి = పూనుకొని; రుక్మిణి, హరిచరణ+అరవిందంబులు = కృష్ణుని పాదపద్మాలను; పట్టుకొని ఇట్లు అనియె.

తా : ఈ విధంగా రుక్మిధిక్కరించి పలుకగా నగధరుండు నవ్వి నాడు. దేవేంద్రుడు కోపంతో వారం రోజులు, రేయింబవళ్ళు ఎడతెఱిపి లేక, మింటికి మంటికి ఏకధారగా ఘోరవర్షాన్ని కురిపించినప్పుడు శ్రీకృష్ణుడు, బాలుడే అయినా, గోవర్ధన పర్వతాన్ని పెకలించి, తనచిటికెన వ్రేలిమీద మోపి, దానిక్రింద గోవులనూ, గోపాలురనూ చేర్చి కాపాడినాడు. అంత పెద్ద గుట్టను ఏడుదినాలు ఎత్తి పట్టుకొన్ననూ బాలకృష్ణుడు

ఏమాత్రం చలించక నిలిచాడు. ఇప్పుడు రుక్మి మూడు బాణాలు వేసి కృష్ణుని మనస్సును నొప్పించి, పొడుపు మాటల బరువు మూటను నెత్తిమీద పడవేస్తే కృష్ణుడు చలిస్తాడా? తన సామర్థ్యం రుక్మికి తెలియదనుకొని నగధరుడు నవ్వాడు. ఒక్క బాణంచేత రుక్మియొక్క ధనుస్సును వక్కలు చెక్కలు చేశాడు. ఆరు బాణాలను అతని శరీరంలోనుంచి దూసి పోవునట్లుకొట్టాడు. ఎనిమిది బాణాలతో రథపు గుఱ్ఱాలనూ, రెండు బాణాలతో సారథినీ చంపాడు. మూడుబాణాలతో కేతనాన్ని త్రుంచాడు. వాడు ఎన్ని ఆయుధాలను పట్టుకొన్నా వాటినన్నిటినీ ముక్కలు చేశాడు. తుదకు రుక్మి తృప్తిచెందక రథం దిగి కత్తి పట్టుకొని మీదికి రాగానే అతని కత్తినీ, కవచాన్ని నుగ్గునుగ్గు చేశాడు. రుక్మిదౌర్జన్యాన్ని సహింపక, కత్తిని దూసి వాని తలనఱుకుతానని పోతున్న కృష్ణునికి అడ్డం వచ్చి రుక్మిణి అతని పాదాలను పట్టుకొన్నది.

ఈ వచనంలో - "రుక్మి ఖడ్గ హస్తుడై, "దవానలంబుపై బడు మిడుత చందంబునన్ గదిసిన" అన్న మాట ఉపమాలంకారం.

**నిన్ను నీశ్వరు దేవదేవుని నిర్ణయింపగ లేక యో**
**సన్నుతామల కీర్తి శోభిత! సర్వలోక శరణ్య! మా**
**యన్న యీతడు నేడుచేసె మహా పరాధమునీ యెడన్**
**నన్ను మన్నన చేసికావు మనాథనాథ! దయానిధీ॥** 56

అర్థం : సత్+నుత+అమల కీర్తిశోభిత = సజ్జనుల చేత కొనియాడబడిన, స్వచ్ఛమైన కీర్తిచే ప్రకాశించేవాడా! సర్వలోక శరణ్యా = అన్ని లోకాలకు రక్షకుడవైనవాడా! నిన్ను; ఈశ్వరున్ = సర్వశాసకునిగా; దేవదేవునిన్ = బ్రహ్మాది దేవతలకు దేవునిగా; నిర్ణయింపగలేక = నిశ్చయింపలేక; మా అన్న ఈతడు = మా అన్నయైన ఇతడు; నేడు = ఈనాడు; నీ యెడన్ = నీ పట్ల; మహా+అపరాధము = గొప్పనేరం; చేసె = చేశాడు. అనాథనాథ = దిక్కులేని వారికి దిక్కైన వాడా! దయానిధీ = దయకు ఉనికి పట్టైన వాడా! నన్ను; మన్నన చేసి = మన్నించి; కావుము = (ఇతనిని) రక్షింపుము.

తా : సజ్జనుల పొగడ్తకెక్కిన నిర్మల కీర్తిచే శోభిస్తూ లోకాలను రక్షించే వాడవు స్వామీ! మా అన్న నిన్ను ఈశ్వరుడవనీ, దేవతలకే దేవుడవనీ తెలియక నీ పట్ల ఘోరమైన నేరం చేశాడు. దిక్కూ- చక్కీ లేని వారికి నీవే దిక్కైన ఓదయానిధీ! నా ప్రార్థనను మన్నించి, ఇతనిని క్షమించి కాపాడవయ్యా! అని కృష్ణమూర్తి చరణ రాజీవాలను పట్టుకొని రుక్మిణి వేడుకొన్నది. 'మత్తకోకిల' పద్యం.

**కల్లలేదని విన్నవించుట గాదువల్లభ! యీతనిన్**
**బ్రల్లదుండెగ జూచితేనియు, భాగ్యవంతులమైతిమే**
**మల్లుడయ్యె ముకుందుడీశ్వరుడంచు మోదితులైన మా**
**తల్లిదండ్రులు పుత్ర శోకముదాల్చి చిక్కుదురీశ్వరా!! 57**

అర్థం : వల్లభ = ప్రియుడవైన; ఈశ్వరా = ఓ ప్రభూ! కల్ల లేదు అని = (ఇతని యందు) మోసంలేదని; విన్న వించుటకాదు = మనవి చేయడం కాదు. ప్రల్లదున్ = దుష్టుడైన; ఈతనిన్ = నాకు అన్నయైన ఈ 'రుక్మి'ని; తెగన్ = నఱుకడానికి; చూచితి+ఏనియు = పూనుకొంటే; ఈశ్వరుడు = పరమైశ్వర్యసంపన్నుడైన; ముకుందుడు = ఇహపరసుఖాలనిచ్చే విష్ణుమూర్తి; అల్లుడు, అయ్యెన్; ఏము = మేము; భాగ్యవంతులము = అదృష్టంకలవాళ్ళం; ఐతిమి = అయ్యాము. అంచున్ = అనుకొంటూ; మోదితులు+ఐన = సంతోషించిన; మా తల్లిదండ్రులు = మాజననీ జనకులు; పుత్ర శోకమున్+ తాల్చి = కొడుకు చచ్చినాడనే దుఃఖాన్ని పొంది; చిక్కుదురు = కృశిస్తారు.

తా : ప్రియుడవైన ప్రభూ! మా అన్నయందు తప్పులేదని నేను మనవి చేయరాలేదు. ఎంత తప్పు చేసిన వాడైనా, ఇతణ్ణి నీవు చంపినట్లైతే, భుక్తి ముక్తులనిచ్చే సర్వేశ్వరుడే మాకు అల్లుడయ్యాడు. మేము అదృష్టవంతులమయ్యామనుకొంటూ సంతోషిస్తున్న మాతల్లి దండ్రులు, మా ఔరసపుత్రులలో పెద్దవాడు చచ్చిపోయాడని దుఃఖిస్తూ కృశించి పోతారు స్వామీ!

వ్యాఖ్య : ఆడబిడ్డలు ఉభయ వంశోద్ధారకలని ఈ రెండు మత్తకోకిలలు స్ఫురింపజేస్తున్నాయి.

పుట్టినింటివారినీ, మెట్టినింటివారినీ ఉభయ వంశస్థులను ఉద్ధరిస్తుందనీ - అంటే ప్రేయః శ్రేయస్సు లను కలిగిస్తుందని - తల్లిదండ్రులు తమ కన్యను తగిన వరునికి దానం చేస్తారు. కన్యాదాన మహిమను వివాహంలో పురోహితుడు పఠించే 'మహా సంకల్పం' వివరిస్తుంది. "ప్రజాయైగృహమేధినామ్" అన్నట్లు, ధార్మికమైన సంతానోత్పత్తి కోసం జరిపే వివాహ శుభకార్యం పవిత్రమైన సాంఘికాచారం.

కనివిని యెఱుగని కొత్త వారైన అత్తగారింటివారందరి మనస్సును గ్రహించి ఆడబిడ్డ మసలుకొంటుంది. ముఖ్యంగా, మగని పాదాలను మెత్తగానొత్తుతూ, తమవంశ మర్యాదలనన్ని తెలుసుకొని, ఆచరిస్తూ ఇల్లాలు ఇంటికి దీపమై వెలుగుతుంది.

తానెంత భోగభాగ్యాలను మెట్టినయింట అనుభవిస్తున్నా, పుట్టినింట మమకారం తెంచుకోదు. పుట్టిన యింటిలో తనతోబుట్టువులు ఆదరాభిమానాలుకలవారైనా ఇష్టులని వారిని పొగడదు. దుష్టులైతే అవసరమని పించినా తెగడదు. పైగా కట్టుకొన్న మగని కాళ్ళమీదపడి, వేనోళ్ళ వేడుకొని, కన్నయింటి వారి అభ్యుదయాన్నికాంక్షించి, కనికరంతో సంస్కరించగల కల్పవల్లులు కన్యామచర్చికలు.

జగత్కల్యాణకరమైన ఈరుక్మిణీ కల్యాణ కథలో, పెంటి తన యెదను ఆరతి కర్పూరంగా చేసీ పెనిమిటి కాళ్ళను పట్టుకోవడం, "మతి రాదర్శ ఇవాభిదృశ్యతే" అన్నట్లు, లోకానికి ఆమె ప్రజ్ఞ ఆదర్శంగా కనబడుతుంది కదా!

తన ప్రియుడు తనను ఆదరించి పరిగ్రహించిన దానికి గుర్తుగా తన తోబుట్టువును, దుష్టుడైనా చంపక కృపతో కటాక్షించుమనీ, "కల్యాణగుణశాలివైన నిన్ను జామాతగా పొంది బ్రహ్మానందాన్ని అనుభవిస్తున్న నీ అత్తమామలు, నీవు నీ బావ మఱదిని చంపితే, పుత్రశోకంతో కుమిలి కుమిలి కృశించి పోవడం, మనకు ప్రేయస్కరమూ కాదు. శ్రేయస్కరమూ కాదు" అని ఉభయత్ర భద్రతనే కోరింది భగవతి రుక్మిణీదేవి.

**అని డగ్గుత్తికతో మహా భయముతో నాకంపితాంగంబుతో**
**వినత శ్రాంత ముఖంబుతో శ్రుతిచలద్వేణీ కలాపంబుతో**
**గనుదోయిన్ జడిగొన్న బాష్పములతో గన్యాలలామంబు మ్రొ**
**క్కిన రుక్మిందెగ వ్రేయబోక మగిడెన్ గృష్ణుండురోచిష్ణుడై॥ 58**

అర్థం : అని = ఇట్లు పలికి; కన్యాలలామంబు = కన్యలలో ఉత్తమురాలైన రుక్మిణి; డగ్గుత్తికతో = గాద్గద్యంతోనూ; మహాభయముతోన్ = గొప్ప భీతితోనూ; ఆకంపిత+ అంగంబుతో = సాంతం వణకుతున్న దేహంతో; వినతశ్రాంతముఖంబుతో=వంచిన, అలసిన వదనంతో; శ్రుతి చలత్+వేణీ కలాపంబుతోన్ =చెవుల మీదికి జాఱి కదలుతున్న జడయొక్క అలంకారంతోనూ; కనుదోయిన్ = రెండుకన్నులయందు; జడిగొన్న = స్రవిస్తున్న - వానలాగా కారుతున్న; బాష్పములతో = అశ్రువులతో; మ్రొక్కినన్ = నమస్కరింపగా; కృష్ణుండు; రోచిష్ణుడై = (కోపంతో) ప్రకాశించే స్వభావంకల వాడై; రుక్మిన్; తెగ వ్రేయబోక = నఱికి వేయడానికి పూనుకోక; మగిడెన్ = వెనుకకు మరలెను.

తా॥ ఉత్తమకన్యయైన రుక్మిణి ఇలాగా గద్గదస్వరంతో పలికి, గొప్ప భయంతో దేహమంతా వణుకుతుండగా, వంచిన వాడిపోయిన ముఖంతో, చెవుల మీద

జాఱిపడుతున్న జడకొప్పుతో, కాఱుతున్న కన్నీళ్ళతో కాళ్ళకు మ్రొక్కిన వెంటనే కృష్ణుడు రోచిష్ణుడై రుక్మిని చంపబోక వెనుకకు తిరిగాడు.

వ్యాఖ్య : రుక్మిణీదేవి కారుణ్య రూపయైనది.

శృంగార రసధునిలో కెరటం లాగా వీరరసం విజృంభించింది. ప్రణయం పరిణయంగా పరిణమిస్తున్న సందర్భంలో దారుణమైన రణం సంభవించింది. బిడియం, భీతి తనలో తచ్చాడుతున్న నవోఢ, తల వాకిలి తెరచి ఒక్క పలుకైనా కులుక లేకపోయింది. కాని, వధూజనబంధువును వధింపబోయే వల్లభునికి తనవల్ల అపకీర్తి వస్తుందని తల్లడిల్లి, నిలువెల్ల వణికిపోయింది. కరుణా తరంగితాంతరంగయై కన్నీళ్ళతో కాంతుని కాళ్ళు కడిగి మ్రొక్కింది. వెన్నుడు వెనుతిరిగాడు. ఇలా ముగ్ధ, మొట్టమొదట వాల్లభ్యాన్ని ముచ్చటగా చవిచూచింది కదా! ఈ మత్తేభవృత్తపద్యంలో.

**వ : ఇట్లు చంపక, బావా! రమ్మని చిఱునగవు నగుచు, వానిం బట్టి బంధించి, గడ్డంబును, మీసంబును దలయును (నొక కత్తి వాతి యమ్మున) రేవులు వాఱగొఱిగి, విరూపింజేసె. అంతట యదువీరులు పరసైన్యంబులం బాఱద్రోలి, తత్సమీపంబునకు వచ్చిరి. అప్పుడు హతప్రాయుండై, కట్టుపడియున్న రుక్మింజూచి, కరుణ చేసి, బలభద్రుండు బంధంబులు విడిచి, హరిని డగ్గఱి, యిట్లనియె.**

అర్థం : ఒక కత్తి వాతి యమ్మునన్ = కత్తివాయిగలిగిన ఒక బాణంచేత; రేవులు+పాఱన్ = పాయలుపాయలుగా ఏర్పడునట్లు; విరూపిన్‌చేసె = కురూపిని జేసెను. పరసైన్యంబులన్ = శత్రుసేనలను; పాఱదోలి = తఱుమగొట్టి; తత్, సమీపంబునకు = ఆ కృష్ణుని దగ్గరికి; హత ప్రాయుండై = చంపబడినవానిలాంటి వాడై; కరుణ జేసి = దయచేసి, బంధంబులు = కట్లను; విడిచి = విప్పి; హరిని డగ్గఱి = కృష్ణుని సమీపించి;

తా॥ ఈ విధంగా రుక్మిని చంపక, బావా! రమ్మని కృష్ణుడు చిన్నగా నవ్వుతూ చేరదీసి పట్టుకొని కట్టివేసి, వాని గడ్డాన్నీ, మీసాన్నీ, తలను కత్తిలాంటి బాణంతో రేవులుగా కొఱిగాడు. వికార రూపంకలవానిగా చేశాడు. అంతలో యాదవ సైనికులు శత్రుసేనలను తరిమిగొట్టి కృష్ణుని వద్దకు వచ్చారు. అప్పుడు బలరాముడు చచ్చినవానివలె కట్టబడి యున్న రుక్మిని జూచి, కరుణించి, కట్లువిప్పి విడిచిపెట్టి, కృష్ణుణ్ని సమీపించి ఇట్లు పలికాడు.

**తల మనక భీష్మనందను**
**తలయును మూతియును గొఱుగ దగవే! బంధుం**
**దలయును మూతియు గొఱుగుట**
**తల దఱుగుట కంటె దుచ్ఛతరము మహాత్మా! 59**

అర్థం : మహాత్మా = విరాట్ స్వరూపుడవైన కృష్ణా! బంధున్ = చుట్టమైన; భీష్మనందను = భీష్మకుని పుత్రుడైన రుక్మియొక్క; తలయును, మూతియును; కొఱుగన్ = (వెంట్రుకలను) కొఱుగడం; తగవే = న్యాయమా! తలము+అనక = తొలగిపొమ్మ అని చెప్పక; తలయును మూతియును; కొఱుగుట = కొఱుగడం; తలన్+తఱుగుట కంటెన్ = తలను నఱుకడంకంటె కూడా; తుచ్ఛతరము = చాలా నీచమైనది.

తా॥ కృష్ణా! నీవు మహాత్ముడవు - జగద్రూపుడవు. మరి నీవు నీ బావమఱదియైన రుక్మి యొక్క తలను మూతిని కొఱిగి వేసి, అతణ్ని వికార రూపునిగా చేయడం పాడి యేనా? తెలిసీ, తెలియక తప్పు చేసిన చుట్టాన్ని తొలగిపొమ్మని చెప్పాలి. కాని అతణ్ని కట్టివేసి కత్తితో గడ్డం, మీసం, తలనుకొఱుగడం, తలను నఱుకడం కంటె చాలా అవమాన కరమైనకార్యం కదా! అని బలరాముడుకృష్ణుణ్ని మందలించాడు.

వ్యాఖ్య : విశ్వరూపుడు బంధువును విరూపునిగా చేయడం పాడికాదు.

బలరాముడు విజ్ఞాన బలైకధాముడు. అనుజుని కంటె అగ్రజుడు సమయజ్ఞుడని పించుకొనేవాడు కదా!

మహాత్మా! అని కృష్ణుణ్ని సంబోధించాడు. కృష్ణుడు పూర్ణపురుషుడు. "తేనేదం పూర్ణం పురుషేణసర్వమ్" అని శ్రుతి. ఈ విశ్వమంతా ఆ పురుషుని చేనిండి యున్నది. 'ఆత్మన్' శబ్దానికి యత్నం, ధృతి, బుద్ధి, స్వభావం, బ్రహ్మ, శరీరం, జీవుడు అనే నానార్థాలున్నాయి. ఈ అర్థాలన్నీ ఇక్కడ వర్తిస్తాయి.

"మహాన్, ఆత్మాయస్యసః - మహాత్మా" అని విగ్రహవాక్యం. "సకలంతద్ధితవైవ మాధవ!" ఈ విశ్వంలో ఆ మహాత్మునికి చెందనిది ఏదీలేదు. ప్రాకృతికంగా ఆలోచించినా "అందరు చుట్టాలు అల్లమైతే, పెండ్లాం తమ్ముడు బెల్ల"మని జనశ్రుతి. అందులో "రుక్ మీయతే, ఇతి - రుక్మిణీ అనే వ్యుత్పత్తి చేత సాంసారిక రుగ్మతను నివారించేది రుక్మిణి. సాక్షాత్తుగా, అతడు ఆమెకు అగ్రజుడు. నీకు బావమఱదికదా!

బావా! రమ్మని దరహాసంతో చేర దీసి బంధించడం తగవే - మర్యాదయేనా! ('మర్యాద' అంటే నీతి, పొలిమేర, ఎల్లరాయి - హద్దు అని కదా అర్థం.)

"నేనేమి ప్రాణం తీయలేదు కదా! పరిహాసం చేశాను" అంటావేమో! అయితే, హాస్యభావానికి అనౌచిత్యమే హేతువా? "స్వగతంకాదని పరగతమనుకొంటేనే, అనౌచిత్యం హాస్యభాజన మవుతుంది.

మరి గడ్డం, మీసం, తలగొరుగడమేమిటి? పని లేని మంగలి పిల్లి తలగొరిగాడన్నట్లు తుచ్ఛమైనపని చేయడం తగవేనా?

తనకంటె మీద ఏదీ లేదని (క+ఈశ) తలమీద ఆధిపత్యాన్ని వహించే కేశాలు అహంకారానికి సంకేతం. అనర్థాలన్నిటికీ మూలం అహంకారం కదా! అహం కారం, దురభిమానం తరుగదు. కేశాలు కొరిగినా, మళ్ళీ పెరుగుతునే ఉంటాయి. ఎప్పటికప్పుడు పెరిగే అహంకారాన్ని నిరసించడానికే కదా (కేశఖండన, గుండుగొట్టడం, తలనీలాల నీయడం) తలగొరుగడమనే పని చేస్తుంటాం.

కయ్యానికి కాలుదూసి నా మీదికి వచ్చినవాడు బంధువైతే నేమి? బావమఱదియైతే నేమి? అతని అఖర్వగర్వనిర్వాపణార్థమే తలగొఱిగానని నీవు చెప్పదలచినా, కాలువలుకాలువలుగా తలగొఱుగడం హాస్యరసస్ఫోరకం. వేషభాషా చేష్టలచే నలుగురు నవ్వేరీతిగా చేయడమే హాస్య లక్షణమని భావించినా, అందులో అవమానం, ఆవేదన నిల్చియున్నది, తమ్ముడా! అని, బలభద్రుడు రసికశిఖావతంసుడైన కృష్ణమూర్తిని అధిక్షేపిస్తున్నాడు. కందపద్యం

**కొందఱు రిపులని కీడును**
**గొందఱు హితులంచు మేలు గూర్పవు నిజ మీ**
**యందఱియందును సముడవు**
**పొందగ నేలయ్య! విషమబుద్ధి ననంతా॥** 60

అర్థం : అనంతా = అంతం - నాశంలేని వాడా! ఈవు = నీవు; కొందఱు = కొంతమంది; రిపులు+అని = శత్రువులని; కీడును = చెఱుపును; కొందఱు = మఱికొంతమంది; హితులు+అంచు = ఆప్తులు అంటూ; మేలున్ = మంచిని; కూర్పవు = చేయువు; అందఱియందును = జనులందఱి యందుకూడ; సముడవు = సమానుడవు; నిజము = సత్యమే; అయ్య = ఓ తండ్రీ! ఓ జగత్పితా! విషమ బుద్ధిన్ = భేద బుద్ధిని; పొందగన్ = పొందడానికి; ఏల = ఏమికారణం?

తా॥ నాశరహితుడవైన కృష్ణా! నీవు శత్రువులని కొందఱికి కీడును, మిత్రులని కొందఱికి మేలును చేసేవాడవుకావు. సర్వసమానుడవనడం యథార్థమే. మఱి రుక్మి విషయమై విషమ - భేద బుద్ధిని ఎందుకు కల్పించుకొన్నావయ్యా?

వ్యాఖ్య : సర్వసముడైన కృష్ణునికి విషమబుద్ధి ఎందుకున్నది?

కృష్ణభగవానుడు అనంతుడు. దేశకాలవస్తు పరిచ్ఛేదం లేనివాడు. ఈచోట ఉంటాడు, ఆచోట ఉండడనేది దేశపరిచ్ఛేదం. అలాకాక, అన్నిచోట్ల నిండి ఉంటాడు. అంటే దేశ పరిచ్ఛేదరహితుడన్నమాట. ఈ కాలాన ఉంటాడు. ఆకాలాన ఉండడనేది లేకుండా, అన్ని కాలాలలో ఉండే వాడు కాలపరిచ్ఛేదరహితుడు. అలాగే ఒక వస్తు విభాగం లేకుండా అన్ని వస్తువులలో ఉండే వాడు వస్తు పరిచ్ఛేదం లేనివాడు. ఇలా దేశకాలాది పరిచ్ఛేదం లేకుండా సర్వదేశకాలవస్తువులలో సర్వదా ఉండేవాడు కాబట్టి అనంతుడు భగవానుడు. "సత్యం జ్ఞాన మనంతంబ్రహ్మ" అని ఉపనిషత్తు బోధిస్తుంది.

అనంతుడైన కృష్ణభగవానునికి శత్రు మిత్రభేదం లేదు. 'వైర్ఘృణ్యావైషమ్యే నసాపేక్షత్వాత్" అనే బ్రహ్మసూత్రం నిర్దయ, వైషమ్యం అంటే పక్షపాతం భగవానునికి లేవంటుంది. "నమేద్వేష్యో஽స్తి నప్రియః" శత్రుమిత్రులు లేరని భగవద్గీతోపదేశం. ఎవరికీ కీడు చేసే వాడూకాడు. సర్వభూతహితరతుడు భగవానుడు.

"రిపురపలప వ్యక్తాయాంవాచి" - అపకీర్తిని పలికే వాడురిపువు. లేదా, కీర్తిని అపలపించేవాడురిపువు. "యేషాం శ్రీకృష్ణలీలా లలిత గుణరసే సాదరౌనైవకర్ణౌ, ధిక్తాన్ ధిక్తాన్ ధిగేతాన్ కథయతి సతతం కీర్తన స్థో మృదంగః॥" ఎవరికి శ్రీకృష్ణుని చరణ సరసీరుహాల యందు భక్తి ఉండదో, నాలుక గోవిందుని కీర్తించదో, చెవులు కృష్ణలీలలను ఆదరంగా వినడానికి విముఖంగా ఉంటాయో, అట్టి వారి జీవితం ఛీ, ఛీ, వ్యర్థమని మృదంగమే సంకీర్తన గోష్ఠిలో "ధిక్తాన్, ధిక్తాన్, ధిగే తాన్" అని శబ్దిస్తుంటుంది కదా! ఒక అచేతనవస్తువే కృష్ణభగవానునియందు అభిముఖ్యం లేని వారిని 'ఛీ' కొట్టితే, ధిక్కరిస్తే, ఇక సచేతనలోకం ఆయనను ద్వేషిస్తూ నిందించేవారిని కృష్ణునికి 'రిపు'లనక ఊరకుండదుకదా! లోక కంటకులే కృష్ణమూర్తిని దూషించి, శత్రువులనబడుతారు. కృష్ణుడు స్వయంగా భగవానుడు. కాబట్టి, పరమాత్ముడు అందరి హృదయాలలో ఉన్నట్లే లోకకంటకుల హృదయాల్లో కూడా ఉన్నాడు. కాని, వారికి భక్తి భావం లేనందువల్ల "కంటకాగ్ర ఇవస్థితః" ముండ్లమీద ఉన్నట్లు ఉంటాడు, అని శాస్త్రం ఉద్బోధించడం గమనీయం. వారి వారి మంచి, చెడ్డ (పనులకు) కర్మలకు ఫలమిచ్చే వాడేకాని, వారి కర్మలకు బాధ్యుడు మాత్రం కాడు. పనిచేసి ఫలాన్ని పొందే హక్కు ప్రజలకు ఉన్నప్పటికీ, పనిని బట్టి ఫలాన్ని నిర్ణయించి ఇచ్చే 'సత్త' పై (అధికారంగల) వానికే ఉంటుందన్నదిలోకజ్ఞత.

అందుకే బలరాముడు, అందఱియందును సముడవు; నీవు వైరియని కీడును, ఇష్టుడని మేలును చేకూర్పవు; ఇది నిజమనడంలో శాస్త్రార్థమెంతో ఉంది. పైగా, సర్వసమత్వానికి వ్యతిరేకంగా, రుక్మి పట్ల వైషమ్యం ఎందుకు కలిగిందో కృష్ణునికి తప్ప బలభద్రునికే తెలియ(లే)దనిపిస్తుంది కదా! అయ్యా! ప్రపంచానికే తండ్రివి, నీకే తెలియాలి. 'అయ్య' అనేది భావగర్భిత పదం.

(అప్పటికి భూలోకంలో కృష్ణుడు,

"పరిత్రాణాయసాధూనాం, వినాశాయచదుష్కృతాం।

ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥"

సాధువులను రక్షించి, దుష్టులను శిక్షించి, ధర్మసంస్థాపన కోసమే ప్రతి యుగంలో సంభవిస్తుంటాను" అనే గీతారహస్యాన్ని ప్రకటించకపోవడమే కారణం కావచ్చు. లేదా; ధర్మసంస్థాపనకోసం సాధురక్షణ, దుష్ట శిక్షణ చేయడం వల్ల కృష్ణుడు విషమ బుద్ధిగల వాడుగా తోచడం నైజమే.) కందపద్యం.

**వ : అని వితర్కించి పలికి, రుక్మిణీదేవి నుపలక్షించి యిట్లనియె.**

అర్థం : వితర్కించి = ఆక్షేపించి; ఉపలక్షించి = చూచి;

తా : బలరాముడు శ్రీకృష్ణుణ్ని ఆక్షేపించాడు.

తర్వాత సోదరుని భంగానికి ఖిన్నయైన రుక్మిణిని జూచి ఓదార్చడానికి ఇట్లు పలికాడు.

**తోడం బుట్టిన వాని భంగమునకున్**
**దుఃఖించి మా కృష్ణు నె**
**గ్గాడం జూడకు మమ్మ। పూర్వ భవక**
**ర్మాధీనమై ప్రాణులన్**
**గీడున్ మేలును జెందు, లేడొకడు శి**
**క్షింపంగ రక్షింప, నీ**
**తోడం బుట్టువు కర్మశేష పరిభూ**
**తుండయ్యె నేడియ్యెడన్ ॥** 61

అర్థం : అమ్మ = తల్లీ! రుక్మిణీ! తోడన్ పుట్టినవాని భంగమునకున్ = సహోదరుడైన రుక్మియొక్క అవమానానికి; దుఃఖించి = వగచి; మా కృష్ణుని; ఎగ్గు+ఆడన్ = నిందించే మాటలాడడానికి; చూడకుము = యత్నించకు; ప్రాణులను = జీవులను; పూర్వ భవ కర్మ+అధీనమై = మునుపటి జన్మలయందు చేసిన కర్మ (పను)లను అనుసరించినదై; కీడున్

= ఆపద; మేలునున్ = సంపదకూడా; చెందున్ = పొందుతుంది; శిక్షింపగన్ = శిక్షించడానికీ; రక్షింపన్ = మన్నించడానికీ; ఒకడు = వేరే ఒకడు; లేడు = శక్తుడుకాడు. నేడు = ఈనాడు; ఇయ్యెడన్ = (ఈ+ఎడన్) ఈ సమయాన; నీతోడన్ పుట్టువు = నీ సహోదరుడు; కర్మ శేష పరిభూతుండు+అయ్యె = పూర్వజన్మమందు చేసిన పాపకర్మ (యొక్క) మిగులడం చేత అవమానింపబడిన వాడయ్యాడు.

తా॥ అమ్మా, రుక్మిణీ! నీ యన్నను పరాభవించాడని నీవు మా కృష్ణుణ్ని నిందింప యత్నించకు. జీవులకు తాము పూర్వజన్మల యందు చేసిన పుణ్య పాప మిశ్ర కర్మలే మేలు కీళ్ళను అనుభవింపజేస్తాయి. కాని మరొకడు దండించడానికి గానీ, మన్నించడానికి గానీ సమర్థుడనుకోరాదు. ఇప్పుడు రుక్మితన పూర్వజన్మలో చేసిన దుష్కర్మచేతనే పరిభూతుడయ్యాడని బలరాముడు పలికాడు.

వ్యాఖ్య : జీవులు పూర్వ జన్మకృతకర్మాధీనులన్నాడు బలరాముడు.

"బుద్ధిః కర్మానుసారిణీ" అన్నట్లు లోకంలో ప్రాణులకు తాము మునుపటిజన్మలో చేసిన పుణ్య పాపకర్మలననుసరించి మంచిబుద్ధి గానీ, చెడుబుద్ధి గానీ కలుగుతుంది. సద్బుద్ధితో సత్కర్మలను చేసి సంపన్నుడవుతాడు. దుర్బుద్ధితో దుష్కర్మలను చేసి ఆపన్నుడవుతాడు.

"సుఖస్య దుఃఖస్య నకోఽపి దాతా, పరోదదాతీతి కుబుద్ధి రేషా। అహంకరోమీతి వృథాఽభి మానః, స్వకర్మ సూత్రగ్రథితో హిలోకః॥"

వేరే ఒకని వల్ల నాకు సుఖదుఃఖాలు కలుగు తున్నాయను కోవడం దుర్మతి లక్షణమే. నేనే మరొకనికి కష్టసుఖాలను కలిగిస్తున్నానని గొప్పగా భావించుకోవడం దురభిమానమే. తనసుఖానికి గానీ, దుఃఖానికి గానీ మరొకడు కారకుడుకానే కాడు. ప్రతిప్రాణి కేవలం తన కర్మపాశం చేతనే బద్ధుడై యున్నాడని ఈ శ్లోకార్థం.

"విను కర్మంబొనరించును
జననము మరణం బునదియ సౌఖ్యము దుఃఖం
బును గావించును, తనచే
సిన దానంబడక పోవ శివునకు వశమే"॥
"తన పూర్వకర్మ ఫలములు
తనకు వశము గాక పొందు దరితో వానిన్
గనుకొన నేరక మూఢుడు
తన కాపదయైన చోట దైవము దూఱున్॥"

ఇత్యాదిగా శాస్త్రం బోధిస్తున్నది.

కాబట్టి, నీయన్న రుక్మి పూర్వజన్మలోతాను చేసిన పాపకర్మ ఫలం పూర్తిగా అనుభవింపజాలలేదు. ఆదుష్కర్మకొంత మిగిలి యుండడం వల్ల ఈ జన్మలో దాని ఫలంగా అవమానాన్ని పొందాడని కర్మసిద్ధాంతాన్ని బోధించాడు.

'అయ్యా' అని గతపద్యంలో శ్రీకృష్ణుణ్ని సంబోధన ఉంది. ఈ పద్యంలో రుక్మిణీ దేవిని 'అమ్మ' అని సంబోధించాడు బలరాముడు.

కృష్ణుడు 'జగత్పతి' అయితే రుక్మిణి 'లోకమాత' కదా! "ప్రకృతిం పురుషంచాపి విద్ధ్యనాదీ ఉభావపి" - వీరిద్దరూ సనాతనులే. నిత్య దంపతులు.

అమ్మా! రుక్మిణీ! మాకృష్ణుణ్ని నీకంటె వేరుగా భావించి, నీ సహోదరుణ్ని అవమానించాడని దూషింపవద్దు సుమా! ప్రియంగా వర్తించుమన్నాడు. శార్దూలవిక్రీడితం.

**చంపెడి దోషముగలిగిన**
**జంప జనదు బంధుజనుల జను విడువంగా**
**జంపిన దోషము సిద్ధము,**
**చంపను మఱియేల మున్న చచ్చినవానిన్॥** 62

అర్థం : చంపెడి = చంపవలసినంతటి; దోషము = తప్పు, కలిగినన్ ; బంధుజనులన్ = చుట్టాలను; చంపన్ చనదు = చంపకూడదు. విడువంగాన్ చనున్ = విడిచిపెట్టదగును; చంపిన = చంపితే; దోషము = పాపం; సిద్ధము = తప్పక కలుగుతుంది; మున్న = మునుపే; చచ్చిన వానిన్; మఱి = మళ్ళీ; చంపను, ఏల = చంపడం ఎందుకు?

తా॥ బంధుజనులను చంప దగినంత నేరం చేసినా, విడిచి పెట్టాలిగాని చంపరాదు. పరాభవం - అవమానంచేత ముందే చచ్చిన వాణ్ని మళ్ళీ చంపడ మేమిటి? అనే నానుడిని ఇమిడించుకొన్నదీకందపద్యం. తాత్పర్యస్పష్టం.

**బ్రహ్మచేత భూమిపతులకీ ధర్మంబు**
**కల్పితంబు రాజ్యకాంక్ష జేసి**
**తోడి చూలునైన దోడబుట్టిన వాడు**
**చంపుచుండు గ్రూరచరితుడగుచు॥** 63

అర్థం : తోడబుట్టినవాడు = ఒకే కడుపునజన్మించినవాడు; రాజ్యకాంక్షన్ చేసి = రాజ్య మందలి ఆశ చేత; క్రూరచరితుడగుచు దారుణమైన (చెడ్డ) నడవడి కలవాడయి; తోడిచూలునైనన్ = తన తోబుట్టువును కూడా; చంపుచుండును; ఈ ధర్మంబు = ఈ న్యాయం; భూమి పతులకు = రాజులకు; బ్రహ్మచేత, కల్పితంబు = కలుగజేయబడినది.

తా॥ రాజ్య మందలి అపేక్షచేత రాజులు క్రూరులై అన్న దమ్ములనైనను చంపుతుంటారు. పూర్వం బ్రహ్మదేవుడు ఆయా వర్ణధర్మాలనేర్పరచేటప్పుడు యుద్ధంలో తండ్రి కొడుకులు, అన్న దమ్ములు అనే భేదం లేకుండా ఎవరినైనా చంపడం క్షత్రియులకు ఆచారమే, అని నిర్ణయించాడు. కాబట్టి దీని కోసం విచారింపదగదన్నాడు బలరాముడు. రాజులు రాజ్యభోగాలకు ఆశపడి క్రూరచరితులవడం విధి విహితమని వెల్లడించిన 'ఆటవెలది' ఇది.

**భూమికి ధనధాన్యములకు**
**భామలకును మానములకు బ్రాభవమునకున్**
**గామించి మీదుగానరు,**
**శ్రీమదమున మానధనులు చెనకుదురొరులన్॥** 64

అర్థం : మాన ధనులు = అభిమానమేధనంగా కల వారు; భూమికి = రాజ్యంకోసం; ధనధాన్యములకు = ధనంకోసం, ధాన్యం కోసం; భామలకును = స్త్రీల కోసమూ; మానములకున్ = గౌరవంకోసమూ, ప్రాభవమునకున్ = ప్రభుత్వం కోసమూ; కామించి = కోరి; మీదు గానరు = ఆపైన వచ్చే బాధలను ఆలోచింపరు; శ్రీమదమునన్ = ఐశ్వర్యంవలని క్రొవ్వుచేత; ఒరులన్ = ఇతరులను, చెనకుదురు = బాధిస్తుంటారు.

తా॥ అధికుల మనిపించుకోవాలనే కోరిక కలిగిన రాజులు భూమినీ, ధనాన్నీ, ధాన్యాన్నీ, స్త్రీలనూ, ప్రభుత్వాన్నీ అపేక్షిస్తుంటారు. దాని ఫలితంగా తర్వాత పరలోకంలో తాము అనుభవింపగల నరకబాధలను ఆలోచింపక, ఐశ్వర్యమదం చేత ఇతరులను కయ్యానికి రేపి వారితో పోరాడుతుంటారు. ఇది వారికి నైసర్గికం. కందం.

వ : **వినుము. దైవమాయంజేసి, దేహాభిమానులైన మానవులకున్ బగవాడు, బంధుండు, నుదాసీనుండు నను మోహంబు సిద్ధం బైయుండు జలాదులయందు జంద్ర సూర్యాదులును, ఘటాదులయందు గగనంబును, బెక్కై కానంబడు భంగి, దేహధారులందఱికి నాత్మయొక్కండయ్యును బెక్కండై తోచు. ఆద్యంతంబులుగల యీ దేహంబు ద్రవ్య ప్రాణ గుణాత్మకంబై, యాత్మయందున విద్యచేత గల్పితంబై, దేహిని సంసారంబుం ద్రిప్పు. సూర్యుండుతటస్థుండై యుండ, బ్రకాశమానంబులైన దృష్టి రూపంబుల బోలె నాత్మతటస్థుండై యుండ దేహేంద్రియంబులు**

**ప్రకాశమానంబులగును. ఆత్మకు వేఱొక్కటి తోడ సంయోగవియోగంబులు లేవు. వృద్ధి క్షయంబులు చంద్రకళల కుంగాని, చంద్రునికి లేనికైవడి జన్మనాశంబులు దేహంబునకుగాని యాత్మకు కలుగనేరవు. నిద్రపోయిన వాఁడాత్మను విషయ ఫలానుభవంబులు సేయించు తెఱంగున, నెఱుక లేని వాడు నిజముగాని యర్థము నందు భవము నొందుచుండు గావున.**

అర్థం : వినుము = ఆకర్ణింపుము. దైవ మాయంజేసి = విష్ణుదేవుని మాయ వల్ల; దేహ+అభిమానులైన = దేహమే ఆత్మ అనే అభిమానంగల వారైన; మానవులకున్ = జనులకును; పగవాడు = శత్రువు; బంధుండు = చుట్టం - మిత్రుడు; ఉదాసీనుండు = శత్రుత్వంగానీ; మిత్రత్వంగానీ ఏమీలేని వాడు; అను మోహంబు = అనునట్టి అజ్ఞానం; సిద్ధంబైయుండు = తప్పకకలిగి ఉంటుంది. జల+ఆదుల యందు = నీళ్ళు మొదలైన వాటియందు; చంద్ర, సూర్య+ఆదులును = చంద్రుడు, సూర్యుడు మొదలైనవి; ఘట+ఆదులయందు = కుండలు మొదలైన వాటియందు; గగనంబును = ఆకాశమూ; పెక్కై = అనేకాలై; కానంబడు భంగిన్ = కనబడేరీతిగా; దేహధారులు + అందఱికిన్ = దేహాన్ని దాల్చిన సకల జీవులకును; ఆత్మ = పరమాత్మ; ఒక్కండు+ అయ్యును = ఒక్కడే అయినప్పటికీ; పెక్కండై = అనేకులై; తోచున్ = కనబడుతుంటాడు.

తా : బలరాముడు రుక్మిణీ దేవికి కలిగిన విషాదాన్ని శమింపజేయడానికి తత్త్వోపదేశం చేస్తున్నాడు. అమ్మా! రుక్మిణీ! విష్ణుమూర్తి మాయ విచిత్రమైనది. "విష్ణోర్విచిత్రాః ప్రభవంతి మాయాః" ఆ దేవుని మాయచేత మానవులకు ఆత్మకాని దేహమందు ఆత్మ అనే బుద్ధి, అస్వతంత్ర మందు స్వాతంత్ర్యబుద్ధి జనిస్తుంది. దేహాభిమానులకు స్థూల సూక్ష్మ కారణశరీరాలు, అంతరింద్రియ, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, ప్రాణాదులన్నీ తామే అనునట్టి బుద్ధి గలవారికి - శత్రుడు, మిత్రుడు, ఉదాసీనుడంటే మధ్యస్థుడు అనే భేదం అజ్ఞానం వల్లనే కలుగును. కాని నిజంగా ఒకడు మిత్రుడుకాడు, ఒకడు శత్రువుకాదు.

శత్రు మిత్రాది విభాగం అజ్ఞానకల్పితమన డానికి దృష్టాంతాన్ని చెబుతున్నాడు.

"ఏక ఏవ పరోహ్యాత్మా సర్వేషామపి దేహినామ్।
నానేవ గృహ్యతే మూఢైః యథాజ్యోతిర్యథానభః॥

అని వ్యాసభాగవత సూక్తి.

చంద్రుడు, సూర్యుడు, ఆది శబ్దంచేత చుక్కలు, అగ్ని మొదలైన జ్యోతీరూపద్రవ్యాలు. జలాదులు - నీళ్ళు, మణులు, అద్దాలు స్వచ్ఛమైన పదార్థాలు. జ్యోతీరూపద్రవ్యం అంటే సూర్యుడు ఒక్కడే అయినా, స్వచ్ఛమైన నీళ్ళల్లో అనేకులుగా

కనబడుతుంటాడు. అగ్ని కట్టెలలోనూ, బండలలోను గూఢంగా ఉండి అనేకంగా కనబడుతుంటుంది. ఆ విధంగానే దేహాన్ని ధరించిన అందరి ఆత్మలకు - నరసురాది సకల ప్రాణులకూ ఒక్కడే అయిన పరమాత్మ అనేకులుగా కనబడుతుంటాడు. "అంతః ప్రవిష్టః శాస్తాజనానాం సర్వాత్మా" జనులందరి హృదయాలలో ప్రవేశించి అనేకులుగా భావింపబడే శాసకుడైన పరమాత్ముడు మాత్రం ఒక్కడే. అతడే సర్వాత్ముడు అని శ్రుతి బోధిస్తుంది. చరాచరజగత్తు పరమాత్మకు శరీరంకాగా, ఆజగచ్ఛరీరానికి ఆత్మ యైనవాడు పరమాత్ముడు ఒక్కడే అని వేదాంత శాస్త్రం బోధిస్తుంది.

"ఏక ఏవ పరో హ్యాత్మా భూతే భూతే వ్యవస్థితిః। ఏకధా బహుధాచైవ దృశ్యతే జల చంద్రవత్॥" పరమాత్ముడొక్కడే ఒక్కొక్క జీవుని యందు ఒక్కొక్కడుగా ఉండి, - చంద్రుడు ఒక్కడే అయినా వేర్వేరు కడవలలోనిండిన నీటిలోనూ, లేదా, వేర్వేరు అద్దాలలోనూ అనేకచంద్రులుగా కనబడినట్లు - అనేక పరమాత్మలున్నట్లు కనబడుతుంటాడు. కాని పరశబ్ద వాచ్యుడైన దేవుడు - పరమాత్మ - ఒక్కడే, అని స్మృతి కూడా విశదీకరిస్తుంది.

గగనం అంటే ఆకాశం. అది అంతటా వ్యాపించి ఉంటుంది. వేర్వేరు ఘటాలలో - పాత్రలలోనూ, వస్తువులలోనూ ఆకాశం వ్యాపించి ఉన్నప్పటికీ ఆయా ఘటాలకు - వస్తువులకు ఉన్నదోషాలు ఆకాశానికి అంటవు కదా! అలాగే, పరమాత్మ సర్వజీవులలో అనుప్రవిష్టుడైనప్పటికీ ఆ జీవులకు ఉన్న దోషాలు పరమాత్మకు తగుల్కోవు అని ఆకాశాన్ని దృష్టాంతంగా తెలిపాడు బలరాముడు.

శరీరంలో కాళ్ళు, చేతులు మొదలైన అవయవాల్లో ఒకటి అనుకూలిస్తుంది ఒకటిప్రతి కూలిస్తుంది అనే భేదం ఉండదుకదా! అలాగే, పరమాత్మకు జగత్తు శరీరం వంటిదని తెలియని వారికే శత్రు మిత్రాది విభాగం ఉంటుంది కాని, ఆత్మజ్ఞానం కలవారికి ఆ భేదమే ఉండదు.

అర్థం : ఆది+అంతంబులు = జననమరణాలు; కల ఈ దేహంబు = కలిగియున్న ఈ శరీరం; ద్రవ్య, ప్రాణ, గుణ+ఆత్మకంబై, ద్రవ్య = పృథి వ్యాది పంచభూతాలు; ప్రాణ = పంచప్రాణాలు, ఇంద్రియాలును; గుణ = భూమికి గంధం, నీటికి రసం, తేజస్సుకు రూపం, గాలికి స్పర్శ, ఆకాశానికి శబ్దం అనే భూతపంచకగుణాలు; ఆత్మకంబై = స్వరూపంగా కలదై; ఆత్మయందు = జీవాత్మయందు; అవిద్యచేత = ప్రకృతి చేత; కల్పితంబై = చేర్చబడి, దేహి

= జీవుణ్ని; సంసారంబునన్ = పుట్టుక చావులుగల సంసారమందు; త్రిప్పు = పరిభ్రమింపజేస్తుంది. సూర్యుండు తటస్థుండైయుండన్ = సూర్యుడు సాక్షియై ఉండగా; ప్రకాశమానంబులైన = ప్రకాశింపజేయబడుతున్నవైన; దృష్టి రూపంబుల బోలెన్ = కన్నులును; ఆకన్నులయందు తోచిన రూపాలవలెనే; ఆత్మ తటస్థుండై యుండన్ = పరమాత్మ సాక్షియై ఉండగా; దేహేంద్రియంబులు = శరీరం, ఇంద్రియాలు; ప్రకాశమానంబులగును = తమ తమ వృత్తులలో ప్రవర్తింప జేయబడతాయి.

ఆత్మకు = జీవాత్మకు; వేఱొక్కటి తోడ = ఆత్మకంటె వేరైన దేహేంద్రియగుణాలతో, సంయోగ, వియోగంబులు లేవు = కూడడమూ, ఎడబాయడమూ అనేవి కలుగవు. వృద్ధి క్షయంబులు = పెరుగడం, తరుగడం అనేవి; చంద్రకళల కున్ గాని = చంద్రుని కళలకే తప్ప; చంద్రునికి లేని కైవడి = చంద్రునికి లేకుండేవిధంగా; జన్మనాశంబులు = పుట్టుకచావులు; దేహంబునకుగాని = శరీరానికేతప్ప; ఆత్మకు కలుగనేరవు = జీవాత్మకు కలుగజాలవు.

నిద్రవోయిన వాడు = నిద్రించినవ్యక్తి; ఆత్మను = భోక్తయైన తనను; విషయ ఫల+అను భవంబులు = స్వప్నమందుకలిగే విషయాల యొక్క మేలు కీడులవలని భోగాలను; చేయించు తెఱంగునన్ = చేయించే రీతిగా; ఎఱుక లేనివాడు; జ్ఞానంలేనివాడు, నిజముగాని = నిలుకడలేని; అర్థమునందు = విషయభోగమందు; భవమును+ఒందుచుండును = సంసారానుభవాన్ని; పొందుతుంటాడు. కావున

తా॥ దేహమెలాంటిది? దేహంకంటె వేరైన జీవాత్మకు సుఖదుఃఖానుభవమెట్లు కలుగుతుందో వివరింపబడుతున్నది.

పృథివ్యాది పంచభూతాలతోనూ, పంచప్రాణాలతోనూ, ఇంద్రియాలతోనూ, శబ్దస్పర్శరూపరసగంధాలనే భూతపంచక గుణాలతోనూ కూడి ఏర్పడినది దేహం. ఈదేహానికే ఆద్యంతాలున్నాయి, అంటే ఉత్పత్తి వినాశాలున్నాయి. జీవాత్మ నిత్యమైనది. జ్ఞానస్వరూపమది. పంచభూతాదిసంఘాత్మక మైన ఈ దేహం ఆత్మను చేరడం వల్ల ఆత్మకు సుఖదుఃఖానుభవాన్ని కలిగిస్తున్నది. దేహసంయోగం జీవాత్మకు కలిగినప్పుడు జీవుడు పుట్టాడు అని, దేహం వియోగం కలిగినప్పుడు జీవుడు చనిపోయాడని లోకం అనుకొంటుంది. కాని నిత్యమై, జ్ఞానాత్మకమైన జీవునికి పుట్టుకలేదు. చావులేదు.

దేహం తన సంబంధంచే జీవాత్మను సంసారమందు త్రిప్పుతున్నట్లే, అది పరమాత్మనుకూడా సంసరింపచేయవచ్చుకదా! అనుకొంటే, జీవునికి దేహం బంధమైనట్లు పరమాత్మకు దేహం బంధం కాదని దృష్టాంతమిచ్చి బోధింపబడు తున్నది. సూర్యుని ప్రకాశంచేతనే కన్నులు వస్తువులను, వాటి రూపాలను

చూడగలుగుతాయి. సూర్యుడు తటస్థుడు - సాక్షీభూతుడుకదా! అలాగే సాక్షీభూతుడైన పరమాత్మ దేహమందు ప్రకాశిస్తుంటే ఆత్మ, దేహేంద్రియాదులు తమ తమ వృత్తులలో ప్రవర్తిస్తుంటాయి.

సూర్యకాంతితో వస్తువులను చూడగలిగే కన్నులూ, ఆ కన్నులచే చూడబడే రూపాలూ సూర్యునికి సంబంధించి నవి కావు కదా! అలాగే, పరమాత్మచే ప్రకాశించే జీవాత్మలూ, దేహాలూ వాటి వృత్తులూ పరమాత్మకు సంబంధించియుండవు.

ఆద్యంతాలు గల దేహమందున్న జీవాత్మకు ఆద్యంతాలు లేవని దృష్టాంతంచేత వివరింపబడుతున్నది.

చంద్రుని పదిహేను (15) కళలకే వృద్ధి క్షయాలు (పెరుగుడం, తరుగడం) కలుగుతాయి. పదహార(16)వదైన అమృత కళగల చంద్రునికి మాత్రం వృద్ధిలేదు, క్షయంలేదు. అట్లే, చావుపుట్టుకలు దేహానికే గానీ ఆత్మకు లేవు. ఉండడం, పుట్టడం, పెరుగడం, మారడం, తరుగడం, నశించడం అనే షడ్భావ వికారాలు శరీరానికే కలుగుతాయి; కాని జీవాత్మకు ఈ వికారాలు లేవు. ఇక్కడ "మృతిరస్యకుహూరివ" అని వ్యాసభగవానుని సూక్తి. చంద్రకళ కనబడని అమావాస్యతిథికి 'కుహూః' అని పేరు. "సానష్టేందుకళా కుహూః" (అమరం). కృష్ణపక్షంలో కళలకే క్షయంగానీ చంద్రునికి కాదు. అయితే, అమావాస్య నాడు చంద్రునికే క్షయం జరిగిందనుకొన్నట్లే, (మృతి) చావు దేహానికే జరుగుతున్నా అది ఆత్మకే జరుగుతుందని జనులు భ్రమతో వ్యవహరిస్తుంటారన్నాడు వ్యాసమహర్షి.

నిద్రించిన వ్యక్తి, స్వప్నంలో చూడబడే సుఖ దుఃఖాది భోగవిషయాలు స్థిరమైనవి కాకున్నా, అవి స్థిరమైనట్లు, తాననుభవిస్తున్నట్లు అనుభవిస్తున్నంతకాలం అనుకొంటాడు. అలాగే జ్ఞానహీనుడు శరీరంలో కలిగే వికారాలు శరీరసంబంధం చేతనే కలుగుతూ, నిలువకుండా పోతుంటాయని గమనించక, నిత్యమనుభవిస్తుంటా నని బ్రతికి నంతకాలం సంసారభోగాసక్తుడవుతాడు. కావున.

**అజ్ఞానజ మగుశోకము**
**విజ్ఞాన విలోకనమున విడువుము నీకుం**
**ప్రజ్ఞావతికిందగునే**
**యజ్ఞానులభంగి వగవ నంభోజముఖీ॥** 65

అర్థం : అంభోజముఖీ = కమలం వంటి ముఖం కలిగిన ఓ రుక్మిణీ! అజ్ఞానజ మగు = అజ్ఞానంవల్ల కలిగిన; శోకము = దుఃఖాన్ని; విజ్ఞాన విలోకనమున = విశేష జ్ఞానదృష్టిచేత; విడువుము = తొలగించుము; ప్రజ్ఞావతికిన్ = బుద్ధిమంతురాలవైన; నీకున్ = నీకుకూడా; అజ్ఞానుల భంగి = జ్ఞానంలేనివారలవలె; వగవన్ = దుఃఖించడం, విచారపడడం, తగునే = తగునా?

తా॥ ఓకమల ముఖీ! రుక్మిణీ! ఆత్మస్వరూప, పరమాత్మ స్వరూప జ్ఞానంచేత అజ్ఞానంవల్ల జనించిన దుఃఖాన్ని దూరం చేయుమమ్మా! అనుభవజన్యజ్ఞానం కలిగిన నీవు నీ సోదరుడైన రుక్మిని కృష్ణుడు అవమానపరచాడని అజ్ఞానుల వలె శోకించడం తగదు. కందపద్యం.

**వ : ఇట్లు బలభద్రుని చేత దెలుపంబడి రుక్మిణీదేవి దుఃఖంబు మానియుండె. అట రుక్మియనువాడు ప్రాణావశిష్టుండై, విడువబడి, తన విరూపభావంబునకు నెరియుచు, హరిం గెల్చికాని కుండిన పురంబు జొరనని ప్రతిజ్ఞ సేసి, తత్సమీపంబున నుండె. ఇవ్విధంబున.**

అర్థం : ప్రాణ+అవశిష్టుండై = ప్రాణంచేత మాత్రం మిగిలిన వాడై; విరూపభావంబునకు = వికారరూపాన్ని పొందినందుకు; ఎరియుచున్ = తాపపడుతూ; ప్రతిజ్ఞ సేసి = ఒట్టుపెట్టుకొని; తత్+సమీపంబునన్ = ఆకుండిన పురానికి దగ్గర ప్రదేశమందు.

తా॥ బలరాముడు జ్ఞానబోధ చేయగా రుక్మిణీ దేవి దివ్యజ్ఞానం కలిగి దుఃఖాన్ని మానింది. అక్కడ రుక్మి ప్రాణం మాత్రం మిగిలినవాడై తనకు కృష్ణుని వల్ల వికార రూపం కలిగినందుకు మండిపడుతూ, శ్రీకృష్ణుణ్ని జయించి తేతప్ప తాను కుండిన పురంలోకి ప్రవేశింపనని శపథం చేసి ఆ నగరానికి వెలుపలనే ఉండెను.

శ్లో : "చక్రే భోజకటం నామనివాసాయ మహత్ పురమ్।
అహత్వాదుర్మతిః కృష్ణమప్రత్యూహ్యాయవీయసీమ్।
కుండినం నప్రవేక్ష్యామీత్యుక్త్వాతత్రావసద్రుషా॥"

కృష్ణుణ్ని చంపనిదే, రుక్మిణిని తిరిగితేనిదే పట్టణంలోకి పోనని శపథం చేసి, భోజకటమనే పురాన్ని నిర్మించి అక్కడనే రుక్మి ఉండెనని శ్రీమద్వ్యాస భాగవతం. ఈ విధంగా,

**రాజీవ లోచనుడు హరి**
**రాజ సమూహములగెల్చిరాజసమొప్పన్**
**రాజితయగు తన పురికిని**
**రాజానన దెచ్చె బంధురాజి నుతింపన్॥** 66

అర్థం : రాజీవ లోచనుడు = కమలాలవంటి కన్నులు కలిగిన వాడైన; హరి = కృష్ణుడు; రాజసమూహమున్ = రాజులగుంపులను; గెల్చి = జయించి; రాజసము = (రజోగుణసంబంధమైన) ఠీవి; ఒప్పన్ = ప్రకటింపబడుతుండగా; రాజితయగు = ప్రకాశించే; తన పురికిన్ = స్వీయనగరానికి; బంధు రాజి = చుట్టాల పంక్తి - బంధువులందరు; నుతింపన్ = శ్లాఘింపగా; రాజ+ఆననన్ = చంద్ర బింబం వంటి ముఖం కలదైన రుక్మిణిని; తెచ్చెన్.

తా॥ శ్రీకృష్ణుడు, స్వయం వరానికి వచ్చిన రాజుల నందరిని జయించి, తనద్వార కానగరానికి బంధువులందరు కొని యాడుతుండగా, రుక్మిణీ దేవిని తీసుకొని వచ్చాడు. వృత్త్యనుప్రాసగల కందపద్యం.

వ : **అంత నయ్యాద వేంద్రుని నగరంబు సమారబ్ధ వివాహకృత్యంబును బ్రవర్తమాన గీత వాద్య నృత్యంబును, బ్రతిగృహాలంకృత విలసి తా శేష నరనారీ వర్గంబును, బరిణయమహోత్సవ సమాహూయమాన మహీపాల గజఘటా గండమండల దానసలిలధారాసిక్త మార్గంబును, బ్రతిద్వార మంగళాచార సంఘటిత క్రముక కదళికా కర్పూర కుంకుమాగరుధూపదీప పరిపూర్ణకుంభంబును, విభూషిత సకల గృహవేదికా కవాట దేహళీ స్తంభంబును, విచిత్ర కుసుమాంబర రత్నతోరణ విరాజితంబును, సముద్ధూత కేతన విభ్రాజితంబునునై, యుండె. అయ్యవసరంబున.**

అర్థం : అంతన్ = అప్పుడు; ఆ యాదవ+ఇంద్రుని నగరంబు = ఆయదువంశశ్రేష్ఠుడైన శ్రీకృష్ణుని పట్టణం, సమారబ్ధ, వివాహకృత్యంబును = ఆరంభింపబడిన, పెండ్లి పనులు కలదియు; ప్రవర్తమాన గీత, వాద్య, నృత్యంబును = జరుగుతున్న పాటలు, వాద్యాలు, ఆటలు కలదియు; ప్రతి గృహ- వర్గంబును। ప్రతిగృహ = ఒక్కొక్కయింటిలో, అలంకృత = అలంకరింపబడిన; అశేష = అందరు; నర నారీ వర్గంబును = స్త్రీ పురుషుల సమూహాలుకలదియు; పరిణయ - మార్గంబును । పరిణయ = పెండ్లియొక్క, మహోత్సవ = గొప్పవేడుకకు, సమాహూయమాన = పిలువబడుతున్న, మహీపాల = రాజులయొక్క గజ ఘటా = ఏనుగుల సమూహంయొక్క, గండమండల = చెక్కిళ్ళ ప్రాంతమందలి; దాన సలిల = మద జలంయొక్క, ధారా = ధారల చేత; సిక్త = తడుపబడిన, మార్గంబును = త్రోవలుగలదియు; ప్రతి ద్వార - కుంభంబును। ప్రతి ద్వార = ఒక్కొక్క యింటియందు; మంగళాచార = శుభకార్యం కోసం, సంఘటిత = కూర్చబడిన, క్రముక = పోకచెట్లచే; కదళికా = అరటి చేతను; కర్పూర = కర్పూరం యొక్క, కుంకమ = కుంకుమ పువ్వుయొక్క, అగరు = అగరుపొడియొక్క, ధూప = ధూపాల (పొగల) చేతను; దీప = దీపాల చేతను; పరిపూర్ణ = నిండుకొన్న; కుంభంబులును = కలశాలుకలదియు; విభూషిత - స్తంభంబును। విభూషిత = అలంకృతమైన; సకల గృహ = అన్ని యిండ్ల యొక్క,

వేదికా = అరుగులు; కవాట = తలుపులు, దేహళీ = ద్వార బంధాలును, స్తంభంబును = స్తంభాలు కలదియు; విచిత్ర - విరాజితంబును; విచిత్ర = రంగురంగుల; కుసుమ = పువ్వుల యొక్క; అంబర = వస్త్రాలయొక్క; రత్న = మణులయొక్క, తోరణ = తోరణాలచేత; విరాజితంబును = ప్రకాశించినదై; సముద్ధూత కేతన విభ్రాజితంబునునై = మీదికి ఎగురుతున్న జండాల (ధ్వజ పతాకాల) చేత చాలా శోభించినదై, ఉండె. ఆ+అవసరంబునన్ = ఆ సమయాన.

తా : అప్పుడు శ్రీకృష్ణుని నగరమైన ద్వారకలో పెండ్లి పనులు ఆరంభమయ్యాయి. అట పాటలు జరుపబడ్డాయి. వాద్యాలు వాయింపబడ్డాయి. ఇంటింట ఆడ-మగ వారందరు అలంకరించుకొని యుండిరి. వివాహ మహోత్సవం కోసం పిలువబడినరాజులయొక్క గజ సమూహాల గండమండలాలనుంచి స్రవిస్తున్న మదజలధారలచే పట్టణంలోని బాటలన్నీ తడిసి పోతుండెను. ప్రతి గృహద్వారంలో మంగళాచారంగా పోకచెట్లు, అరటి చెట్లు కట్టబడ్డాయి. కుంకుమాగరు ధూపాలతో, కర్పూర దీపాలతోనూ పూర్ణ కలశాలు ఉంచబడ్డాయి. ఒక్కొక్క ఇంటిలో అరుగులు, కడపలు, తలుపులు స్తంభాలు అందంగా అలంకరింపబడినాయి. రంగురంగుల పూల చేత, వస్త్రాల చేత, రత్నాల చేత తోరణాలు కట్టబడ్డాయి.

అన్నిదిక్కులలో ధ్వజపతాకాలు ఆకాశంలో రెపరెపలాడుతూ నగరమంతా కళకళలాడుతుండింది.

**ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజచేతో హారిణిన్ మానవై**
**భవ గాంభీర్య విహారిణిన్ నిఖిల సంపత్కారిణిన్ సాధు బాం**
**ధవ సత్కారిణి బుణ్యచారిణి మహాదారిద్ర్య సంహారిణిన్**
**సువిభూషాంబర ధారిణిన్ గుణవతీ చూడామణిన్ రుక్మిణిన్॥** 67

అర్థం : హరి = శ్రీకృష్ణుడు; నిజచేతో హారిణిన్ = తనమనస్సును ఆకర్షించునట్టి; మాన, వైభవ, గాంభీర్య, విహారిణిన్ = చిత్తౌన్నత్యం చేతనూ, ఐశ్వర్యం చేతనూ, గంభీరమైన అభిప్రాయంచేతనూ విహరించునట్టి; నిఖిల సంపత్ కారిణిన్ = సకల సంపదలను కలిగించునట్టి; సాధుబాంధవసత్కారిణిన్ = సజ్జనులనూ, బంధుజనులనూ గౌరవించునట్టి; పుణ్యచారిణిన్ = ధర్మ ప్రవర్తన కల్గినట్టి; మహాదారిద్ర్య సంహారిణిన్ = గొప్ప పేదరికాన్ని నశింపజేయునట్టి; సువిభూష+అంబర ధారిణిన్ = మంచి నగలను, వస్త్రాలను ధరించునట్టి; గుణవతీ చూడామణిన్ = గుణవతులైన మగువలకు సిగలో నగయైనట్టి; రుక్మిణిన్ = రుక్మిణీదేవిని; ధ్రువ కీర్తిన్ = శాశ్వతమైన కీర్తితో, పెండ్లి+ఆడె = వివాహమాడెను.

తా : శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవిని పెండ్లాడెను. రుక్మిణీ దేవి మహిమమత్తేభవృత్తంలో వర్ణితం. సకలచరాచర పదార్థాలను హరించే శ్రీకృష్ణుని మనస్సును హరించే వ్యక్తిత్వం

కలది రుక్మిణీదేవి. "విష్ణోర్దేహానురూపాంవై కరోత్యేషా_త్మనస్తనుమ్." విష్ణుమూర్తికి తగిన రూపాన్ని తాను ధరించే దేవదేవి రుక్మిణి. (వి.పు) గొప్ప మనస్సుతో, వైభవంతో గర్భనిర్భరమైన ఆలోచనతో విహరించే ధీరవనిత వైదర్భి అని ఆమె చరిత్ర వల్ల విశదమవుతుంది. సకల సంప త్ప్రదాయిని. సాధుబంధుజనులను సత్కరించే సాధ్వీమణి. "పుణ్యానామపి పుణ్యో_సౌ". పుణ్యశబ్ద వాచ్యుడు శ్రీకృష్ణుడు. "స్యాద్ధర్మ మస్త్రీ యాంపుణ్యమ్" పుణ్యశబ్దానికి ధర్మమనే అర్థం వుంది. "ధర్మస్య ప్రభురచ్యుతః" శ్రీకృష్ణుడే ధర్మ ప్రభువు. ఆ ధర్మంతోనే మెలగే నెలతుక కాబట్టి పుణ్య చారిణి: పేదఱికంతో పాటు అనేక కష్టాలను, ఉపద్రవాలను అనుభవించడమే 'మహాదరిద్రం' "దారిద్ర్య ధ్వంసినీదేవీ సర్వోపద్రవవారిణీ" అని ప్రసిద్ధిని పొందింది ' హరిప్రియ.'

"మణిగణై ర్నానా విధైర్భూషితా?" అని స్తుతింపబడుతునే ఉంది. కాబట్టి, తాను అమూల్య వస్త్రాభరణాలను ధరించే సువాసిని.

"నారీణాముత్తమావధూః" అన్నట్లు సీమంతిను లకే శిరోమణిగా వెలిగే వేదవేద్యవల్ల తనకు 'రుక్మిణీశు'డని శాశ్వత మైన కీర్తి కలుగునట్లు శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవిని పరిణయమాడినాడు.

స్వాభావిక కల్యాణగుణపూర్ణను మనోజ్ఞంగా వర్ణించడం వల్ల స్వభావోక్త్యలంకారం. 'శ్రీకృష్ణుడు శ్రియః పతియే' అని ధ్వనిగర్భితం.

**సతులుం దారును బౌరులు**
**హితమతి గానుకలు దెచ్చి యిచ్చిరి కరుణో**
**న్నత వర్ధిష్ణులకునుమా**
**నితరోచిష్ణులకు రుక్మిణీ కృష్ణులకున్॥** **68**

అర్థం : పౌరులు = పురజనులు; సతులు = భార్యలు; తారులు = తామును; హితమతిన్ = ఇష్టమైన బుద్ధితో; కరుణ+ఉన్నత వర్ధిష్ణులకును = దయచేత గొప్ప వృద్ధిని పొందే స్వభావం కలవారైన; మానితరోచిష్ణులకు = పూజనీయమైన తేజస్సుచే ప్రకాశిస్తున్న; రుక్మిణీ కృష్ణులకున్ = రుక్మిణీ దేవికీ, శ్రీకృష్ణమూర్తికినీ; కానుకలు తెచ్చి, ఇచ్చిరి.

తా॥ పురజనులందఱు కుటుంబసమేతులై వచ్చి, మిక్కిలి దయాంతరంగులైన పూజనీయ తేజోమూర్తులైన రుక్మిణీ కృష్ణమూర్తులనే నవదంపతులకు మేలును కోరిప్రత్యేకంగా కానుకలను తెచ్చి సమర్పించారు. కందం.

**హరిపెండ్లికి గైకేయక**
**కురు సృంజయ యదు విదర్భకుంతి నరేంద్రుల్**
**పరమానందము బొందిరి**
**ధరణీశులలోన గాఢ తాత్పర్యములన్॥** 69

అర్థం : ధరణి+ఈశులలోనన్ = భూపతులలో, కైకేయక - నరేంద్రుల్ కైకేయక = కేకయ వంశస్థులును, కురు = కురు వంశస్థులును; సృంజయ = సృంజయవంశస్థులును, యదు = యదువంశస్థులును, విదర్భ = విదర్భుని వంశస్థులును, కుంతి = కుంతీభోజునివంశస్థులైన; నరేంద్రుల్ = రాజులు; గాఢతాత్పర్యములన్ = దృఢమైన సద్భావాలతో; హరి పెండ్లికిన్ = శ్రీకృష్ణుని వివాహానికి,; పరమ+ఆనందమున్ = గొప్పసంతోషాన్ని; పొందిరి.

తా॥ రాజులలో కేకయ, కురు, సృంజయ, యదు, విదర్భ కుంతీ దేశాధిపతులు శ్రీకృష్ణుని వివాహమహోత్సవాన్ని చూచి బ్రహ్మానందాన్ని పొందారు.

హరిపెండ్లియే ధరణీశుల పరమానందానికి మూలకందం.

**హరి యీ తెఱగున రుక్మిణి**
**నరుదుగ గొని వచ్చి పెండ్లి యాడుట వినిదు**
**ష్కర కృత్యమనుచు వెఱగం**
**దిరి రాజులు రాజసుతులు దిక్కులనెల్లన్॥** 70

అర్థం : హరి = శ్రీకృష్ణుడు; ఈ తెఱగున = ఈ విధంగా, రుక్మిణిన్ = రుక్మిణీదేవిని; అరుదుగన్ = ఆశ్చర్యంగా; కొని వచ్చి = తీసికొని వచ్చి; పెండ్లి+ఆడుట, విని = వివాహమాడిన వృత్తాంతాన్ని ఆలకించి; దిక్కులన్+ఎల్లన్ = అన్ని దిక్కులందున్న; రాజులు = భూపతులు; రాజసుతులు = రాకొమారులు; దుష్కరకృత్యము+అనుచు = చేయశక్యం గాని పని, అంటూ; వెఱగు+అందిరి = ఆశ్చర్యపడినారు.

తా॥ ఈ ప్రకారం రుక్మిణీ దేవిని కృష్ణుడు వింతగా తీసుకొని వచ్చి పెండ్లాడిన ఉదంతాన్ని పలుదెసల ఉన్న రాజులూ, రాజకుమారులూ విని 'ఇది కష్టసాధ్యకార్యమే' అంటూ ఆశ్చర్యపోయారు.

**అనఘ! యాది లక్ష్మియైన రుక్మిణి తోడ**
**గ్రీడ సలుపుచున్న కృష్ణుజూచి**
**పట్టణంబులోని ప్రజలుల్లసిల్లిరి**
**ప్రీతులగుచు ముక్తభీతులగుచు॥** 71

అర్థం : అనఘ = పాపంలేని ఓరాజా! ఆదిలక్ష్మియైన = సనాతన లక్ష్మీదేవి అవతారమైన; రుక్మిణి తోడ; క్రీడసలుపుచున్న = వినోదిస్తున్న; కృష్ణున్, చూచి, పట్టణంబులోని ప్రజలు; ప్రీతులు, అగుచు = అనురాగం వహించువారై; ముక్త భీతులు, అగుచు = విడిచిన భయంకలవారై; ఉల్లసిల్లిరి = గొప్పగా సంతోషించారు.

తా॥ పుణ్యాత్ముడవైన ఓ పరీక్షిన్మహారాజా! ద్వారకానగర ప్రజలు ఆదిలక్ష్మియైన రుక్మిణీదేవితో శ్రీకృష్ణుడు విహరించగా చూచారు. ఆ నూతన వధూవరుల పట్ల వారు ప్రీతిని పొంది భయరహితులై మహానందాన్ని అనుభవిస్తుండిరి,

**వ : అనిచెప్పి**

అని శ్రీశుకమహర్షి పరీక్షిన్మహారాజుకు రుక్మిణీ కల్యాణ కథను ప్రవచించాడు.

**కువలయ రక్షాతత్పర!**
**కువలయదళ నీలవర్ణ కోమలదేహా!**
**కువలయనాథ శిరోమణి!**
**కువలయ జనవినుత విమల గుణ సంఘాతా॥** 72

అర్థం : కువలయ రక్షా తత్పర = భూమండలాన్ని రక్షించడమందు ఆసక్తిని కలవాడా! కువలయ దళ నీలవర్ణకోమలదేహా = నల్లకలువరేకుల వలె శ్యామవర్ణం తో కూడిన, మృదువైన దేహంకలవాడా! కువలయ నాథ శిరోమణి = భూచక్రాధిపతులలో శ్రేష్ఠుడా! కువలయ - సంఘాతా! కువలయ = భూమండలమందలి, జన = జనులచేత; వినుత = పొగడబడిన,; విమల = స్వచ్ఛమైన, గుణ సంఘాతా = గుణ సమూహాలుకలవాడవైన ఓ శ్రీరామచంద్రా!

తా॥ పోతనకవి కృతిపతియైన శ్రీరామచంద్రస్వామిని స్తుతించాడు. భూమండలాన్ని దయతో రక్షించే ఆసక్తి కలవాడా! నీలోత్పల దళం వలె నీల వర్ణంతో కూడిన మృదువైన శరీరం కలవాడా!

రాజశ్రేష్ఠుడా! భూమండలంలోని ప్రజలచే కొనియాడబడిన నిర్మల గుణాల సముదాయాలు కలిగిన రామా! అని సంబోధించాడు. నాలుగక్షరాల ప్రాసకలిగిన కందపద్యమిది.

**సరసిజ నిభహస్తా! సర్వలోక ప్రశస్తా!**
**నిరుపమ శుభమూర్తీ! నిర్మలారూఢకీర్తీ!**
**పరహృదయవిదారీ! భక్తలోకోపకారీ!**
**గురుబుధజన పోషీ! ఘోరదైతేయ శోషీ!!** 73

అర్థం : సరసిజ నిభ హస్తా = కమలాలను పోలిన చేతులకలవాడా! సర్వలోక ప్రశస్తా = అన్ని లోకాలచేత - లోకులందరిచేత - కొనియాడబడిన వాడా! నిరుపమ శుభమూర్తీ = సాటిలేని చక్కని ఆకృతికలవాడా! నిర్మల + ఆరూఢకీర్తీ = స్వచ్ఛమై, స్థిరమైన కీర్తి కలవాడా! పరహృదయవిదారీ = పగవారి ఎదలను పగుల చీరేవాడా! భక్తలోక+ఉపకారీ = భక్తికలిగిన జనులకు మేలు చేయువాడా! గురుబుధ జన పోషీ = గురువులనూ, పండితజనులనూ పోషించు వాడా! ఘోరదైతేయశోషీ = క్రూరులైన రాక్షసులను ఎండగట్టువాడా!

తా॥ శ్రీరామచంద్రస్వామి తామరపూవులలాంటి మృదువైన హస్తాలు కలవాడు. చతుర్దశ భువనాల లోని ప్రాణులచేత పొగడబడినవాడు. సాటిలేని దివ్యమంగళ రూపంకలవాడు, పరిశుద్ధమై, స్థిరమైన యశస్సుకలవాడు. శత్రువుల హృదయాలను భేదించేవాడు. భక్తజనులకు యోగక్షేమాలను కలిగించేవాడు. ఆచార్యులనూ విద్వాంసులనూ పోషించేవాడు. ఘోర రాక్షసులను నశింపచేయువాడు శ్రీరాముడని సంబోధిస్తూ కవి స్తుతించాడు.

స్తుతి : ఇది రామనామ సంకీర్తనం. సాధు పరిత్రాణం, దుష్కృత వినాశం కలిగించే శ్రీకృష్ణ వైభవ స్తుతి.

కథా ఘట్టం, అధ్యాయం చివర - మాలినీ వృత్తరచనతో ముగింపబడింది.

గద్య : ఇది శ్రీపరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవతంబను మహాపురాణమునందు దశమస్కంధమున గల రుక్మిణీ కల్యాణము - శ్రీమాలోలనృసింహ కృపాకటాక్షపాత్ర, హరితసగోత్ర, శ్రీమనోహరాచార్య ప్రథమపుత్ర, ఉభయ వేదాన్త విద్వాన్ కారంచేటి తిరుమల వేంకటరాఘవాచార్య స్వామి రచించిన వైష్ణవీ వ్యాఖ్యా విలసితము సంపూర్ణము.

స్వస్తి

# శ్రీ రుక్మిణీ కల్యాణము

భగవంతుని కృపకు పాత్రుడు కావడానికి జాతి - విద్య - కులం - భౌతికబలం - ధన సంపత్తి ఇత్యాదులతో అవసరం ఉండదు. అవసరమైనది భగవంతుని యందు కేవలం పరమమైన విశ్వాసమే. భగవంతుడు సమస్త జీవులను సమానంగా ప్రేమిస్తాడు. అందరిమీద తన కృపను వర్షిస్తాడు.

వ్యాఖ్యాత మాటల్లో "బాలచరితం, ప్రౌఢ చరితం" అని రెండు భాగాలు గల శ్రీ కృష్ణచరితమనే మణిహారమందు పోతన "రుక్మిణీ కల్యాణాన్ని" మధ్యనాయక మణిగా కూర్చాడు. ఆంధ్రమహాభాగవతంలో రుక్మిణీ కల్యాణ కథా పద్యరచనా శిల్పవైఖరి అనల్పం. పోతన స్వతంత్ర భావన మధురాతి మధురం. భాగవతం చదివినా, విన్నా, భుక్తి -ముక్తి దాయకం. అందులో రమణీయమైన రుక్మిణీ కల్యాణము కథా కావ్యాన్ని తన్మయులై పఠించే అవివాహితులైన యువతీయువకులు అచిరకాలంలో, అనురూప్యమైన దాంపత్య సిద్ధిని పొంది, ఆనందంగా జీవిస్తారు."

మీరు కూడా పఠించి ప్రయోజనం పొందాలన్నదే మా కోరిక.

**చల్లా సాంబిరెడ్డి,** బి.ఎ., ఎల్ఎల్.బి.
సంపాదకులు

# శ్రీ రుక్మిణీ కల్యాణము

భగవంతుని కృపకు పాత్రుడు కావడానికి జాతి - విద్య - కులం - భౌతికబలం - ధన సంపత్తి ఇత్యాదులతో అవసరం ఉండదు. అవసరమైనది భగవంతుని యందు కేవలం పరమమైన విశ్వాసమే. భగవంతుడు సమస్త జీవులను సమానంగా ప్రేమిస్తాడు. అందరిమీద తన కృపను వర్షిస్తాడు.

వ్యాఖ్యాత మాటల్లో "బాలచరితం, ప్రౌఢ చరితం" అని రెండు భాగాలు గల శ్రీ కృష్ణచరితమనే మణిహారమందు పోతన "రుక్మిణీ కల్యాణాన్ని" మధ్యనాయక మణిగా కూర్చాడు. ఆంధ్రమహాభాగవతంలో రుక్మిణీ కల్యాణ కథా పద్యరచనా శిల్పవైఖరి అనల్పం. పోతన స్వతంత్ర భావన మధురాతి మధురం. భాగవతం చదివినా, విన్నా, భుక్తి -ముక్తి దాయకం. అందులో రమణీయమైన రుక్మిణీ కల్యాణము కథా కావ్యాన్ని తన్మయులై పఠించే అవివాహితులైన యువతీయువకులు అచిరకాలంలో, అనురూప్యమైన దాంపత్య సిద్ధిని పొంది, ఆనందంగా జీవిస్తారు."

మీరు కూడా పఠించి ప్రయోజనం పొందాలన్నదే మా కోరిక.

**చల్లా సాంబిరెడ్డి,** బి.ఎ., ఎల్ఎల్.బి.

సంపాదకులు